## సంగ్రహ వాల్మీకి

# సుందర రామాయ





ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

సంగ్రహ వాల్మీకి

# సుందర రామాయణము

కృతికర్త

**శ్రీ శంకరంబాడి సుందరాచారి**




ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

SANGRAHA VALMIKI
SUNDARA RAMAYANAMU
(Poetry)

*By*
**Sankarambadi Sundarachari**



T.T.D. Religious Publications Series No.485

T.T.D. First Edition : 1998

Copies : 2000

Price : Rs.15/-



*Published by :*
**M.K.R. Vinayak,** I.A.S.,
Executive Officer
T.T. Devasthanams
Tirupati



Printed at :
**Sivaram Offset Printers**
**Nellore.**

# ముందుమాట

సంస్కృత వాఙ్మయంలో ప్రపంచ ప్రఖ్యాతమైన మహాగ్రంథం వాల్మీకి మహర్షిచే రచింపబడిన రామాయణం. భారతీయుల ధార్మిక నైతిక గార్హస్థ్య జీవితాలకు అద్దం పడుతూవున్న ఈ గ్రంథానికి ఉన్నంత లోకప్రియత్వం మరి దేనికీ లేదు. అన్నదమ్ముల, తల్లిదండ్రుల, ఆలుమగల, స్నేహితుల, పరిజనుల, యజమానుల నడుమ ఏవిధమైన సంబంధం వుండాలో నిర్దేశించడంలో దీనికి ఇదే సాటి. ధర్మాధర్మాలతో, నీత్యవినీతులతో, మంచి చెడ్డలతో, కష్టసుఖాలతో సాగిపోయే లౌకిక జీవితానికి శాంతినీ, జ్ఞానాన్నీ ప్రసాదించే అర్హత రామాయణానికి మాత్రమే వుంది. వేదంచేత ప్రతిపాదింపబడిన పరమపురుషుడు శ్రీరాముడై అవతరించగా, వాల్మీకిద్వారా వేదం రామాయణ రూపంలో అవతరించిందనీ, 24 వేల శ్లోకాలు కలిగి గాయత్రీ మంత్రాక్షర సంపుటితంగా ఇది రూపు సంతరించుకొన్నదనీ, ప్రపంచం వున్నన్ని నాళ్ళూ ఈ కావ్యం నిలిచి వుంటుందనీ విజ్ఞుల మాట.

సంస్కృత భాషలోని ఈ రామాయణ కావ్యాన్ని ప్రసన్న కవి శంకరంబాడి సుందరాచారిగారు ఆంధ్రీకరించారు. ఈయన కవిత సరళసుందరం. ఆటవెలదికి వేమన్న సిద్ధహస్తుడైతే తేటగీతికి సుందరాచారిగారు కృతహస్తుడు. తెలుగు తల్లిని మల్లెపూదండలతో అర్చించి ప్రసిద్ధికెక్కిన ప్రసన్నకవిగారి సుందర రామాయణాన్ని భారతీయ సంస్కృతీ పరిరక్షణకు కంకణధారియైన తి.తి. దేవస్థానములు ముద్రించింది. చదువరులు దీనిని ఆదరిస్తారని మా విశ్వాసం.

ఆది కావ్యమిదం త్వార్షం పురా వాల్మీకినా కృతమ్ |
యః పఠేచ్ఛృణు యాల్లోకే నరః పాపా ద్విముచ్యతే ||

*కార్యనిర్వహణాధికారి*
తి.తి. దేవస్థానములు

# విషయసూచిక

సంగ్రహ వాల్మీకి

# సుందర రామాయణము




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

శ్రీ

సంగ్రహ వాల్మీకి

# సుందరరామాయణము

## బాలకాండము

శ్రీలు పొంగారు గడ్డ, విశిష్టతలము,
అమల సరయూనదీతీరమందుఁ గోస
లమను దేశము సకలసౌఖ్యముల కాట
పట్టుగాఁ బాడిపంటలఁ బడసియుండె. 1

దశరథ క్షితిపతి యయోధ్యను శిరోన
గరము నొనరించి సత్యవాగ్బలముతోడ
సతత సద్ధర్మవర్తియై స్వార్థరహితుఁ
డగుచుఁ బాలించె దాని న్యాయమ్ము నెఱిఁగి. 2

రాణి కౌసల్య, సతి సుమిత్రయును, సుంద
రాంగి కైకేయియును బత్నులై సతమ్ము
తనిని సేవించుచుండియుఁ దనయుఁ బడయ
కుండెఁ గడు వృద్ధుఁడయ్యు నాతం డదేమొ ! 3

ఇనకులం బటు దన్మూలమున నశించు
నని భయముఁ జెంది కులగురువౌ వసిష్ఠు
నడిగెఁ గులవర్ధనునిఁ గాంచనగు విధమ్ము
నరసిఁచెప్పఁగఁ దనకు నేదైననున్న. 4

అశ్వమేధమ్ము నొనరించి యవలఁబునిత
పుత్రకామేష్టిఁ జేసినఁ బుత్రుఁ బొంద
వచ్చు నని యన్న వరగురు వాక్యముల శి
రమునఁ దాలిచి నలిపె జన్నముల నతఁడు. 5

పుత్త్రకామేష్టి ముగియ దివ్యుం డొకండు
హోమకుండమ్ము వెల్వడి, భూమిపతికి
స్వర్ణకలశమ్ము నందించి చక్కమఱఁగె
నతుల కిమ్మిందుఁ గల పాయసము నటంచు. 6

1 పెన్నిధినిగొన్న చందానఁ బ్రీతుఁ డగుచుఁ
గలశమును స్వీకరించి యా క్ష్మాతలేశుఁ
డచటి కరుదెంచియున్న బ్రాహ్మణులనెల్లఁ
దనిపె బహువిధ ధన ధాన్య తతుల నిచ్చి. 7

2 పట్టమహిషి యా కౌసల్య పాయసమున
నగము సేవింప మిగిలిన నగములోన
నగముఁ ద్రావినకైక, యా నగములోన
నగము నొకవరి మిగిలిన నగమునొక్క. 8

వరియుఁ గ్రోలె నుమిత్ర, `యెవ్వరికి నెన్ని
3 పాళ్ళ నీయంగఁదగునొ యీశ్వరుఁడె లోన
నుండి ప్రేరేచ ధరణీశ్వరుండు దానె
వంచి పెట్టఁగఁ బుత్త్రులఁ బడయఁగోరి'. 9

అటుల నుస్నిగ్ధ నారాయణాంశ మద్ది
యర్ధమై, యందు నర్ధమై, యందు నర్ధ
4 మైన భాగ ద్వయంబయి యవుడె దాఁగి
వారి గర్భమ్ములను వృద్ధిఁ బడయఁదొడఁగె. 10

తరలఁ బండ్రెండు నెలలు సంతసము పొంగఁ
గాంత లా మూవురును లోకకంటకుల మ
దమ్మడంచఁగనున్న యుత్తముల ఘనులఁ
గనిరి, యమరులు విజయశంఖమ్ము నూఁద. 11

చైత్రముపునర్వసువున బంచ గ్రహమ్ము
లుచ్చదశనుండ, గురుచంద్రు లొకటఁ గూడ,
నవమితిథిలోనఁ గటకలగ్నమున జ్యేష్ఠుఁ
గనెను గౌసల్య; మిథునలగ్నమునఁ బుష్య 12

మిని నొకనిఁ గనెఁ గైక;సుమిత్ర యవలఁ
గాంచె నాశ్లేష నక్షత్రమై యమఱిన
గటకలగ్నమ్ము నందునఁ గవలఁబాయ
సమ్ము నిరుమార్లు గ్రోలిన సత్ఫలముగ. 13

పురము పూవులు పూసెను; బూర్ణసుఖము
పాఱ తీయని తేనియ వాఁగు లగుచు;
నగరు నందన వని యయ్యె; మగువ లెల్లఁ
బికములై జోల పాడఁగఁ బ్రీతితోడ. 14

అంత క్షత్రియ సంప్రదాయము నెఱింగి
నట్టి గురువర్యుఁ డా చిన్ని పాపలకును
బదియు మూఁడవనాఁడు భావ్య మ్మటంచు
నామకరణ మ్మొనర్చె భూనాథు నడిగి. 15

సర్వజనరంజకుఁడయి విశ్వమును నెల్ల
వశ్య మొనరించు కొనఁగల్గువాఁడగునను
భావి నూహించి, కౌసల్య వడసినట్టి
పట్టికిని రాముఁడని పేరువెట్టె నతఁడు. 16

అన్న రాముండు రాజ్యార్హుఁ డయ్యుఁ, గార
ణాంతరమ్మున నవిధిచే నవని భార
భరణకును బూను గైకమ్మ వడసినట్టి
వాఁ డటంచును వానిని భరతుఁ డనియె. 17

ఇఁక సుమిత్రమ్మ గనిన యర్భకుల పేర్ల
నతఁడు లక్ష్మణ శత్రుఘ్ను లనుచుఁ దీర్చె-
నొకఁడు గైంకర్యలక్ష్మిని నొకఁడు శత్రు
దళనశక్తినిఁ బొందగాఁ దగుదు రనుచు. 18

రజతపాత్రల నిడిన క్షీరమ్ము నాని,
యలరు పాన్పుల పసిఁడి యూయలల నూఁగి,
యాడి దోఁగాడి, చేయూఁత నంది నిలిచి,
యడుగు లిడి నడువఁగ నేర్చి రా నినువులు. 19

క్రమముగా నటువలెఁ గనుగందు లెదిగి
బాల్యదశ నందుచుండఁగ, వసుమతీశుఁ
డార్యసమ్మత విధుల నా యర్భకులకు
జందెముల నిడెఁ గులగురు సాయమునను. 20

బాలకులు వారు నల్వు రావలను వేద
సారమును గ్రోలి, సకలశాస్త్రములఁ జదివి,
శస్త్రవిద్యల నన్నిఁటిఁ జక్కఁ గఱచి,
చతురులై, శూరులై, గుణసాంద్రులైరి. 21

వసితనమ్మున నుండి యబ్బాలసింహు
లతికి యిరుజంటలై కూడి బ్రతికి రెలమి -
అన్న రాముని లక్ష్మణుఁ డంటియుండఁ,
దోడు విడరైరి భరత శత్రుఘ్నులెందు. 22

పదియు రెండేండ్లు దఱిసిన ప్రాయమంది
విశ్వమోహన మూర్తులై వృద్ధిఁగాంచు
చుండ నా బాలభాను లుద్దండు లగుచుఁ,
గనులవిందుగఁ జూచిరి జనులు మురిసి. 23

నలుగురుండఁగఁ గొడుకులు దలఁపునెల్ల
రామచంద్రుని మీఁదనే రాజు నిలిపె;
కొడుకు నాతని జనకుఁడు విడిచియుండ
లేఁడు; జనకుని విడువఁగలేఁడు వాఁడు. 24

పెద్ద కొడు కన్న భావ మా ప్రేమనట్లు
పెద్దగాఁ బెంచె ననరాదు; విశ్వమందు
రాముఁబోలిన సుగుణాభి రాము లెందుఁ
గలుగఁ బోరన్న మాట నిక్కంపు మాట. 25

దైవమునకన్నఁ దను గన్న తల్లి కన్న
గురునికన్నను బ్రియ సహోదరులకన్నఁ
దండ్రియే మిన్న-యన్న సత్యము నెఱింగి
కొలుచు గురుశక్తినందె నా కొడు కొకండె. 26

దాశరథియయ్యు రాముఁడు ధాత్రికెల్లఁ
దండ్రియైయుంటఁ దండ్రినే దండనుండి
వుచుండఁగ లేఁడు సతమ్ము; లోక
[illegible] వీడిపోవు ధర్మమ్ము కలదు. 27

కాన నే యేమొ దశరథక్ష్మావిభుండు
నిండు సభలోనఁ గూర్చుండియుండ నొక్క
నాఁడు కార్యార్థియైన సన్న్యాసి కౌశి
కుండటకు నేగుదెంచె చేకొనఁగ నతని. 28

వచ్చు మౌనీంద్రుఁగని ధరావల్లభుండు
గద్దియను దిగి చెర చెరఁ గదలిపోయి
దరియ నెదురేగి తలవంచి దండము లిడి
యర్ఘ్యపాద్యాదు లొసగి యాహ్వాన మిచ్చె. 29

భద్రమును బల్కి యా మునీశ్వరుఁడు నంత
నమరి యర్హాసనమునఁ బ్రియమ్ముదోఁప
మధుర వాక్కుల తేనిసేమమ్ము నడిగి
పలికె నిట్టుల వచ్చిన పనినిఁ దెలిపి. 30

``దశరథేశ్వర, కానలోఁ దాపసులకు
శాంతియే లేదు; మించె రాక్షసుల బాధ;
యాగకార్యమ్ము లవి విఘ్నయత్నములుగ
సాఁగకున్నవి చెదర మా సహనశక్తి. 31

అన్నదమ్ములు మారీచుఁడని సుబాహు
వనియుఁ బేర్గంధి భీకరులౌ బలిష్ఠు
లౌ నిశాచర కోటితో నాకసమున
నన్యులకుఁ గానరాని మాయావు లగుచు. 32

సంచరించుచు, రక్తమాంసముల మూత్ర
మలములను మాదు యాగవాటులను హోమ
కుండములఁ గుమ్మరింతురుఁ గుమతు లగుచుఁ
గ్రోధమును గ్రక్కి తఱచు - మా గోడు నూడు. 33

క్షణములో భస్మ మొనరింపఁగలము వారి
కాయముల శాపవహ్నిని, గాని కార
ణమ్ము వేఱొండు కలుగమా యలుక నడఁచి
కాచియుంటిమి లోకరక్షకుని నమ్మి. 34

వాఁడు నీయింటనుండెనో తెఁడ, నేఁడు
బాలకుండయి, సకల సౌభాగ్యరాశి
పడఁతి కౌసల్య పుణ్యగర్భమునఁ బ్రభవ
మంది గుణగణ ఖనిగ పెంపొందీ ప్రబలి. 35

వాని, మాలోనివాని, సర్వమ్ముఁ దానె
యైన వానిని, నెందుఁ గన్పడెడు వాని,
నమరుఁడౌ వాని, రాముని నడవులకును
బంపి నాతోడ నవని పేర్వడసి మనుము. 36

జన్మసఫలమ్ము నీది రాజన్య! నీకు
జన్మమఱిలేదు; లోకరక్షకునిఁ గన్న
తండ్రివైతివి; నినుఁబోలు ధన్యతములు
ధరణిపై లేరు పరమసత్యమ్ము వినుము. 37

అసురలనుఁ గూల్చి యజ్ఞకార్యములఁ గాచి,
ప్రతిభ వొంగార నినుఁజేరవచ్చు మఱల
రామభద్రుఁడు ; రాజమార్గమ్ము పుణ్య
మార్గమైయుండవలెను - నామాట వినుము. 38

కర్ణములఁ కొఱవిఁ జొన్పిన కరణి మౌని
కౌశికుని మాటలవి శీఘ్రగతుల లోని
కరిగి, గుండియఁ గాల్చి, మేనంతనిండి
మండుచున్నట్లు దపియించి, క్షాతలమ్మె 39

కదలి గిరగిరఁ దిరిగి దిగ్భ్రాంతిఁ గొలువఁ,
గనులు బూఁజులు గ్రమ్మ, మైకమున వ్రాలి,
మఱల కోల్కొని, మేల్కని, మతిసెడి యొక
మాటపెగులని విధమున మథనపడుచు. 40

రామజనకుఁడు బెదరి, విరాగినిఁ గని,
ప్రాణదానమ్ముఁ గోరెడు ప్రాణివలెను
పాదములఁ బడి దీనుఁడై, పలుతెఱఁగులఁ
బ్రార్థనాయుత వాక్యాలఁ బలికె నిట్లు. 41

"హాస్యమా యిది మౌనీంద్ర, యన్న మాట
లర్థవంతములా? చూడుమయ్య రాముఁ
డెట్టి పసివాఁడొ! కానలకేగి కష్ట
ములకు నోర్చెడువాఁడౌనె తలపు మింత. 42

గద్దెపై నేను కలనిదే; కార్ముకమ్ము
సేత నున్నది భయమేమి? చేవ సెడిన
పండు ముదునలి నేనన్న భావ మెంచి
తీవుకావలె రమ్ము నా లావు నూడ. 43

శస్త్రముల శిక్షితుండయ్యు నస్త్రబలము
వడయఁడింతకు నీ పసివాఁడు; వేయి
మాయలనుఁబన్ని పోరు దుర్మార్గ దుష్ట
దానవ శ్రేష్ఠులనుగూల్ప దక్షుఁ డగునె? 44

తలఁపఁ జతురంగ బలనమేతముగ నేనె
తరలి నీతోడ నరుదెంచి దర్పమెల్ల
మోఁపి పోరాడినను వారి ముందు నిలువఁ
జాలనో యేమొ యనెడు నంశయము వలదు. 45

పత్నులను, నాప్తులను, ప్రజాబలము, ధాన్య
ధన విభూతుల, నా రాజ్యరమనుఁ బంచ
ప్రాణములనైన విడువ వెన్నుడను గాని
క్షణము రాముని విడియుండఁగలనె నేను? 46

పరమ ఋషిసత్తమా, నాదు ప్రార్థన విని
పట్టువట్టక నా బహిః ప్రాణమైన
పట్టి రాముని సాకయ్యు వదలి యిటనె
కరుణఁజూపుము; నీ మేలు మఱవ నెపుడు." 47

రాక్షసుల రావణాదుల రణమునందు
రక్తమున ముంచి సురలకు రక్షనిడ ధ
రణినిఁ బ్రభవించినట్టి నారాయణ నర
వరముఖోన్నతరూపు నప్పట్టునందుఁ. 48

బంపకుండిన నృపతి దేవతల పుణ్య
కార్యమది భంగపడునను కారణమును
బాగ నెఱిఁగిన యోగప్రభావయుతుఁడు
ముని వసిష్ఠుఁడు వ్యామోహితుని దశరథు. 49

మతిని సరిదిద్ది, నడపి సన్మార్గమునను,
మంగళమ్ములు వర్షింప మహిని దివిని
మనసులో నెంచి, మధురాతి మధురములగు
మాటలనుఁ దన్పి యొప్పించె క్ష్మాతలేశు. 50

శస్త్రవిద్యల నిపుణుఁ డస్త్రములనెల్లఁ
దనవిగాఁ గొన్న తేజస్వి, తాపసేశ్వ
రుండు, బ్రహ్మర్షియగు కౌశికుండు దండ
నుండ, రాముండు కీడు లేకుండ దుష్ట 51

దానవులఁ ద్రుంచి, దివ్యాస్త్రధనములంది
దార్ఢ్యమున, దర్పమున, సూక్ష్మధర్మములనుఁ
బ్రబలి ద్విగుణీకృతంబగు ప్రతిభ నంది
మఱలు నను గురువాక్యసంపదనుఁ దనిసి 52

దశరథుఁడు దైన్యమును వీడి, తనయుఁ బిలిచి,
తనువుఁ దిన్నఁగ నిమిఱి, మార్దవ విశేష
మధురిమలు చిల్కు పల్కుల మౌని వెంట
మంగళమ్ముగఁ జనుము రామా' యటంచు, 53

సాగనంపెను ముద్దిడి, సరసనుండి
సతము రాముని సేవించు సద్గుణమణి
యైన లక్ష్మణుఁడును దోడనంటి యరుగఁ
దండ్రి సెలవంది లోన సంతసము పొంగ. 54

క్షాత్రమూర్తులు, నిర్భేద్యకవచధరులు,
ఖడ్గ కార్ముకపాణు, లిక్ష్వాకువంశ
వర్ధనులు రామలక్ష్మణోభయులు మౌని
కౌశికుని వెంట నడవి మార్గమ్ముఁ బట్టి. 55

నడువ, ధవళాంబుదమ్ములు బుడమిపైనఁ
బ్రాఁక విడచుచు నీడలఁ బట్టఁ గొడుగు
తరణి తాపమ్ము దనువులఁ దాఁకనీక,
రమ్యపవనమ్ములవి చామరములు వీచె. 56

దివ్యజలమయి సరయూనదీమతల్లి
దిద్దితీర్చిన దక్షిణతీర మందుఁ
దరణి పడమటి కొండల చఱియలందు
మరగుచుండఁగఁ గని మౌని మంగళార్ఘ్య. 57

జలము లర్పించి యిక్ష్వాకువులను గలిసి,
సర్వజనసమ్మతుని రాము సరసఁ బిలిచి,
యలఁతయును, నాఁకలియు, దప్పి యతని నంట
నటులఁ గాపాడఁ గలుగు బలాతిబలర 58

హాస్యములనెల్ల నేర్పు యోగ్యతను బడసి
నట్టి వాఁడౌట బోధించి యచట రాత్రిఁ
గడపి, సూర్యోదయంబైనఁ గాలకర్మ
లన్నిటినిఁ దీర్చికొని పైకి నరుగఁ దొడఁగె. 59

సరయువును జాహ్నవీనది సంగమించు
స్థానమునఁ దాపసేంద్రులు స్వాగతమిడి
మౌనితో బాలభానుల మానసములఁ
దనిపి సేవింపఁ దనిసి, యుదయముగాఁగ, 60

జాహ్నవిని దాటి చని, మహేశ్వరుని తపము
భంగ పడఁ గాము కాయము భస్మమై య
నంగుఁ  డని వాఁడు పరఁగిన యట్టి పుణ్య
తలమునందునఁ గాలిడి, తపసు లచట. 61

స్వాగతం బిడ నిలిచి సత్ఫలములంది,
సకల దివ్యాస్త్రములను వశ్య మ్మొనర్చి
యిచ్చి, విడుపులఁ ద్రిప్పులనెల్ల నేర్పి,
మానుషమ్మన్య రాముని మహితుఁ జేసి, 62

వాని లక్ష్మణసహితుఁడై మౌని తనదు
వెంటనిడికొని పయనింప, భీకరమయి
కారు చీఁకట్లు జిమ్ము పెన్వృక్షములను
భయదమృగములతో నొప్పు వనము దరిసె. 63

కరుల ఘీంకారములు, సింహగర్జనములు,
పులుల గాండ్రింపులును, గిరిబిలము లద్రువ
మాఱుమ్రోఁతల నిడి కర్ణమర్మములనుఁ
గలఁచి తొలఁచిన యటుల రాఘవుని చెవులఁ 64

బడఁగ, నాతఁడు మౌనీంద్రు నడిగె నట్టి
భయదభీకరఘోషలఁ బ్రబలియున్న
కాననంబది యెట్టిదో, దాని నెవరు,
పాలనము సేయుచుందురో, పలుకు మనుచు. 65

అంత మౌనియు రాము నాయత్త పఱచ
దుష్ట సంహార విధికి నీతులను వెలయఁ
దెలిపి బదులిడె నిటులఁదీఁ దీపిరుచుల
మనసుకెక్కఁగ ఁజక్క లక్ష్మణుఁడు వినఁగ. 66

``అడుగఁదగినట్టి యంశమ్ము నడిగి తీవు;
చక్కఁజెప్పెద వినుము విశాలబుద్ధి
నంది ధర్మప్రవృత్తితో ముందు సేయఁ
దగిన ఘనకార్యమును మదిఁ దలఁచి, కొలిచి. 67

వనము మున్నిది తాపసవర్యులకును
దావలంబయి యుండిన ధన్యభూమి;
తపసిశాపమ్ముచే యక్షతరుణి యొకతె
మాఱి రక్కసియై కడు ఘోరరూప 68

మంది, తన్నట్లు మార్చిన తాపసకుల
మంతయునుఁబేరుసెడి యంతమందవలయు
ననెడు దుర్బుద్ధితో వని మనుచునున్న
మునుల నెల్లను వేధింప మొదలుపెట్టె. 69

కరులు పదినూర్లు కలిసిన కాయశక్తిఁ
గలిగి సర్వము భక్షించి, కందరములఁ
బెంచి బలిసిన దయ్యము, పెఱల కందు
బడని స్త్రీశక్తి యది రామభద్ర, వినుము. 70

వరలుఁ దాటక యను పేరఁ బ్రబలి యద్ది;
వనినిఁ గాలిడినట్టి యెవ్వానినైనఁ
బట్టి చంపక విడువదు; పావఖనిని
దానిఁ దునుమార్పఁ గలుగు నుత్తముఁడ వీవె. 71

క్షత్రియాంశమ్మునందున జననమంది
క్షాత్రతేజమ్ము తొలుదొల్తఁగా నబలను
బట్టి చంపఁగ వెచ్చింపఁ బాడిగా ద
టంచు భ్రమియించి విడువకోయన్న, తగదు. 72

నారియైనను ననుపమవీరుఁడైనఁ
బోరి వధియింపనే వలెఁ బుడమికెల్లఁ
బుండుగా నున్న నా వ్యక్తిఁ; బుణ్యపావ
ఫలము నెంచుట తగదట్టి పట్టులందు. 73

ఘనుల మాయావులయిన రాక్షసుల వీర
వరుల సుతులనుఁ గన్నదా పావగర్భ
జనిత; యా రక్కసులె మాదు జన్నములకు
భంగ మొనరించు మూర్ఖులు బాగ వినుము. 74

అడవిఁ జొచ్చిన మనము గయ్యాళి యద్ది
యఱచుచునె వచ్చుఁ గఱవఁగ; నామెజాడ
లరసి, కడుజాగరూకుఁడై యదను నెఱిఁగి,
తలను నఱుకంగ వలయు నీ దర్ప మలర." 75

అనుచుఁ జెప్పంగఁ దలఁచిన యంశములను
జెప్పి వివరించి రాముని సిద్ధపఱచి,
కౌశికుఁడు బాలకులతోడఁ గదలి వడిని
నడవిఁ జొఱఁబడునంతలో నదరె జగతి. 76

చండపవనమ్ము సెలఁగి వృక్షములనెల్ల
ధరణిఁ గూల్పఁగ వ్రేళ్ళతోఁ, దత్తరమునఁ
జదల నుడిఁగొన పులుఁగులు, సంచలించి
వన్యమృగములు వడిగొని పరువు లిడఁగ, 77

త[illegible]యలెల్ల గిరగిర, విఱిగి మిన్ను
ధరణిపైఁబడు ననఁగను నురలఁ బిడుగు
గములు పైనుండి, నరుల రాకల నెఱింగి
నట్టి రక్కసి తాటక యుట్టిపడుచు, 78

'నల్లకొండల నుగ్గుగా నలఁగఁ గొట్టి,
చిమ్మ చీఁకటిలోఁగల చేవఁబిండి
కాళసర్పాల విసమెల్లఁ గలిపి నూఱి,
కాచిపోసినరూపుగఁ గానుపించి 79

దొడ్డ దొరసాని యన దారికడ్డుపడుచు,
వాయి తెగవిచ్చి నరక కవాట మనఁగఁ,
జిచ్చులను గ్రక్కి కనులెఱ్ఱఁజేసి చూచి,
యురము ముందునకును నెట్టి, శిరము నెత్తి, 80

కాలభైరవియై వల్లకాటికెల్లఁ
దానె కావరి యన మించి, తలల మాల
మెడను వ్రేలాడఁ, ద్రాచులు వడగలెత్తి
భూషలయి మేన బునఁ కొట్ట, ఘోష లిడుచు, 81

హరులు, కరులును, గిరులునుఁ దరువు లొకట
వెంటఁబడి మూఁగ, నడుగులు పిడుగు లగుచు
నిడిన చోట్లెల్ల గోతులు పడుచునుండ,
నచటి కరుదెంచె వికటాట్టహాసములను'. 82

కౌశికుం డంత చెప్పియు క్షాత్రమూర్తి,
ఘనుఁడు, రాముఁడు దానినిఁ గాంచినపుడు
కలికి యది యన్న భావమ్ము కలఁతవెట్టఁ
దమ్ము లక్ష్మణుఁ గనిఁ గను సన్నలీయ, 83

నతఁడు మొలవ్రేలు ఖడ్గమ్ము నంది యొరను
విడువఁ బైకెత్తి చేఁబట్టి, విఱ్ఱవీఁగు
రక్కసినిఁ దాఁకి, చెవులను ముక్కుఁ గోసి,
భంగపడఁ బంప, నదియుఁ గన్పడకఁ జదల 84

మఱఁగి, తనువునుఁ జూపక మాయలాడి
యగుచుఁ బెన్రాల వానల నవనిపైనఁ
బట్టు విడకుండ వర్షించె పటపటమని
జాలిఁగొనియున్న రాముని శాంతి నడల. 85

తపసి యాజ్ఞల నెప్పుడుఁ దప్పకుమని
తన్ను మునితోడఁ బంపిన తరుణమందుఁ
దండ్రి సెప్పిన మాటలఁ దలనుఁ దాల్చి
దాశరథి మింట వెడలు శబ్దముల గుఱిగఁ 86

దాఁక విడిచెను శరమును; దాటక నది
తాఁకి నూటిగఁ బడఁగొట్టఁ దన్నుకొనుచుఁ
బడెనుఁ బెనుగొండవలె నది పుడమిపైన
మౌనియుల్లంబు శాంతిల్ల, మహి వెలుంగ. 87

విపినమును దాని నటుల నిర్భీత విమల
నిలయమై యొప్ప నెలకొల్పి, నెలవులు గొని
మఱల మునువటి యట్టుల మౌనులందు
వాసముల నంది తనియఁ దపమ్ము నలువఁ 88

దగినయట్టుల నొనరించి, దాశరథియుఁ,
దమ్ముఁడునుఁ దాను మునివెంటఁ దరలిపోయి
త్వరగ సిద్ధాశ్రమమ్మున కరిగినంతఁ,
గౌశికుని యాశ్రమతలమ్ము గానిపించె. 89

తాను యజ్ఞమ్ము సేయఁగాఁ దలఁచినట్టి
మహినిఁ జూపించి, రామ లక్ష్మణులతోడ
మౌని కౌశికుఁ డిటుపల్కె; 'మంగళములు
గలుగు మీకెల్ల; నింకొక్క కార్యమె యిట. 90

మిగిలియున్నది; దాని తీరుగ ముగించి
మఱల వచ్చు నయోధ్యకు మురిసి మీదు
తండ్రి మిమ్ములఁ గాంచి ఖేదమ్ము వాయ
మఱల మునుపటి యట్టుల మనఁదొడంగ. 91

దానవాంగన తాటక తనయులైన
కామరూపులు, మారీచనాముఁడును సు
బాహు వనియెడు ఖలుఁడు నిప్పట్టునందు
సతము నాకాశవీథుల నంచరింత్రు. 92

రామకార్ముక నిర్ముక్త భీమబాణ
చండవహ్నులఁబడి వారు నమయనున్న
నమయ మానన్న మైనది నంయములకు
శాంతి సేకూరునటుల; నిస్సంశయ మిది. 93

కాన నిశ్చలచిత్తుఁడై నేను నేఁడె
జన్నమునకును మొదలిడి సాంతముగను
జలుపఁ దలఁచితి; దుష్టుల జాడఁలరసి
కాచియుండుఁడు యాగరక్షణకుఁ గడఁగి. 94

అనిన మునిరాజు, 'జయము జయమ్ము రామ
భద్రునకు నం'చు మంగళవాక్యములనుఁ
బలికి, యజ్ఞార్థ మటకును వచ్చియున్న
యతులు, తమ తమ పనుల కాయత్తపడిరి. 95

జన్న మునకయ్యెఁ దీర్చిన యున్నత సమ
తలము శుద్ధమ్ముగా, మధ్యఁ దావుగొన్న
మహిత హోమాగ్ని కుండము మండఁదొడఁగె
మంత్రపూతాజ్యములఁ బెనుమంట లెగయ. 96

పరమశాంతస్వరూపుఁడై పరిసరముల
మఱచి ధ్యానంపు నిష్ఠలో మంత్రముల జ
పించుచునె యింధనమ్ముల వేల్చు ముని, వి
రాగి కౌశికు ముఖ ముకురమున హోమ. 97

వహ్ని ప్రతిబింబితంబయి, ప్రభల నాల్గు
కడల వెదచల్లుచుండఁగఁ, గాంచిరామ
లక్ష్మణులు మ్రొక్కి నిలిచి నలక్షణులుగఁ,
గనక కార్ముక పాణులై కనులు దెఱచి. 98

కలయఁ జూచుచు నుండిరి, ఖలులు దుష్ట
దానవులు గానఁ బడిరేని దత్క్షణమునఁ
దాఁకి జమునింటి కనుపు నుత్సాహ రుచిర
భావ రస పూర్ణహృదయ ప్రభాసితులయి. 99

వదలి తిండిని, నిదురకు స్వస్తి చెప్పి,
దప్పి తోఁచియుఁ దోఁచని తలఁపులు గొను
వారలై వారు, భాస్కరుం డాఱుసారు
లుదయమై యస్తమించుచు నుండఁజూచి, 100

ు గాయలు గాయఁగఁ, గంటిఱెప్ప
్కుండఁగ, నచట కావలినిఁ గాయు
ఁ, బ్రళయాంబుదములతో నిండి యుఱుము
ిమ్మునుఁ దలపించి యసురు లొకట. 101

ులుగ మూఁగి, చండ ప్రచండు లగుచుఁ
యై నిండి పైవియత్తలముఁ గప్పి,
న పిండమ్ములను మూత్ర మల జలమ్ముఁ
్మరింపఁ దొడంగిరి క్రూరు లగుచు. 102

ణమ్మునఁ జిక్కని యంపతెరల
్క మిన్నులకును మధ్య వన్ని, యస్త్ర
ుచే మలినమ్ముల వహ్నిఁబడని
వారించి, రఘువీరవరులు వాడి 103

ును గూర్చి గుణములఁ గుప్పలుగనుఁ,
తులనుఁ గూల్పఁ దఱిమినఁ, గుతలము వయిఁ
వడినవి పీన్గులుఁ గుప్ప లగుచుఁ
ువడిపోవ దానవకులబలమ్ము. 104

్మని యొక్కశరము మారీచుఁ దాఁక
ిగయఁగఁ, గని వాఁడు వాయువేగ
ు వరుగిడె; వదలక వానిఁ దఱిమి
ు వెన్నంటి శరధిలో మఱుఁగ విడిచె. 105

ుడి తప్పుకొనలేక వసుధ పైనఁ
ుబాహువు రాముఁడు వంపినట్టి
మొక్కటి నూటిగ వాని గుండెఁ
చీల్పఁగ వడి, వియత్తలమునుండి. 106

ఖలుల మలినమ్ము దొలఁగి యాకాశవీథి
యమలమై, కాంతిశోభితమై వెలుంగ,
జన్నమును సొంతమయ్యె, దాశరథి, రామ
భద్రు సాయమ్మునను భంగపడని వగిది. 107

కౌఁగిటనుఁ జేర్చి ముద్దాడి కౌశికుండు
రామలక్ష్మణులను దశరథుని కప్ప
గించి మఱలఁగ మరల నుంకింప, ముని జ
నమ్ము లాతనిఁ బ్రార్థించి నతుల నిచ్చి; 108

"జన్నమునుజల్పు మిథిలలో జనకనృపతి;
యందు మనమెల్లఁ బాల్గొన నగు నటంచు
నందె నాహ్వానములు; మన మందఱమును
నచటి కేగుట భావ్యమే యగును దలఁప. 109

అగుట మా మాట మన్నించి యటకు మీరు
వచ్చి మఱలంగఁ దగును, సౌభాగ్యనిధుల
భద్ర జన్ముల రఘువంశ వర్ధనులను
వెంట నిడుకొని, యందలి వింతఁ జూడ. 110

జనకునకుఁ జాల మునుపటి క్ష్మావరునికి
దేవరాతునకును శివదేవుఁ డొసఁగి
నట్టి పెనువిల్లొకటి కలదందు, ఘనుల
కైన నెక్కిడరానిదై యవనిఁ బ్రబలి. 111

బాలభానులు వీర లవశ్యముగను
బట్టి పైకెత్తి దానిలోపలి బలమ్ము
నరయఁదగు వారలన్న భావమ్ము మమ్ముఁ
బలుకనిచ్చుచునున్న దిప్పగిది" నంచుఁ 112

బలుకఁగా విని, ముందుఁ గావలసియున్న
రెండు శుభకార్యములకుఁ దోనుండి సాయ
పడఁగ నా బాలురకును, దైవమ్మె వారి
వలుకులో దాఁగి యబ్బంగిఁ బలుకనిచ్చు 113

చుండెనని యెంచి, మౌనివర్యుండు మోద
మంది, 'యట్టులె గానిండ' టంచు మిథిల
కరుగ నంగీకరించి; దాశరథు లనుస
రింపఁ బయనమ్ముఁ గొనెను సంప్రీతుఁ డగుచు. 114

దారి పొడవున గంగావతరణ మాది
కథల వినిపించుచును, మునికౌశికుండు
బాలురను దోడనిడికొని పయన మగుచుఁ
జనఁగ, శూన్యాశ్రమం బొండు కనఁబడె నట. 115

పుష్పఫలశోభితంబయి పునితముగను
గానఁబడుచున్న యా స్థల గౌరవమునుఁ
దనకు విన్పింప, మౌనిని దశరథాత్మ
జుండు కోరఁగ, నతఁడును నిండు మనను 116

నిచ్చి వినిపించె నబ్బాలు నిచ్చఁదీరు
నటుల నిట్టుల; "నిది గౌతమాశ్రమమ్ము;
మున్ను నురపతి కామియై మునినతి నిట
గౌతముని రూపుఁగొని కోరి, కలిసి, రతిను 117

ఖమునఁ దేలిన, యోగబలమున గౌత
ముండు వృత్తాంత మెఱిఁగి, లోమండి, నతినిఁ
మేను మాయఁగ నశరీరియై నలుగురి
కంటఁబడనట్లు తానున్న కానలోనె 118

తపము నొనరించుచును బుణ్యతముని రాము
దర్శనమ్మున రూపంది తన్ను మఱలఁ
బడయఁనగునని శపియింపఁ, బడఁతి యామె
పలవరించుచు నిందు నీ తలఁపులందె 119

మానసము నిల్పియున్నది; దీన, దాని
శాపముక్తను జేసి పూజలను నంది
గౌతమునిఁ జూచి పలికి మార్గమ్ముఁ బట్టి
మనము చనవలె మిథిలకు మాన్య, వినుమ" 120

టంచు ముం దేగుచుండ నయ్యాశ్రమ తల,
మరుగుదెంచెను; వింతయనంగ నపుడె
నంతనమ్మున గౌతముసతి యహల్య
తనువుఁగొని మ్రొక్కె రాముపాదములనంటి. 121

శాపముక్తను మఱల శాస్త్రంపు విధులఁ
బడయ గౌతముఁ డంతలోపలనె యటకు
వచ్చి మ్రొక్కిన సతిగొని, వందన మిడి
రామచంద్రునిఁ బూజించెఁ బ్రస్తుతించి. 122

ఆ మహా పుణ్యకార్యమ్ము నటులఁ దీర్చి
యనుజుతోడను రాముఁడు యతులు గతుల
జూపి నడిపింప నడచుచు, శుభములందఁ
జేరె మిథిలను సంతోషచిత్తుఁ డగుచు. 123

బ్రాహ్మణుల గుంపు, సామంత రాజవితతి,
వైశ్యవర్గమ్ము, నాల్గవపగిదివారు
నగర జనపదవాసులు, నాతులుఁ, గడు
వృద్ధజనములుఁ బసివాండ్రు విడిదిగొన్న 124

శిబిరములదాటి, యతుల కై సిద్ధపడిన
శిబిరములఁ జొచ్చినంతఁ, గౌశికుఁడు విడిసె
యతులతో బాలకులతోడ నచట; నంత
వరమముని, ధన్వి, శస్త్రాస్త్ర పారగుఁడు, మ 125

హోమహుండగు, వరకుశికాన్వయుండు,
గాధి తనయుఁడు వచ్చె, నిక్ష్వాకు వంశ
వర్ధనులతోడఁ దన యాగవాటి కనుచు
వినిన జనకుఁడు, దానెయై వినయ మొప్ప 126

నచటి కరుదెంచి, కని వాని, నర్ఘ్యపాద్య
ఫల రసమ్ముల నొసఁగి పుష్పములఁ జల్లి
పైనఁ బూజించి, సేమమ్ము పగిది నడిగి,
యాగశాలకుఁ గొనిపోయి యర్హమైన 127

యాసనమ్మునఁ దో వచ్చినట్టివారి
తోడ మునివర్యులకు ముందు, నీడవట్టుఁ
జూపి యమరంగఁ జేసె విశుద్ధమతిని,
నచట నుండినవారెల్ల రభినుతింప. 128

ఎలమి మిథిలాపురీ పురోహితుఁడు గౌత
మాత్మజుఁడు శతానందుఁడాయతికి మ్రొక్కి,
గౌతమాశ్రమమునఁ దన కన్నతల్లి
కాయమునుఁ గొని తండ్రితోఁ గలిసినట్టి 129

కరణి నెల్లను నడిగి చక్కఁగ నెఱింగి,
నంతనము పొంగఁ గౌశికు చరితనెల్ల
నచటివారికి వివరించి యరయఁజెప్పి,
యతని నుతియింప; జనకు గృహమ్మునందుఁ 130



గల ధనుస్సును రామ లక్ష్మణులు నూడ
వలచి వచ్చి రటంచు నృపతికి జనకు
నకునుఁ గౌశికుఁ డెఱిఁగింప, నాఁడె తనదు
తనయ సీతమ్మ పెండిలి దినము దరిసి

నటుల భావించి, యుత్సాహ మతిశయిల్ల
నతని నా బాలకులతోడ నపుడె ధనువు
దాఁచఁబడియున్న చోటిని దరియ నరుగఁ
దీసికొనిపోయి, వలికెనుఁ దీయఁగ నిటు;

"మాదు పూర్వికుఁ డొక్కఁ డుమావతికడఁ
బడసి యీ మహాధనువును బరమపూజ్య
భావమున పూత గంధ పుష్పములతోడఁ
బూజ నలువుచు మాకిచ్చిపోయె నిటుల;

ధనువు ఘనమిది; ఘనులలో ఘనులుకూడ
పట్టి కదలించరానిది; యెట్టి దిట్ట
యైన దీనిని నెక్కిడ నలవికాని
వాఁడె యగుచుండె; యిది స్వానుభవము వినుఁడు. 134

యజ్ఞ తలమును వదను జేయంగఁ దలఁచి
యల్ల నొకనాఁడు నాఁగలి నంది దున్ను
చుండ, భూగర్భమున దాఁగియుండు నొక్క
పసిది చేపడె నా నోముపంట యనఁగ.

అదియె నా బిడ్డగా ముద్దులారఁ బెంచఁ
బెరిగి, యౌవనవతి యయి ప్రీతిగూర్చు
చుండె మాయింటి వెలుఁగౌచు, నిండు గుణము
గలిగి వర్తించు తెలివి తేటలను మించి.

ఆ యయోనిజ నాత్మజ ననుఁగు సీత
నందఁగలవాఁడు సామాన్యుఁడైనఁ దగఁడ
టంచు లోనెంచి, యీ వింటి నందిపట్టి
యెక్కిడినవానికే దాని నీయఁదలఁచి, 137

యటులఁ బ్రకటించితిని; కాని, యలఘుబల న
మన్వితుం డొక్కఁ డైనను మాకు లభ్య
పడకయుండెను నేఁటికి- బాలచంద్రుఁ
డయ్యు నీ రామచంద్రుఁ డత్యలఘుబల న 138

మన్వితుండని, యనమాన ధన్వి యనియుఁ
బదుగు రాడఁగ వింటిని; వలచునేని
యత్నపడ నిండు ఈ వింటి నంది నిలిపి
వంచి గుణమునుఁ జక్క సంధించి వదల" 139

ననిన జనకుని మాటల నాలకించి
"వింటివా రామ, కడకేగి విల్లుపట్టి
యెత్తి యెక్కిడి నీ లావుఁ జక్కఁ జూపి
యీవలికి రమ్మ"టంచు యోగీశ్వరుండు 140

ఆజ్ఞ నిడఁ దలఁదాలిచి యతఁడు, ధనువు
నంది చిఱుగడ్డిపోఁచగ నలఁతిగఁ బయి
కెత్తి నారిని సంధింప నీడ్చుచుండ,
వంగి, బాణాసనము వీగి, ప్రళయమేఘ 141

గర్జనలఁ బోలు రొదల దిక్తటము లద్రువ
విఱిగిపడె రెండుముక్కలై, విరులు సల్లి
స్వర్గవాసులు ముదమంది శంఖ మూఁది
జయ జయ ధ్వానములు సేయ జగతి వినఁగ. 142

## బాలకాండము

కౌశికుని గుండె పూచెను; కనులవిందు
కలిగి పులకించె జనకుఁడు, క్ష్మాలతాంగి
కన్న గారాబు బిడ్డకుఁ గడకు నొక్క
ఘనుఁడు లభియించె నను మోద కారణమున.

ఆర్యజనసమ్మతుఁడు, సుజనాత్మకుండు
ఆడితప్పని నిత్యసత్యవ్రతుండు,
ధార్మికుఁడు, ధర్మబద్ధుఁడుదారుఁడు, దశ
రథుని తొలివట్టి యా రఘురాముఁ డవని

జాత నర్ధాంగిగాఁ గొనఁజాలి తనకు
నల్లుఁడైయుండఁ దోడ్పడినట్టి మౌని
వరునిఁ, గౌశికు, జనకుఁడు శిరమువంచి
వందనముఁజేసి, యర్హుల నండఁబిలిచి

యనిపె శీఘ్రమ్ముగా నయోధ్యకును బోయి,
యా శుభప్రదమౌ వార్త నందియిచ్చి
దశరథేశ్వరునకును, సత్వరమె మిథిల
కరుగుదెమ్మని ప్రార్థించి, మఱల నవుడె.

వంశగురువుల, సచివుల, బాంధవులనుఁ,
బ్రాణమిత్రులఁ, బౌరులఁ బయనపఱచి,
భరతశత్రుఘ్నసహితుఁడై బయలుదేఱి
దశరథుఁడు సేరె మిథిల సత్తరిని మురిసి.

జనకనందన రఘురామచంద్రుఁ బెండ్లి
యాడు ననువార్త పౌరుల కందిపోవ
'మిథిల మిలమిలలాడె' గ్రామీణులకును
వార్తలందఁగ వారును వచ్చికలియ.

స్తంభములనెత్తి పైకప్పుఁ జక్కఁ బఱచి,
పోకల ననంటులను బూన్చి, భూమి నలికి
చక్క్రముగ్గిడి, వస్తుసంచయముల నిడ
దివ్యమై తీరియున్న పందిటను నిండి, 149

తాపసేంద్రులు బ్రాహ్మణోత్తములు బుధులు
సకలసామంత రాజులు సచివులగమి
పండితులు సత్కవీంద్రులు పౌరజాన
పదనివాసులు గుమిగూడి వరలుచుండ, 150

సర్వమంగళవాద్య నిస్వనము లెల్ల
డల నినదింప నాదసఖ్యమ్ము నంది
గాయకుల కంఠములతోడ, ఘనుఁడు జనక
రాజు తనయనుఁ గొనివచ్చి రామునెదుట 151

మ్యముగ నిల్పి, "ఇదిగో! శ్రీరామ, ధరణి
ాత నానుత సీత నీ సఖ్యమంద
ంచియున్నది; నీకెందు ప్రీతిఁగొలువు
ండు సహధర్మవర్తియై, నిండు మనము 152

ీడఁ గరమునుఁ గరమునఁ గూడఁగలిపి
్వకరింపుము పత్నిగావించి" యన్న
గ్నిసాక్షిగ మౌనులు నవనిసురులు
ంత్రములఁ బఠియింపుచు మంగళములఁ 153

లుకుచుండఁగ, నుత్తరఫల్గునిఁ దగ
మరియున్నట్టి శుభలగ్న మరుగుదేరఁ,
నక మంగళ సూత్రమ్ము గట్టె సుగుణ
మ జానకి మెడలోన రాముఁ డలరి. 154

జనక భూపతి రెండవతనయ నూర్మి
ళను వరించెను దగునని లక్ష్మణుండు;
నంత మాండవియను మిథిలాధిపుని స
హోదరుని జ్యేష్ఠపుత్రి, నామోదమునను 155

భరతుఁ డందెను బత్నిగఁ; బరమప్రీతుఁ
డగుచుఁ బెండ్లాడె శ్రుతకీర్తి యన్న దాని
తోడబుట్టువు నతిగ శత్రుఘ్నుఁ డంత
నా పునిత లగ్న శుభకాల మరుగుముందె. 156

అతుల నినకులవర్ధను లందఱుఁ దగు
బత్నులను నంద, నానందభరితుఁడైన
దశరథుఁడు, మౌని కౌశికు దరియనేగి
దండమిడి, నందనులఁ దమతమ నతులతోడ 157

మౌనిపాదమ్ములంటి నమస్కరింపఁ
జేసి, యాతని మంగళాశీస్సులంది
నుతుల వర్షించి, తన కృతజ్ఞతనుఁ దెలిపి
వదలిపోఁ బంప, వచ్చిన పనులు ముగియ, 158

సకల ధన ధాన్య తతుల, వస్త్రాదికముల
వాహనమ్ములఁ, బరిజనవర్గములను
నరణముగ నిడి జనకుఁడు శిరము వంచి
వందనం బిడి సెలవిడ, వదలి మిథిలఁ, 159

బెండ్లికై యటకునుఁ దన వెంట వచ్చి
నట్టి యందఱు, నలుగుర నాత్మజులనుఁ,
గ్రొత్త కోడండ్ర తోనిడికొని రథమ్ము
నెక్కి, వడి యయోధ్యనుఁ జేరనెంచి చనెను. 160

వాని తండ్రిని క్షత్రియాన్వయుఁడొకండు
చంప, నావంశజులను నాశన మొనర్చు
పట్టుతో దీక్షతో నరపాలకుల వ
ధించి నెత్తుట గొడ్డలి ముంచి కడిగి 161

నట్టి భయదస్వరూప విఖ్యాత విప్ర
వరుఁడు, పరశురాముండనఁ బరఁగువాఁడు,
దారికడ్డమ్ము నిలిచి యుద్ధండుఁ డగుచుఁ
గార్ముకమ్మునుఁ జేఁబట్టి కానఁబడెను 162

మార్గమధ్యమ్ములో; నంత మనుజ విభుఁడు
దశరథుఁడు తన తనయు, నుత్తముని ఘనుని,
రామచంద్రుని నెపుడు నారాయణావ
తారుఁడని యెంచలేకుంటఁ, దగిలి దిగులు 163

తహతహంపడె, నటు తమదారి కడ్డు
పడిన భీకర రూపుని భావమేమొ
వ్యక్తపడకుండ; రాముని భంగపడని
వగిది నిలుసేర్చు విధముఁ గన్పడక నెదియు. 164

నట్టి తరి అరదముమీర నమరియున్న
మానవుని రూపుఁ గొనినట్టి మాధవుఁ గని
పరశురాముఁడు, తాను జేఁబట్టియున్న
ధనువుఁ బైకెత్తి చూపించి దర్పముననను, 165

"క్షత్రియాన్వయులను నెల్లఁజంపి శాంతి
వడసి తపమున కరిగినవాఁడ నేను;
జనకునింటను గల శివధనువు నొకఁడు
ఖండములుగాఁగఁ ద్రుంచి పేర్గాంచి మఱలు 166

చుండెనని, విని యట్టి ఘనుం డెవండొ?
వాని బల మెట్టిదో? చూడవలయునన్న
యానతో వచ్చితిని; నాదు హస్తమందు
నున్న ధనువిది శివువింటికన్న ఘనము; 167

విష్ణువందించినది; యెక్కువెట్టి దీని -
విడువఁగల్గుదువేని నీపేర్మి నెఱిఁగి
తాఁకి నినుజక్క ద్వంద్వయుద్ధమ్ము సేయఁ
గలను; దిగివచ్చి యీ కార్ముకమును బట్టి 168

విశిఖ మొకదాని సంధించి విడువకున్న
విడువ నిను నే"న టంచన, బెదరనటుల
యరదమును దిగి, రాముఁడా యనుపమాన
మైన ధనురాజమునుఁ జేత నంది వంచి, 169

గుణము సంధించి, యెక్కిడి కోలను వడి,
పరశురాముని గని, "విప్రవర్య! నీదు
నిష్టమునుఁ దీర్చితిని; యెక్కువెట్టినట్టి
గట్టికోలను నేయక కార్ముకమున 170

నిలువ నా చేతఁగాదు; నే నిన్నుఁ జంప
వలెనొ? వేఱొండు మార్గము గలదొ? తెల్పు"
మనినఁ, దేజమ్ము తఱిగి భయమ్ముఁ దోఁవ
నతఁడు రామునకును మ్రొక్కి యభినుతించి, 171

"నా తపోబలమును గొట్టి నన్ను వదల
వచ్చు వలచిన"ననె నమ్రభావ మొప్ప,
నహము నశియింప, బలమెల్ల నంతరింప,
జన్మ తరియింప రామ దర్శన ఫలముగ. 172

వాని కోరికఁ జెల్లించి వదలి, రామ
భద్రుఁడంతట, మునుపటి పగిది యరద
మందు కూర్చుండి, జనకు భయమ్ము నార్ప,
రథ మయోధ్యనుఁ జేరె భద్రముగ వడిగ. 173

వత్సులనుఁ గూడి యిక్ష్వాకు వంశమణులు
మఱలి మిథిలను విడివచ్చి, పురముఁ జొచ్చు
మురువు ముచ్చటలనుఁ గని, పురజనమ్ము
లవిరళోత్సాహ మృదుపుష్పితాబ్జముఖ వి 174

కాసులై, రాజభవన మార్గమున కిరు కె
ల కుల బారులు దీఱి, పూలను రథమ్ము
పైనఁ జల్లుచు, జయ జయ ధ్వానములు సె
లంగ స్వాగత మీయ; లలన లలర 175

వట్టి మంగళహారతి పళ్ళెరములఁ
ద్రిప్పఁ బాడుచు నాడుచుఁ; దేరు మంద
గమనములఁ గుల్కు చిల్కుచు, కదలి కదలి
కడకు రాజగృహమ్ము ముంగలను నిలిచె. 176

రమ్యమౌ రాజసౌధము రామచంద్రు
రాకచే రమ్యతరమౌచు రాణకెక్కి
రాజిలంగను, నంతఃపురమ్ములోని
రాణులును, రామలును, గుణధాము రాము, 177

నతని తమ్ముల, తోడి యర్ధాంగ లక్ష్మ్మ
లను, శుభమ్ముగ రక్షిత లక్షణులుగ
లోనఁ గొనిపోవఁ బొంగెడు మానసముల
నమల ఫలపుష్ప తాంబూల హస్తు లగుచు 178

కడఁగి తొలి వాకిటనె నిల్చి కాచి, వారు
రథము దిగినంత శ్రీరామరక్ష యనుచు
దృష్టి తీయించి, కుంకుమ దిద్ది నొసట,
పచ్చకపురంపు హారతిఁబట్టి, పట్టు 179

పఱచి తీర్చిన మార్గమ్ముపై నడపుచు
మెత్తమెత్తని యడుగుల, ముత్తెములను
మంచి రతనాలు చెక్కిన మందిరాంత
రములఁ జేర్చిరి, నంత విశ్రాంతి నంద. 180

రాజ్యపరిపాలనాది భారములు పైనిఁ
బడక యుండఁగఁ బ్రాయంపు వసిమి పొంగు
వయసులో నున్న నూత్నదంపతులు దేలఁ
బ్రణయ సుఖములఁ, గాలమ్ము ముందు కరిగె. 181

అంత దశరథ భూపతి యండఁ బిలిచి
భరతు, "మీ తాత నినుఁజూడ వలచునన్న
మాట పెండిలినాఁడె నీ మామ మిథిల
లోననే చెప్పిపోయెను; దాన నీవు 182

తడయఁదగదింక, శుభముగాఁ దరలిపోయి
మఱలు"మని చెప్ప, నాతఁడు 'మంచి' దనుచుఁ
దన్ను వీడని శత్రుఘ్నుదనదుఁ వెంటఁ
గొని చనెను బెద్ద లందఱకును నతు లిడి. 183



# అయోధ్యా కాండము

భరతుఁడటు దండ్రి వీడ్కొల్పి పంపి, ననుజుఁ
డైన శత్రుఘ్నుతోడఁ దాతయ్య యింట
నుండఁగ, నయోధ్యలోన రాముండు 'మధుర
పౌర హృదయాబ్జ మకరందపాయి' యగుచు, 1

సర్వులకు నిష్టుఁడై, బుధ జన విధేయుఁ
డగుచు, బీదల సాదల నాదరించు
సద్గుణమ్మది హృదినిండ, సరసవాక్సు
ధలను నెల్లరఁ దనుపుచు, శాంతసహాన 2

భావ మొప్పార, నెపుడుఁ గోపము నెఱుఁగని
హసిత భాసిత వదనుఁడై, యాడి తప్ప
కుండ, న్యాయమ్ము ధర్మమ్ము కుంటువడని
పగిది ఋజుమార్గవర్తియై, ప్రాణమునకుఁ 3

బ్రాణమై తల్లి దండ్రుల భావమందు
నిలిపి, నరలోక దైవతములన నెంచి,
సతము సేవించుచును, ధైర్య శౌర్య సాహ
సముల సంపద నంది, విజ్ఞాన ఖనిగ, 4

మంచి చెడుగుల నారసి, మనసునకును
మనసునకు నున్న సూక్ష్మ మర్మములలోని
నైజవైవిధ్య గతుల సన్నుల గ్రహించి,
సరసుఁడై, సంఘముల మధ్య సంచరించు

చతురుఁడై, వృద్ధిఁ గనుచున్న, జనకుఁడు దశ
రథుఁడు, నాటిన విత్తు నీరమ్ముఁబీల్చి
వృక్షమై, పెంపుఁగని మంచి విరులతోడ
క్రమఫలములతోడనుఁ గనుల విందుఁ 6

గొలువుచున్నట్లు తలఁపులు వులకరింప,
వాని కనుఁజెప్ప వాల్చక, లోన నంత
సామృతము పొంగి పైఁబ్రాఁక, జన్మఫలము
పండి నిండిన భంగి నేర్పడఁగఁ జూచె. 7

అట్టి యనమాను, జ్యేష్ఠుఁ, దా నవనిపైన
ననువులనుఁ బాయకుండ నున్నవుడె పట్ట
భద్రు నొనరించి, యువరాజు పదవి నిచ్చు
టెంతయును భావ్యమని లోన నెంచి, నృపుఁడు, 8

శిష్టు, వరధర్మ నిష్ఠు, వసిష్ఠుఁ బిలిచి,
తలఁపులో నున్న కోరికఁ దెలియఁజెప్పి,
సకల సామంతరాజుల సచివులఁ బుర
జనుల సభఁగూర్చి యిటు వల్కె సౌమ్యుఁ డగుచు. 9

"శక్తి కొలఁదియు నేను రాజ్యమును నేఁటి
దనుక పాలించి యలసితిఁ; దనువు దరిగి
ధరణిపైఁబడు ముదునలితనము నన్నుఁ
బైఁగొనుచునుండె; నెన్నాళ్ళు బ్రతుకఁగలనొ 10

యేమొ! తఱియుండఁగనె మంచి నెంచి నాదు
జ్యేష్ఠపుత్రునిఁ బట్టాభిషిక్తుఁజేయ
తలఁపులొదవిన, మిమ్మెల్లఁ బిలిచి యడుగఁ
దలఁచి పిలిపించితిని, జననమ్మతంబొనర్మ 11

సహజగంభీరు, శస్త్రశాస్త్రప్రవీణు,
సకల మహితాస్త్ర సహితు, విశాలహృదయ
సదను, గుణధాము, రాము రాజ్యమ్ము నేలఁ
దగిన వాఁడంచు మీరును దలఁతురేని, 12

కలిపి మనసులనేక వాక్యమ్ముఁ బలికి
సమ్మతినిఁ దెల్పుఁ డనుచు భూజాని వృద్ధ
రాజు వలికిన; మకరందరసముఁజెవుల
జిలికినట్టుల నలరి, సకలురు నంత, 13

"పూర్ణసుఖ మధుకలశమ్ముఁ బూని చేతి
కందియిత్తును గొందురా" యన్న వగిది
నడుగుచుంటిరి, మీ పెద్దకొడుకు గొప్ప
గుణగణమ్ముల మేమె వాక్రుచ్చ వినెడు 14

కౌతుకమ్మునఁ; గానిచో ఘనుని రాము
ఘనత నెఱుఁగని వారలు గాము మేమ
టన్న సత్యమ్ము నెఱుఁగుదు రంచు మాకు
నెల్లఁ దెలియును; మాకు స్నేహితులు మీరు. 15

పట్టభద్రుఁడు 'రాముఁడు స్వర్ణసింహ
పీఠమునఁ గూరుచుండిన, విశ్వభాండ
పద్మరాజమ్ము వుష్పించి ప్రజలపైనఁ
బరిమళమ్ములఁ జల్లు; భూభార మంది 16

మంచి చెడుగుల నారసి మహిని నేలు
పనికిఁ బూనఁగ బనిలేదు; వాని కంటి
కొనలఁ గరుణాంబుదమ్ములు గురిసినంతఁ
జాలు ప్రోడులు చివురింపఁజాలి యూఁగు. 17

"నన్నుఁగాదని రాముని నెన్నుకొనఁగ
వలయు కారణమేమి? నా పాలనమున
ప్రజలు సంతృప్తచిత్తులై బ్రతుకలేక
బాధపడు చుండిరా?" యను ప్రశ్న మిమ్ముఁ 18

గలఁచు నని యెంచి మేమింతకాల మిటులఁ
గాఁచియుంటిమి; యబ్బంగి కాకయున్న,
రామచంద్రుని మా యువరాజుఁ జేయు
మంచు, దండమ్ము వెట్టి యాచించి యుందు 19

మనుట సత్యము; త్వరపడి యినకులేశ
యట్టి మంగళకార్యమ్ము నవనియెల్ల
సంతసంపడునటుల, మీస్వాంత మలరఁ
జేసి, మమ్మెల్ల ధన్యులఁ జేయు మయ్య" 20

యనుచుఁ బ్రార్థింపఁ; గుల గురు నాజ్ఞ వడసి,
దాని కనువైన శుభముహూర్తమ్ము నపుడె
చక్కగను నిర్ణయించి, యా సభకు మ్రొక్కి,
చెదర సెలవిచ్చి; వార్తనుఁ జెప్పి రాము 21

సిద్ధపఱుపఁగ వృద్ధుఁ బ్రసిద్ధు సార
థిని సుమంత్రుని సత్వర మనిపె, నతని
నటకుఁ దోడ్తేఱ నరపతి - యాక్షణమ్మె
దండమిడి నిల్చె రాముఁడు తండ్రి ముందు. 22

ఆజ్ఞకై వేఁచి యటులఁ బ్రియాత్మజుండు,
కనుల విందుగ నిలువఁగఁ, గరముఁ బట్టి
చనవుతోఁ జెంతనిడిన యాసనమునందు
సరసఁ గూర్చుండ నిచ్చి, విశ్వాసభావ 23

ఫణితిఁ గన్పడఁ, దీయని పలుకు లుర లఁ
బలికె నిట్టుల; "విను రామభద్ర, మనను
కెక్క నా పల్కులను; భువి నింక నేను
మనను కలకాల మనుచు నా మాననమ్ము 24

నాకు విన్పించు; కంటి స్వప్నముల శుభము
కాని వానిని; ముందేది కలుగనున్న
దని యెఱుంగఁగ లేము; నేఁదప్పు కొనెడు?
ముందె భూభార మెల్ల నీయంద నిలిపి, 25

ప్రజల నుఖపడనిచ్చుట భావ్య మనుచుఁ
దలఁచితిని; నేనె కాదటు దలఁచుట; పుర
జనుల వాంఛయు నట్టిద; నర్వవిధము
లందు నీ వర్హుఁడవు దాని నందికొనఁగ 26

వగ్రజుండౌట, ననువముఁడౌట, నకల
జనుల కావ్పుఁడౌటను, గుణసాంద్రుఁ డగుటఁ;
గాన, నీ జన్మ నక్షత్ర కాలమందు
ుష్యలగ్నము సిద్ధించు పుణ్యతరుణ 27

నురుగు దెంచిన యంతనే, మకుటము నిడి,
న్ను సింహాననమ్మున నిలిపి, జనుల
త్త మలరఁగఁ బట్టాభిషిక్తుఁ జేయ
ర్వనన్నద్ధముగ నుంటిఁ జక్కనయ్య 28

గుచు, నీ రాత్రి నంతయు ననుఁగుపత్ని
ానకినిఁగూడి, లోన నీశ్వరుని నిలిపి
ాయపడ, నిర్జలోపవాసమునఁ గడపి
ద్ధపడఁదగు రాజ్యలక్ష్మిని వరింప" 29

అనుచుఁ బోఁబంపఁ, జిత్తమ్మటంచు మ్రొక్కి,
క్రమఫలరసమునునైనఁ, గాలకూట
గరళమునునైనఁ, గొనుమని కరముల నిడఁ
దండ్రి, రెంటిని సమముగాఁ దలఁచి త్రాగు 30

దాశరథి, మంచి వార్తనుఁ దనకునట్లు
ధరణి పతి యంది యిచ్చినఁ దన్మయుఁడయి
తాండవించక, ముందటి తనదు రీతి
మాఱనటు నిశ్చలుండయి మఱలిపోయె. 31

కర్ణపేయమ్ము లగుచు రాఘవుని మంగ
ళాభిషేక సువార్త తీయఁగనుఁ బట్ట
మహిషి కౌసల్య సెవిఁబడ, మానసమ్ము
మహతిఁ గొని మీటి పాడుచు మంజులముగ, 32

మధుర గాన ప్రవంతి నమ్మాతృపుణ్య
గర్భమును నింపఁ బాఱింపఁ, గాంచి యెఱుఁగ
నట్టి యపరిచితానందమందు మునిఁగి,
భావమునఁ గోటి దివ్యదేవతలు మెదల, 33

స్నాన మొనరించి, పరిశుద్ధ వస్త్రములనుఁ
గట్టి నవరత్నఖచిత కంకణము, వివిధ
పత్ర ఫలపుష్ప హస్తయై పరవశయయిఁ
బ్రార్థనామందిరముఁ జొచ్చి, ప్రణతు లిచ్చి, 34

పట్టి రాముని మంగళప్రదునిఁ జేసి,
ప్రజల యాత్మల నెలకొల్పి, పాలకుఁడుగఁ
బ్రబలి వర్ధిల్ల దీవింపఁ, బరమునెంచి
భక్తి విప్రారఁ బూజించెఁ బలువిధముల. 35

సవతి కౌసల్య దేవపూజలను జేయు
చుండఁగను సుమిత్రయును తో నుండి రామ
భద్రమూర్తికి నిఖిలశుభంబు లొదవ
వలయు నంచునుఁ బ్రార్థించెఁ గలిపి మనసు. 36

రాము దశరథపతి యువరాజుఁ జేయు
నంచు నుత్సాహభరితులై యలరి, పౌర
వరులు దమయింట పెండిలి జరుగనున్న
యటుల భావించి వనుల కాయత్త పడిరి. 37

వాకిళులఁ జల్లి కలయంపి, బాగ నూడ్చి,
రంగు ముగ్గుల నిగ్గుల రమ్యముగను,
దీర్చి, వరుసలు గొనియుండ దీపములను
దివ్యముగ.వెల్గ వెలిఁగించి, తీర్చిదిద్ది 38

కట్టి యనఁటులఁ బోఁకలఁ గంబములకుఁ
బందిళుల నల్లి, పరిమళ స్రవవ మాలి
కలను నందందు వ్రేలాడు కరణి జాఱ
విడిచి, ధ్వజముల నిలిపి పైవిరిసియాడఁ 39

జేసి, కాన్కల నెన్నియో సిద్ధపఱచి
నింపి గంపల నన్నిఁటి, నిగ్గు లొలుకు
పసిఁడి పళ్లెరములలోనఁ బసుపు కుంకు
మల వసంతపు జలములఁ గలిపియుంచి, 40

పురుషులును స్త్రీజనమ్ములుఁ బూర్ణమోద
భరితులై, యలంకృత గాత్రభాసితులయి,
యిండ్ల తొలివాకిళుల నిల్చి యినకులార్కు
రాకలకు వేచియుండిరి రాత్రి గడువ. 41

వస్తునిచయమ్ముతో, మేలివస్త్రములతో,
భక్ష్యములతోడ, మ్రాగిన పండ్లతోడఁ,
బ్రసవ కందుకములతోడఁ, బలురకముల
పరిమళ ద్రవ్యములతోడ, బాలబాలి 42

కలు వలచునట్టి బొమ్మల కొలువుతోడ,
బేరమాడఁగ వచ్చిన వారితోడ,
వణిజవీథులు నవ్యజీవమ్ము నంది
కనులవిందులఁ గొలుపుచుఁ గన్పడినవి. 43

అప్సరోంగన లనఁగఁ గాయములఁ గడిగి,
పట్టుపుట్టమ్ములనుఁ గట్టి, పసిఁడి నగలఁ
బరువుఁ జిల్కుచు ముత్యాల సరులఁ దాల్చి
కాటుకను రాచి, కస్తూరికాతిలకము 44

దీర్చి కను బొమలకు మధ్య దిద్ది నొసఁట,
దువ్వి కురులను, జడనల్లి పువ్వు ముడిచి,
గజ్జియలు గట్టి, బహురాగ గాన ఫణితి
జంత్ర వాద్యాలతో గాఢసఖ్యమందఁ 45

గలిపి పాడుచు, లయ తాళ గతులఁ దప్ప
నటుల బహులాస్య భంగిమ లలరఁ జూపి
హస్తముద్రలు నంగవిన్యాసము లమ
రంగ నాడిరి వేశ్యలు రమ్యముగను. 46

'గాన భారతి కడుపులలోనఁ బుట్టి
గాయకుల కంఠములఁ జేరి కదలి బయటఁ
బడిన చందాన, మేటి విద్వాంసులెల్లఁ
దమ్మునెఱుఁగక పాడి రత్తఱిని దనియ'. 47

కలముఁ జేకొని యెంతయో కాలమయ్యెఁ
గవితలను నల్లలేని దుఃఖమున నున్న
కవులు నప్పుడు, రాముని ఘనతఁ జాటఁ
దగిన వారైరి కోటిపద్యముల నల్లి, 48

రాజరథములు, జాత్యశ్వరాజములును,
భద్రగజములు, యోధుల బలగములును,
ననువుగాఁ దీఱి, రామ పట్టాభిషేక
పర్వదినయోగ్యమై సిద్ధపడఁ దొడంగె. 49

పట్టణమ్మునఁ గలవారు, పల్లియలను
వదలి వచ్చినవారును, బ్రాహ్మణులును,
సచివ సామంతకోటియు, సందువిడక
రాపుఁగొని మూఁగుచుండ' స్వర్గమ్ము నంటు 50

స్వర్ణసౌధాగ్రములనుఁ గొసల మహో జ
నపద విజయధ్వజమ్ములున్నతినిఁ బడసి
చదల నేలుచున్నట్టి సార్వభౌము
లనఁగ స్వేచ్ఛగ రెపరెపలాడుచుండ, 51

పలువిధమ్ముల రత్నదీపముల కాంతి
వన్నెవన్నెల వెలుఁగులఁ జెన్ను మీఱ,
రామపట్టాభిషేక సంభ్రమ విశేష
రాగరోచుల వెదచల్లె రాజవీథి'. 52

అటులఁ గళలీని కలకలలాడుచున్న
భర్మహర్మ్యాల సొబగును, బ్రజల మధుర
భావవర్తనములునుఁ గన్పడఁగ గొప్ప
మేడపై నెక్కి చూచి, పూఁబోడి యొకతె, 53

పరుగు పరుగున దిగి వీథిదఱియ నరిగి,
దాసి నొకదాని నడిగి వృత్తాంత మెల్ల
విశదపడఁ, జిత్త మలిఁగిన విధము నూపి
లోని కరిగెను క్షణములోఁ గానఁబడక. 54

సుతనుఁ గైకను దశరథ పతికి నిచ్చి,
పత్నిగా వానితోడను బంపునపుడు
తండ్రి కేకయ నృపతి, యా తన్వితోడఁ
బంపె దానిని, సతముఁ దోడ్పడుచునుండ. 55

ధరణి మంథర యను పేరఁ బరఁగునద్ది;
'గూనుఁ గలిగిన సుందరి కూటువడిన
గుణము నిండిన కుమతి; యే మనసునైన
మార్పఁ గలిగిన చతుర; దుర్మార్గ చరిత' 56

చెవిని రాముని పట్టాభిషేకవార్త
చేటి వినిపింపఁగా, సూటియీటె పోటు
చెవినిఁ జీల్చినయట్టులఁ జిత్తమందు
చింత చెలరేఁగ నా గూని, శీఘ్రగతుల 57

నరిగి, నిశ్చింతచిత్తయై పరుపుపైనఁ
పండియుండిన కైకనుఁబట్టి యూఁచి,
పలుకుపలుకున జాలియుఁ బలురకముల
భావవైచిత్రియునుఁ గనఁబడుచునుండఁ 58

బలికెనిట్టులఁ గార్యసాఫల్యమంద;
"పడుక చుట్టును నీకుఁ గన్పడని పగిది
పరవు పెనుమంటలవి, నిన్ను దఱిసి దఱిసి
వచ్చి కాల్పఁగ నుండఁగఁ, బిచ్చిదాన, 59

వచ్చికనుగందు వలె నుంత భయములేని
దానవై వండియుంటివి; ధగ ధగ మని
మండి కాయము బూదియై మంటఁ గలియు
వఱకు మేల్కొనలేవు గావలయు నీవు. 60

సవతి కౌసల్యకొడుకు నీ శత్రు వగుచు
రాజుకానుండె నేఁడు; నిర్భాగ్యరాశి
యయ్యె భరతుఁడు; నీ గర్వ మడఁచి యేలఁ
గలఁడు రాముఁడు; లోని సూక్ష్మమ్ము గనుము". 61

అనిన యంతనె రామపట్టాభిషేక
వార్తఁ దెలిపిన దానికిఁ బసదనముగ
నొసఁగె రత్నాల హారమ్ము నొకటి, యవలి
పలుకులను బాటిసేయనివగిది కైక. 62

తాఱుమాఱులుగాఁ దన తలఁపులన్ని
మండ, మంథర యూరక యుండలేక,
దండ నొకదండ వినరి, పెన్దావ మంది
సదమదంపడుచును, గైక స్వాంతము నెటొ 63

'చక్క మెలివడఁ జెఱపి', కౌసల్య కొడుకు
పైని వ్యామోహమును మాన్పి, వక్రముగ ను
బలికి తనదారి కీడ్వంగఁ, బట్టువిడని
భంగినిటు వల్కె మఱల, నప్పడఁతితోడ. 64

మంచి చెడుగుల నెఱుఁగని మగువ మనను
మార్ప నేరికిఁ దరము? నా మాటలన్ని
మంటిలోఁ గల్పి, యేమి కానుంటివేమొ
తల్లి, సంతోషమునఁ బొంగు తరుణమిద్ది 65

కాదు; నమ్ముము నామాట; కార్యము సెడి
కలఁత లొందవెడు మున్నుగఁ దెలివినంది,
తగిన యత్నమ్ములనుఁ జేయఁదగును వినుము;
భరతుఁ డేమౌనొ కనుము, విభ్రాంతి విడుము. 66

'రాముఁ డిఁక రాజు; కౌసల్య రాజమాత
యగును; ముదుసలి దశరథుఁ డరుగు దివికి;
ప్రజలు రాముని( గొలుతురు; భరతుఁ డింక
బానిసగ నుండుఁ; దప్పని భంగి యిద్ది'. 67

వన్నెలో వయసులో, నీవె మిన్న యనుచుఁ,
బతిని దశరథు నీ చేతివానిఁ జేసి,
సవతులను జిన్నవుచ్చిన సంఘటనల
జ్ఞప్తికినిఁ దెచ్చుకొని, యిఁక జరుగనున్న 68

సంభవమ్ములఁ దలఁచినఁ జాలు, ముందుఁ
గలుగనున్నట్టి చేటులు కంటిముందు
కానఁబడు స్పష్టముగ నీకుఁ; గాన, దీఁవ
ముండ నింటిని సరిదిద్ది యుంచికొనుము. 69

బ్రదుకు బరువుల మఱపించు పానశాల
యగుదు వీవంచుఁ, గామదాహమ్ముఁ దీర్చు
కొనఁగ భూపతి, నినుఁగూడి కుత్సితుఁ డయి
వట్టి లాలించి, సోలించి, భ్రమల ముంచి, 70

మనసునంతయు నటఁ బట్టమహిషి కోస
లాధిపుని సుత కౌసల్యయందె నిలిపి,
దానివట్టినె ప్రేమించి, దాసిఁజేయఁ
దలఁచె నీనాడు వినుము కృతఘ్నుఁడగుచు. 71

పట్టణ నివాసులకు నందఁ బ్రాఁకినట్టి
ప్రబల మంగళవార్త, యిప్పటికి నీదు
కర్ణములఁ బడవేయని కారణమునుఁ
గనిన, 'నటశేఖరుని' లోని కపటవర్త 72

నమ్ము వెలివడు; నా మాట నమ్మఁదగిన
మాట; మొన్ననె భరతు నమ్మతునిఁజేసి
యనిపె నీ తండ్రి యింటికి; నంత రార్థ
మందు విశదము; సందేహ మిందు లేదు. 73

అగ్రజుఁడు మకుటమునంద నడ్డుపడు న
తం డటంచును నూహించి, తరలఁ బంపె
నాతనిని రాజు, రామ పట్టాభిషేక
విధులు గొనసాఁగ త్వరగ, నిర్విఘ్నముగను. 74

ధన్య కౌసల్యయును, సుమిత్రయును, నిన్ను
సరకుఁ సేయక, వెనుకటి సంభవముల
స్మరణకునుఁ దెచ్చుకొని, యవమానితనుగఁ
జేయ, మోచేతి క్రింది గంజిని గడించి, 75

త్రాగి బ్రదికెడు పెనుదలవ్రాత నీది
యైన నేనేమి సేతును! మాని వగుదు
వేని శుభయత్నముల నిల్పుదాన వగు"మ
టన్న, నర్థవిహీనములయ్యె నంత 76

రంగమునుఁ దాఁకఁ కలిగి మా రాము పెట్టఁ
దగిన మంథర మాటలఁ దగిలి, తప్పు
కొనఁగ లేనట్టి కైక భావినిఁ దలంచి,
చిత్రముగ మారి, దానితోఁ జెప్పె నిటుల; 77

"పుడమినుండఁగ నా చేఁతి బొమ్మ, దశర
థుఁడు, గతింపక యింకను, సిగ్గుమాలి
బ్రదుకు తలవ్రాత నాకు నేర్పడదు; 'నీదు
మాటలన్నియు మనసులో నాటికొనియె'. 78

మంధరా, మోనపోనీఁక; మార్గ మొకటి
మంచిదానినిఁ జక్క నూహించి నాకుఁ
జెప్పు మంతియె చాలు దుశ్చేష్టలన్ని
శిథిలమౌనటుఁసేసి నిశ్చింత మనుదు". 79

నంచుఁ, దన పట్టి భరతునకన్న మిన్న
యనెడు సద్భావమున రామునండఁజేర్చి,
తఱచు ప్రేమనుఁ జూపిన తల్లి కైక,
దాసి మంధర మాటలు తలకు నెక్క 80

మందమతియయి, గతిసెడి, మంగళముల
మావు మార్గమ్ము నడుగ; దుర్మార్గచరిత
మంధరయు డెందమునఁ బొంగి, మందహాస
మధుర వదనారవిందయై - "మంచిదాన 81

వైతి విఁక చేటు దప్పును; లాతివారి
మధ్య మానమ్ము నిలుచును; మార్గ మొండు
కలదు గొప్పది, నీ వంతఁ దొలఁగఁజేసి
యతులితానంద మొనఁగి సాహాయ్యవడఁగ. 82

అల్ల నొకనాడు నీవు దేవాసురులకు
కయ్య మొనఁగూడ, దేవపక్షమునుఁ బూని
పోరనేగిన పతి వెంటఁబోయి, వానిఁ
గాచితివి రెండు మాఱులు గాయపడిన; 83

మెచ్చి వరముల రెంటిని నిచ్చె నతఁడు-
వలఁచినప్పుడు కోరుదు వాని ననుచుఁ
బలికి, యీనాటివఱకును వానిఁగొనక
యుంటివను మాట మఱవకు; మొక్కవరము 84

భరతునకుఁ బట్టమునుఁ గట్టు; మఱియు నొక్క
వరము వదియును నాలుగు వత్సరముల
పాటు రాముని వని నుండఁ బంపు; దానఁ
జెడుగు లన్నియుఁ దొలఁగి నీ చింత మాయు. 85

ప్రజలు రామునె కొలుతురు; భరతుఁడేలు
కాలమున వాఁడు కడనున్నఁ గలదు ముప్పు;
వాని పక్షమ్ముఁ బూని యెప్పటికి నైన
భరతుఁ బడఁద్రోయఁగలరు పైఁబడి వధించి. 86

కాన, రెండవ వరమునుఁ గారణమ్ముఁ
గలిగియే యట్లు కోరఁగ వలతు నిన్ను;
వట్టువీడకు; వర మిచ్చువఱకుఁ బతిని
వదలనే బోకు; మతఁడును వచ్చువేళ 87

యయ్యె; వడిగొని కోవ గృహాంతరమున
కరుగు"మని యన్నఁ, గైకయు నపుడె నగల
వదలి మసికోకఁ గట్టి, కోవగృహాన
'మన్నుపైఁ బండె, దీనయై చెన్ను దఱిగి'. 88

అంత నరపతి రామపట్టాభిషేక
పర్వదినమున కెక్కిన పనులకుఁ దగు
వారి నియమించి, యా శుభవార్త ననుఁగుఁ
గైకకునుఁ జెప్పఁగోరి, యక్కలికి యున్న 89

పట్టువెదకుచుఁ జని, గడపలను దాటి,
పరిచితంబగుఁ తలముల కరిగిచూచి,
దానిఁగానక నెందునుఁ దహతహపడి,
తత్తరంబున నడుగులు దడబడఁగను, 90

జడిసి దడలాడ గుండియ, సంశయములు
స్వాంతమందునఁ జెలలాడ, శాంతి భంగ
మగునొ యేమో యటంచు నాయాసపడుచు,
దఱిసి కోపగృహమ్మున కరిగిచూచె. 91

చండ పవనోద్ధతిని వృక్షకాండ మొండు
విఱిగి పడియుండె నట నను విధము దోఁపఁ,
గొయ్యవారిన కాయము గుతలముపయిఁ
గూలిపడియున్నఁ జూచి, యా కువలయపతి 92

క్షణము దిగ్భ్రాంతుఁడయి నిల్చి, కనులు దెఱచి
కాంచి, మాసిన చీరెనుఁగట్టి యటులఁ
గైక నేలను బడియున్న కారణమును
గానఁగాలేక, లోలోనఁ గలఁత లొదవ, 93

ధరణిపై 'దాని' దండను దనువు డించి,
తట్టి తనువెల్ల నిమురుచు, దయనుఁ గోరు
దీనుఁడై పల్కరించెనుఁ, దీయనైన
పల్కులనుఁ గంఠమును విడఁ బయటి కీడ్చి. 94

"రామ పట్టాభిషేక సంభ్రమము లెల్ల
కడల వ్యాపింపఁ; బ్రజలెల్లఁ గౌతుకమున
నుండ; నీ విట్లు నేలనుఁ బండి శోక
పడుచు నుండుట చిత్రము! పడఁతిమిన్న. 95

పొవు లెవ్వరు నిన్నిట్టి వగలఁదగులఁ
బెట్టిరో తెల్పు మిపుడె; వారెట్టి శూరు
లైన వధియించి నీ కాళ్ళపైనివైతు
దశరథుని మానసపురాణి తావమందఁ 96

దగదు దిక్కఱి; శుభవేళ దఱియుచున్న
తఱిని నీవిట్లు సొబఁగుల నురల నిచ్చి
మాసివడియుండఁ దగదు; నీ మనసు మాఱ,
నంతనము పాఱ లెమ్ము, ప్రశాంత వగుచు. 97

'కన్న కొడుకైన భరతునికన్న మిన్న
యగును రాముం డటంచును నతని నెపుడుఁ
దలఁపులందునఁ దావిడి వలఁచి పిలిచి
యాదరించుచు నున్న దయార్ద్రహృదయ 98

వగుదువే నీవు' ! వాని పట్టాభిషేక
వార్త నిన్నెట్లు కలఁచును? వగపుఁజెంద
వలయు కారణ మదికాదు; తెలియు నాకుఁ
గైక మనసెట్టిదో, క్రొత్తగాని కతన. 99

నన్నుఁ గరుణించి, యేవెత నిన్నునిట్లు
నేఁడు కలవరఁపెట్టునో నిండు మనసుఁ
గలిగి వివరించి చెప్పుము, వలుకకుండఁ
బండియుండిన సాధించు పనియదేమి? 100

వంతవిడి నీవు సుఖవడ వలయునన్న
వాంఛయే నన్ను వేధించుఁ; బ్రాణములనె
పట్టియిత్తును గొనుము ని న్నట్టిచేఁత
యలరఁ జేయునటన్న; నా పలుకు వినుము. 101

దశరథుం డట్లు మెలమెల్లఁ దనదుదారిఁ
బడుచుఁ బ్రాధేయపడుచుండఁ, బలుకఁదగిన
భావభంగిమలను లోనఁ బక్వపఱిచి
కొన్న కైకేయి, యలిగిన సన్నఁజూపి, 102

మెల్లఁగను లేచి, నాథుని నొల్లనటులఁ
దాఁకునకు నందరానట్టి తలమునకును
జరిగి కూర్చుండి, నిట్టూర్చి - "చాలు చాలుఁ
బలికినది యెల్లఁజాలును; వలదు నీదు 103

జోలి నాకింక జన్మజన్మాలకైన;
వట్టి నయగారములఁ బల్కి ప్రణయభంగి
యుట్టిపడునట్లుఁ గడకు నన్నిట్టి గతికిఁ
దెచ్చితివి; నాకు దేవుఁడే దిక్కు యింక. 104

ప్రాణముల నిచ్చువాఁడవా? పలుకు నిలిపి
కొనఁగఁ జాలినవాఁడవా? మనసు విచ్చి
పలుకఁగలవాఁడవా? మేటివంచకుఁడవు;
చెడితి నిను నమ్మి యిఁక వేయి చెప్పనేల? 105

వంశనామమ్ము నిలిపెడువాఁడవేని,
యాడి తప్పక చరియించువాఁడవేనిఁ,
బడఁతులను మోసగించనివాఁడవేని,
ప్రతిన సేయుము 'నా వట్టి రామునానఁ 106

బెట్టి, నీ కోరికలఁ దీర్తు నెట్టివైన
నంచు నిప్పుడె; యవల సత్యమ్ము నెఱుఁగఁ
జాలి నిను నమ్మి నేనుండ, సంశయములు
సమయ సంతోషచిత్తనై సఖ్యమంది. 107

ప్రతినఁ గ్రొత్తగఁ గొననేల? ప్రాతయవియె
పాలి మఱుఁగునఁ బడియుండఁ; జాలుదేని
జ్ఞప్తికినిఁ దెచ్చుకొని, మున్ను సమరరంగ
మందు, నా సాయముననను గాయములు వాయఁ, 108

బరమసంతోషమున రెండు వరము లిచ్చి
నట్టి సంభవములను; న్యాయమ్ము నిలిపి
నా కొసంగుము నేఁడు; ఇన్నాళ్ళు వాని
నడుగకుంటిని తరుణ మేర్పడక యున్న 109

భరతునకుఁ బట్టమునుఁ గట్టవలయు; వనికిఁ
బంపవలె రామచంద్రునిఁ బదియు నాల్గు
వత్సరములుండ; మాటఁదప్పని విధాన
సఫల మొనరించి వరముల, సత్పథమునఁ 110

బడుమ" టంచును, మోమోఁటపడక, గుండె
బండయై యుండఁ, గడనుండి వలుకుచుండ,
మనను మండిన యట్టుల మతి కలంగి
మనుజపాలుఁడు కని కని, కంటి ముందుఁ 111

గానఁబడుచున్న క్రూర భీకర మహోగ్ర
చండ శక్తిస్వరూపిణి, నిండు కంప
మంది తడఁబడి కలఁతయు నలుకయు నొక
మారె తలఁపునఁ బురిఁకొన, మాట పెగిలి 112

బయటఁ బడకున్న, తబ్బిబ్బు పడుచు, తాప
భరము దుర్భరమైపోవఁ, బట్టియడఁచు
యత్నములు భంగపడుచుండ, నాగలేక,
యనువులనె కోలుపోయిన యటులఁ గ్రుంగి, 113

"ఎట్టి మోసము! నాకైక యిట్టి దిట్ట
యగు నటంచును స్వప్నము నందునైనఁ
దలఁచి యెఱుఁగను; 'రతనాల మొలఁక' యనుచు
వలఁచి నీ మ్రోలఁ బడితిని; ప్రాణములకుఁ 114

బ్రాణ మని యెంచి, నుత్తమపత్నులిర్వు
రనుమతించక, స్వర్గమే యనుచు భ్రమసి
సతము నీ యింట నుంటిని; చలముఁ బట్టు
నేల నాపైని? సుందరీ, జాలిగొనుము. 115

వరము లిచ్చెడు వారలు ధరణిఁ గలరు;
కలరు గైకొనువారలు; కాని, యిట్లు
వరవిధాతను నన్నిట్టి వగిదిఁ బట్టి
చంపనుంటివి నీవె; నిస్సంశయ మిది. 116

కయ్యమున సాయపడిన సత్కారణమున
వరము లొసఁగిన మాటను మఱవ; నయ్యుఁ
బాప చింతనలకునుఁ బాల్పడుచు నిట్లు
కోర రానట్టి కోర్కెలఁ గోరరాదు. 117

సంతసమ్మున వరసహస్రముల, నడుగఁ
దగిన వాని నడుగుము, సద్భావముననుఁ;
దడవుసేయక వర్షింతుఁ; జెడుగు లెంచి
చెడకు మాప్తుల చిత్తాలఁ జిన్నపుచ్చి. 118

భర్మహర్మ్యాలు వలయునా? వలయునేమి
పట్టు పుట్టాలు? వలయునా పసిఁడి నగలు?
పరిజనమ్ములు వలయునా? వలయునా మ
హారథమ్ములు గజములు నశ్వములును? 119

జాగు సేయక యడుగుమో జాణ, రామ
భద్రు జోలికిఁ బోకుము; పాదములనుఁ
బట్టి యాచింతు, నటు సేయఁ బాడికాని
పగిది నెఱిఁగియు; దయఁజూచి పట్టువిడుము. 120

దైవమని తండ్రిఁ గొలుచు నుత్తముఁడు; ముగురు
దల్లులను భేద మెంచక తనుపు సుతుఁడు;
బుధుల మన్నన లందిన పుణ్యుఁడు; బహు
జన హితుండు సద్గుణగణఖనియు, జ్యేష్ఠుఁ 121

డైన, మన రామచంద్రు రాజ్యార్హుఁ జేయు
న్యాయ మన్యాయ మనకుము నన్ను, నిన్ను,
నీవు కన్నట్టి భరతుని నీతి నెఱిఁగి
పాలనము సేయ దక్షుఁడు - పామరవయి 122

సత్యములుగాని శంకల సదమదఁపడి
సౌఖ్యములఁ గాలదన్నకు, శాంతిచెడఁగ;
రాముఁడొక్కఁడు, కనఁగ భరతుఁడొకఁడును
గాఁడు; కైకకు నిరువురుఁ గన్నసుతులె. 123

మంచి మనసుంచి, రాజధర్మమ్ము నెంచి,
మకుట మందఁగ నిమ్ము క్షేమమ్ము గలుగ
రామభద్రుని దీవించి; నా మనసును
మంటలను బెట్టి కాల్పకు, మఱల మఱల. 124



సకల సామంతరాజులు సచివులు పుర
జనులు నిండిన సభయెల్ల సమ్మతింప,
నగ్రజుని రామభద్రుఁ బట్టాభిషిక్తుఁ
జేతునని చాటి వచ్చితిఁ; జేయనె వలె. 125

పలికి బొంకని నృపతి యిక్ష్వాకువంశ
మణి, కడుంగడు వృద్ధుఁడు, మాననీయుఁ
డా దశరథుఁడు కాఁడు సత్యవ్రతుండ
టంచుఁ బలునోళ్ళు ననుఁ బరిహాసవాక్య 126

ములను జులకనఁ బఱచుచుఁ బలుక వినఁగ
వలతువా నీవు? నా ప్రియపత్నివి కద,
నాదు పరువు ప్రతిష్ఠయు నీదె యౌట
నుంత యోచించి చూడుము సుదతి యనుచుఁ 127

బలికి, యనునయ వాక్సుధాకలశములను,
జ్ఞాన ధర్మామృతమ్ములఁ జక్కఁ గలిపి
యధరముల కందియిచ్చియుఁ, గుధరమట్లు,
నుంత చలియింపకుండిన యింతినిఁ గని, 128

సహనశక్తులు నశియింప, సైపలేక
సార్వభౌముఁడు, - "నీవు పిశాచి, దుష్ట
దానవాంగన, దహియించు దారుణాగ్ని,
జటిల, కుటిలవు, కుమతివి, చవట వనుచు 129

నాగ్రహోగ్నుల వెలిఁగ్రక్కి, యలసి సొలసి,
సత్యమునుఁ దప్ప వెఱచి, యగత్యముగను,
వనికి రామునిఁ బంపనే షంపవలయు
ననెడుఁ పెన్వెతలోఁబడి, మనసు విఱుగ, 130

'రామ, నా రామ, యో రామ రామ,' యనుచు
వాయిఁ దెగవిచ్చి యఱచుచు, వసుధపైనిఁ
బడెను, జెమరించి యొడలెల్ల వడఁకుచుండ,
నురువు గ్రక్కుచు మూర్ఛిల్లి కరుణ గురియ. 131

రాత్రి యంతయుఁ దన బహిః ప్రాణమైన
రాము నెటులైన నరి, యువరాజుఁ జేసి
యడవి పాలుగఁ బోనీక నాదుకొనెడు
వాంఛతోఁ బాటుపడిన భూపతి ధరణినిఁ 132

బడిన యంతనె, తూర్పున భానుమూర్తి
యవతరించెను; భయదకృష్ణాంబుదమ్ము
లంతలో దండులై మూఁగి యతనిఁ గప్పి,
పగటినే రాత్రిసేసి యావలఁ దొలంగె'. 133

ఆ దినమె రామభద్రు పట్టాభిషేక
పర్వదినమౌట నగరము పట్టరాని
కౌతుకమ్మునఁ గళలీనెఁ గనుల పండు
వుగను నవశోభలంది యపూర్వగతుల. 134

రాజమందిర సభ నూగు రాలనట్టి
రంగమైయొప్పె, సామంతరాజసచివ
చంద్ర సంచయ సాంద్రమై, స్వర్గసార్వ
భౌము సభ యన, నానందధామ మగుచు. 135

భద్రకరముగ, నుంతయు భంగపడని
పగిదిఁ బట్టాభిషేకపర్వమ్ము పండఁ,
బ్రార్థనల సేయఁ దొడఁగిరి, ప్రజలు గలిసి
వాడవాడల, నింటింట, భక్తిమీఱ. 136

నగరమున నెల్లకడల మంగళవినోద
వాద్యఘోషలు, సకలదేవస్థలముల
కంచు గంటల మ్రోఁతలు, గర్ణపేయ
ములయి సెలఁగినయవి శుభములను జల్లి. 137

నాల్గు దిక్కుల నున్న పుణ్యస్రవంతు
లందుఁ గల, యభిషేకయోగ్యమ్ములైన
యమల జలములఁ, బసిఁడి కుంభముల నింపి,
పరిమళద్రవ్యముల సుమపత్రములను 138

సురభిళ మొనర్చి, రాజమందిరముఁ జేర
నరుగఁ దొడఁగిరి వరున భూసురులు; పుణ్య
సరయువున స్నాన మొనరించి, సర్వలోక
కర్మసాక్షికి, నుదయభాస్కరుని కెఱఁగి 139

యర్ఘ్య మర్పించి, పూర్వసంధ్యాహ్నికముల
నలిపి, పరిశుద్ధ నూత్నవస్త్రములఁ దాల్చి,
గురువరుఁడు, వసిష్ఠుఁడు పుష్య మరుగుదెంచు
తరుణ మది దరియవచ్చిన, దశరథునకు 140

మాటఁ బంపెను నవుడె, సుమంత్రుఁ బిలిచి;
ఆజ్ఞగొని యాతఁడును ముదమంది, సత్వ
రమ్మె యశ్వమ్ములను బూన్చి రథము సిద్ధ
పఱచి యరిగెను, రాజున్నపట్టుఁజేర. 141

అందు, భూపతి మూర్ఛిల్లి యవనిపైన,
'రామ, రామా' యటంచు నారాటపడుచు
పడఁతి కైకేయి ముంగలఁ బడి, కలవర
పడుచు నుండుటఁ గని, గుండె వగిలినట్లు 142

బాధపడి, చేయనేమియుఁ బాలువోక,
భ్రమసి మ్రాన్పడి నిల్చెను; వానిని గని
నంత, భరతుని గన్న గయ్యాళి, రాము
నటకు రావించి, యడవికి ననుప నదియె 143

తగిన తరుణ మ్మటంచును దలఁచి, చక్క
మలఁచి గుండెను రాయిగ మార్చికొన్న
దగుట, జంకక గొంకక, దిగులు పడక
'రామచంద్రునిఁ జూడ నీ రాజు వలఁచి 144

పరితపించుచునుండె నిప్పగిదిఁ; గాన
చని, యిటకు వానిఁ గొనితెమ్ము సారథి, యని
చల్లఁగను బల్కె మధుర రసమ్ము లొలుకుఁ
పలుకులను సత్యమును గప్పి బయటఁ బడక. 145

ఆమె యటువల్క విని, సంశయాత్ముఁ డగుచుఁ
దరలిపోవక నిలిచె నాతఁడు, దశరథు
నాజ్ఞకై వేచి, యా మాయలాడి మనసు
మలిన పడియున్నదన్న మర్మమ్ము నెఱిఁగి. 146

తనువు స్మృతినంద నపుడె కోల్కొనుచు నున్న
కువలయేశుని చెవుల నక్కుమతి యాడి
నట్టి చందము విని విననట్లు పడినఁ
బరితపించుచు, నతఁడు మాఱ్వలుక లేక, 147

భంగపడు సత్యమని యంతరంగ మద్రువ,
వనుల కనువఁగనే వలెఁ దనయు రామ
భద్రు నను దృఢభావము పదిల పడఁగ
మాననమ్మున, విధి దప్పరాని దనుచు 148

మార్గ మన్యమ్ము లేమి, 'సుమంత్ర నేను
దశరథుఁడఁగాను విను; పెనుదయ్యమను; ద
యకును జెల్లనివాఁడ; నన్యాయ వర్త
నుఁడను; బరతంత్రుఁడను; జెడు పడఁతి చేతి 149

యాటబొమ్మను - కైకేయి మాటలె యింక
నాదు మాటలు నమ్ముము; నన్ను నింకఁ
గారణమ్ముల నడుగక కదలిపోయి
రామభద్రుని నీ తండ్రి రమ్మనె నని 150

యిటకుఁ గొనిరమ్ము; పొమ్మన, నేమిసేయ
నగు నటంచును నతఁడు రాజాజ్ఞను గొని,
సెలవు గైగొని చేమోడ్చి శిరము వంచి,
చనెను రాఘవుఁ బిలువ నా స్థలము విడచి. 151

జనకనందనయును రామచంద్రమూర్తి,
యరదమున నలంకృతులయి యరుగుచుండ
రాజమందిరమునకుఁ, బురమ్ములోని
వారు గనులారఁ గాంచఁగ వరున దీఱి 152

యున్న భంగిని గనుచుఁ, గానున్నదేమొ
యనెడు నంశయములు లోనఁ బెనఁగులాడు
చుండఁగను సుమంత్రుఁడు, దారిచూచి రథము
నడిపికొని చని, యినకులోన్నతుని రాము 153

మందిరముఁజేరి, లోనేగి, మనసులోన
మనను నిలువక, యూరక మథనపడుచు
మౌనియై మస్తకము వంచి మాట పెగిలి
రాకయుండినఁ బలుకగలేక నిలువ, 154

మంగళస్నాన మొనరించి మంచి పట్టు
వలువలను గట్టి మేని నంవదను రత్న
హారముల స్వర్ణభూషల నందియిచ్చి,
ద్విగుణముగఁ బెంచి, రఘుకుల దివ్యదీప 155

మన వెలుంగుచుఁ దన్నుఁ బట్టాభిషిక్తుఁ
జేయఁదలఁచిన జనకునిఁ జిత్తమందు
స్థాపితునిఁ జేసి, పూజించి, సకలదేవ
తలనుఁ ద గురీతిఁ గొలిచి, మాతకును మ్రొక్కి, 156

ధాన్యధనరాసులను విప్రతతులఁ దనిపి,
సర్వసంసిద్ధుఁడై శుభసమయమునకుఁ
గాచియుండిన మంగళకరుఁడు, రామ
భద్రుఁడాతనిఁ గని సంతసమ్ము పొంగ, 157

నడిగి జనకుని చిత్తమ్ము నరసి ముందుఁ
గలుగనున్నట్టి ముప్పును దెలియలేని
వానివలె నొప్పి, యపుడె ప్రయాణమై, చ
నెను నరదమును నెక్కి, తండ్రిని గనంగ. 158

ఛత్ర చామరములతోడ, సకలరాజ
లాంఛనమ్ములతోడ, సలక్షణుఁడుగ
స్యందనము మధ్య వెలుఁగుచు, సార్వభౌమ
నందనుఁడు, లోకమోహన సుందరుండు 159

రామభద్రుఁడు పురజనరంజకుండు
రాజవీథిని జనుచుండ, రావుగొనుచుఁ
బ్రజలు గుమిగూడి, గంధపుష్పములఁ జల్లి
సాగనంపిరి కైకమ్మ సదనమునకు. 160

కనులఁ గాల్చెడు దృశ్యము ! కలనునైన
గని యెఱుంగని దృశ్యము గనులముందుఁ
గానఁబడుచున్న, నరకలోకమ్ము మాడ్కి
భయదమైయున్న కైక కోపగృహమ్ము 161

జొచ్చి రాముఁడు కనువిచ్చి చూచి యవని
పైనిఁ బడియున్న జనకుని; మనను చెదరఁ
గంప మందెడు కాయ వికారభంగి
మలను గుట్టుగఁ గప్పి నెమ్మదిగ నరిగి, 162

పాదములనంటి తండ్రికి వందన మిడి,
మ్రొక్కి పినతల్లికిని ఇట్లు మూర్ఛ నంది,
యుండ భూపతి కారణమున్నఁ దెలువఁ
దగు నటంచును వేడె వేదనల మునిఁగి. 163

కైక నిశ్చల యగుచు రాఘవునిఁ జూచి
తీపియును దెల్వియును గార్యదీక్షయును వి
శదవడఁగఁ జిత్తమున కెక్క సాహసించి
వలికె జక్కఁగ మలచిన వల్కుల నిటు 164

"ధర్మ సంకటమున నీదు తండ్రి దవిలి
ధరణిపైనిటు వడియుండె; దాని మర్మ
మరయఁ జెప్పెద వినుము:మున్నఁ మరులకును
దానవులకునుఁ గయ్యమ్ము దప్పకున్న 165

తఱిని నీ తండ్రి దోడ్పడ, నురల వక్ష
మంది పోరాడి, గొప్ప గాయముల నంద
రెండు మారులు, నే కడనుండి సేవఁ
జేసి రక్షించితిని; మోదచిత్తుఁడగుచు 166

వరములను రెండు నన్నుఁగోర వలచె నతఁడు;
వలసినప్పుడు గొందును వల దివుఁడని
వలికి కొనకుంటినాఁడు; కావలసి నేఁడు
కోరికొంటిని వానిని; కోపపడక 167

వివరములఁ దెల్పఁ దెలియుము; విని జనకుని
సంతసిత మానసునిఁజేయ సాయపడుము
చాలుదేనియు; వరముల సార మిద్ది -
భరతునకుఁ బట్టమునుఁ గట్టవలయు; నిన్నుఁ 168

బదియునాలుఁగు నేఁడులపాటు వనుల
వాసమునుజేయ ననుపంగవలయుఁ - బ్రాణ
సముఁడవౌ నిన్ను నొప్పింప సాధ్యపడక,
పలికి బొంకఁగ నొల్లక, పావ మిట్టు 169

పరితపించుచు మూర్ఛిల్లిపడెను నీదు
తండ్రి," యనుచు బదులిడె మూతలనుఁ దెఱచి,
మనసులోనున్న స్వార్థసంపదల నెల్ల
బట్టబయలుగ వెలిగ్రక్కి గుట్టువిడిచి. 170

అనుచుఁ బినతల్లి బదులిడ విని, జనకుని
దైన్యగతి నెంచి తండ్రినే దైవ మనుచుఁ
దలఁచి నిరతమ్ము సేవించు దాశరథి, మ
నమ్ము దపియించ, స్వీయసౌఖ్యమ్ము మఱచి, 171

వనులకును జని పితృవాక్యపాలకుఁడయి
సత్యసంధుఁడు దశరథక్ష్మావిభుఁడను
సత్యమును నిల్ప నిశ్చితస్వాంతుఁడగుచు,
శాంతగంభీరుఁడై, కైక సంతసింప 172

"ఎట్టిపనిచేసితివి తల్లి, ఎట్టివాని
కెట్టి సంకటమునుఁ దెచ్చి పెట్టితీవు!
'గోటితోఁదెగు పనికిని గొడ్డలిఁ గొన
నేల?' ననుఁ బిల్చి యడవులకేగు మనిన 173

నేగియుండన? పెరవాఁడనేమి నేను?
నన్ను భరతుని కన్నను మిన్నయగుచుఁ
జూచుచుంటివి కద? నీదు సుతుఁ డొకఁడును
నేను నొకఁడన? మేము సమానులమెగ? 17

రాముఁడొక్కఁడె తగునేమి? రాజ్యమేల,
భరతుఁడును నందులకుఁ దగువాఁడె వినుము :
వాని పట్టాభిషేక పర్వమునఁ బాలు
గొనెద సంతోషముగ; నేను వనికి నేగ 17

కున్న, నీ యానదీఱ నీ కన్నబిడ్డ
పట్టమును నంద సమ్మతఁపడఁడు; కాన,
నడవులకు నేగెదను దమ్ముఁడరుగుదెంచు
ముందుగనె నిందు మనలక; నందియమ్మ 176

వలదు నాతల్లి, నీ పాద పద్మములకు
వందన మ్మిడి యాచింతుఁ బ్రాణపతిని
వంతలను ముంచఁ దగదింక; వంచనుండి
సతము సేవించుచుండుము చాలు; నేను 177

పోయివత్తును, దీవించి పోఁబలుకుమ',
టంచుఁ బోనుండ, రామవాక్యములు సెవినిఁ
బడిన దశరథనృపతి తాపమ్ము వొంగి
పొరలుచుండఁగ, గుండియ వుండు పడఁగ, 178

వగయు, దిగులును, నలుకయుఁ బాలుపోని
భావవిభ్రమ భంగియు బయలు పడఁగ,
బలుకకుండఁగ లేక నప్పుఁడతిని గని,
"పాపి నీ పచ్చికసి నూఱి పావ మెఱుఁగ 179

నట్టి పావను రాముని నమృత పూర్ణ
హృదయకలశమ్ములోఁ బోతువేల? నిన్నుఁ
గన్నతల్లికి మిన్నగ నెన్ని నతము
నిలిచి సేవించుచుండునే, నీవుఁ గన్న 180

వాని భరతుని, నెప్పుడుఁ బ్రాణసముఁడు
గాఁగఁ బ్రేమించుచుండునే, క్షణముగూడఁ
గంటి ముంగల రామునిఁ గానకున్నఁ
గలవరించుచు నుంటివే, కన్నుగుట్టి 181

కలఁచి రెవ్వరు? నీ మంచి తలఁపుల నిటు
గరళమును గల్పి; నాదు రాఘవుఁడు నీకుఁ
దెచ్చి పెట్టిన ముప్పేది? పిచ్చిదాన,
వనికి నంపఁగఁ బనియేమి? వసుధనేల 182

వలయు రాముఁడె యను ప్రజావాక్యములనుఁ
గాదనంగల సాహసకార్యమునకుఁ
బూని, నీ వట్టికిని నెట్టి పుణ్యఫలముఁ
బట్టి యీయంగ నెంచితో వరముఁ దెఱఁగు! 183

కాని యీచేఁత నీకు సుఖమ్ము గలుగఁ
జేయనే బోదు వినుము; దుశ్చింతల విడి,
చేఁటు దప్పించుకొనుము, నామాట వినుము;
పట్టువిడకున్నఁ జెడెదవు, భరతునకును 184

బట్టమును గట్టవలచినఁ గట్టికొనుము
కోరినటు; రాము వని కంపఁ గోరనేల?
భరతు బంటుగనుండి కొల్వంగ నిమ్ము
పట్టణమ్మును వదలని భంగిఁ బ్రాణ 185

ముండు వఱకును నను వీడకుండ, నవల
నేమియైనను నేఁజూడ; నింతటిదయఁ
జూపఁగలిగినఁ జాలును దావము నెటో
సైచి బ్రదుకంగఁ గలను నేఁజావుఁదప్పి. 186

కన్ను మఱఁగిన రాముఁడు నన్నుఁగూడఁ
బ్రాణములతోడఁ జూడవు; వానినీడ
వలెను లక్ష్మణుఁడరుగును వానివెంట
నడవులకు; వెనువెంటనే కొడుకుల విడి 187

యుండ నేరని తల్లులు నుండ నొల్ల
కుండ విడుతురు; పౌరులు నుండ రెవరు,
రాఘవుం డుండు తలమె స్వర్గ మ్మటంచుఁ
దలఁచి వని కేగుదురుగానఁ; దరలిపోవు 188

వచ్చినట్టులె నిముసాన భరతుఁడును మ
హోగ్రహమునంది నినుఁదిట్టి యన్నకడకు
నడవులకు; నంత నడవియే యమరపురిగ
మాఱుఁ; గోసలరాజ్యము ఘోరకాన 189

నమ్మగును; దిక్కుసెడిన యనదగ శూన్య
తలము నేలుము గ్రుడ్లగూబలును గుంట
నక్కలును గూసి నీదు నున్న తినిఁ జాటు
చుండఁ బైశాచ గణములు దాండవింప! 190

మధుర మకరంద మలఁదిన మచ్చుకత్తి
మానినీసృష్టి' యనుమాట మఱచి, నీకు
వరము లిచ్చిన పౌరపాటు పనికిఁ దగిన
ఫలితముల నందనే వలె, పలికిబొంకు 191

వాఁడనేఁగాకయుండుట; వలఁచినట్లు
పాడువడిపొమ్ము- నీవు నా భార్యకావు;
పుత్త్రుఁడును గాఁడు భరతుఁడు పొమ్మ"టన్న
జనకుమాటల నటనుండి వినుచనున్న 192

రాఘవుఁడు దండ్రి నోదార్చ "రావువడఁగ
నేల నాయయ్య, సత్యమ్ము నేలఁదలఁచు
వారలకు వంత లొదవుట వసుధలోన
నహజమే కద, పూర్ణవిజ్ఞాని వయ్యుఁ 193

బాశములఁ జిక్కి సత్యప్రభావశక్తి
నరయకుండుట చిత్రము! తిరముగాని
వారు, సుతులును, సతులును, బంధుగులును -
సత్యమే నిత్యమై నిల్చుసంపద యని 194

నేను నీవంటివానికి నేఁడు సెప్పఁ
దగని న్యాయము; దినములై తరలిపోవఁ
గలవు పదునాలుగేఁడులు; గన్నుమూసి
తెఱచులోనవె నేనేగి మఱలివత్తు; 195

మాటఁ బాలించుకొనుమ"ని మధురముగను
బలికి ప్రణమిల్లి యింక నప్పట్టునందు
మసలుచుండిన యాతని మనసు మథన
వడుచునే యుండు ననుచును వదలి వెడలె. 196

ధర్మనిరతుని జ్యేష్ఠనందనుని, రామ
భద్రు దశరథనృపతి, యబ్బంగి కైక
పట్టియాడింప నాడుచు, వనికి నంపఁ
బాలువడెనన్న వార్తలు ప్రాఁకిపోవ, 197

గర్భగర్భమ్ము కదల లోకమ్ము లెల్లఁ
గదలినట్లుఁ గనిపించి, యెద కలంగి,
క్రమ్ముఁజెమ్మట కాయమ్ము గంపమందు
చుండ దడదడలాడుచు గుండె వగుల 198

నుండ మతిసెడి. గతిసెడియున్న రామ
జనని, యన్యాయముగఁ బతి సవతి కైక
మాటలకు లొంగి, తనయు ఘోరాటవికినిఁ
బంప నెంచిన; నాథునిఁ బాతకునిగ 199

నడుగఁ దగనట్టి వరముల నడిగి కడుపు
మండఁబెట్టిన కుటిలను మనసులోని
మంటలాఱఁగ దూషించి, మంగళాత్ము
లైన పౌరుల సాయమ్ము నంది, యడ్డు 200

పడెడు మూర్ఖుల దండించి, పట్టభద్రుఁ
డై సుఖింపఁగ నగునని యతని వేడ;
ధర్మసూక్ష్మమ్ములను న్యాయమర్మములను
జక్క వివరించి యోదార్చి మ్రొక్కి, దీవె 201

నలను గైకొని, సతియెందు నాథునంటి
యున్న, నందెల్ల వరసుఖ మున్న దనియుఁ,
గానయే స్వర్గమని యెంచి కాంతుతోడ
నంతనమ్మున వసియింపఁ జాలు ననియుఁ 202

జెప్పి, వలదని వాదింప నొప్పకుండ
వెంటఁబడి వత్తునని యన్న వినయఖనిని
జానకిని వెంట నిడికొని, క్షణ మతనిని
విడిచియుండఁగ లేఁడని నుడివి, తల్లి 203

నంతసమ్మున దీవించి సాగనంపఁ
బయన పడినట్టి లక్ష్మణు వదలలేక
తన్ను వెన్నాడ నిచ్చి, కాంతారమునకుఁ
దరలిపోయెడు మున్నుగఁ దండ్రినిఁ గడ 204

సారి దర్శించి, కైకమ్మ నంతసింప
వందనం బిడి సెలవంది, పట్టణమును
వదలి వనికేగనెంచి, సంపదల విడచి,
'సర్వసామాన్యుఁడన నొప్పి, శాంతవీర 205

రసము చిప్పిలు దరహాస రమ్యవదన
పద్ముఁడై, నిర్వికారుఁడై, భాసమాన
గాత్రుఁడై రాఘవుఁడు ననెఁ', గాలినడకఁ
బట్టి బాటను ద్రొక్కుచు వగవనట్లు. 206

వచ్చునెప్పుడు పురమును వదలి; వనికి
నరుగు నెప్పుడు? రాముఁడటంచు వేఁచి
కాఁచి యుండిన కైక, యిక్ష్వాకుకుల తి
లకుఁడు జానకితోడను లక్ష్మణునితొ 207

వనికి నేగఁ గ సిద్ధమై వచ్చియుండఁ,
జూచి కోరిన కోరిక వూఁచినటులఁ
"బదియునాలుఁగునేఁడులపాటు వనిని
వాస మొనరింప వలసిన వారలకును 208

బరువు, చీనాంశుకమ్ములు బసిఁడినగలు;
వల్కలమ్ములె దగు" నంచు వారిముందు
వాని నిడె; కష్టపడకుండ భాగ్య మనుచు
నందుకొనె రాఘవుఁడును మోదాత్ముఁడగుచు. 209

వదలి యంతట నగలను వస్త్రములను,
వల్కలమ్ములఁ గట్టిరి,వసుధనేలఁ
గలుగు శూరులు రామలక్ష్మణులు; నంత
వసుధ గన్నట్టి పునిత యా వల్కలమును 21(

గట్టి యెఱుఁగని దగుట నిక్కట్టువడుచు,
నారచీరెను మేననుఁ దాఱుమాఱు
లగుచు ధరియింప యత్నించు నవసరమున,
జాలిఁగొని రామచంద్రుఁడు, సాయపడఁగ 211

నెంచి, సతిమేన నుంత యోచింపకుండ
దానిఁ గప్పంగఁ దలఁపఁడె, దండనున్న
వారి హృదయమ్ము దపియింపఁ బాపినియగు
గైక చలియింప నేమికాఁగలదొ' యంచు. 212

ముని వసిష్ఠుఁడు గోపించి "మూఢమతివి
ముప్పు దప్పదు నీకు మున్ముందు; నీచు
రాల వనిపించుకొనకు; మర్యాద విడిచి
గట్టుదాటకు; నీ పుట్టు గుట్టునాకు 213

బాగ తెలియును; నీ మాత పతినె చంప
జంకకుండిన నెఱజాణ; యింక దాని
తనయ నీకెట్టు లబ్బు సుగుణము? కాన
కనువఁ గల్గును రాము నొక్కనినె నీదు 214

వరమహాబలయుక్తి; యీ ధరణిజాత,
సాధ్వి సీతను శాసింపఁ జాలినట్టి
సార్వభౌమివిగాలేవు; సర్వ మంగ
ళాంచితగ నీమె వెడలు; నీ యాగడములఁ 215

గట్టిపెట్టుము, మతిసెడి యుట్టిపడకు"
మనుచు నిందించుచుండఁగ, మనసుమండి
దశరథుఁడు, పల్కు వేర్వడ, దండ నున్న
సారథిని సుమంత్రునిఁ జూచి స్పష్టముగను, 216

"వనిని వసియింప వలసిన వత్సరముల
నున్న దినముల లెక్కించి, యెన్నియున్న
నన్ని నగలను జీరెల, నరదమునను
జక్క పొందించి వనులకు సాగిపొమ్మ 217

టంచు శాసించె, తాపమ్ము మించి కనులు
చెఱువులై నిండఁ గన్నీళ్ళు ధరణిఁగాల్వ
గట్టిపాఱఁ దొడంగ, మైకమ్ము దగిలి
కాయము వడంక, చిత్తము గటకట పడ. 218

దాశరథి పత్నితో సహోదరునితోడ
రాజభోగమ్ము విడిచి యరణ్యమునకుఁ
దరలిపోవఁగనుండ నంతఃపురమ్ము
నందుఁగల కాంత లెల్ల నాయాసపడుచు 219

సాగనంపఁగ వచ్చిన, సదన మద్ది
కడుగఁబడెవేఁడి కన్నీటఁ, గైక మనసు
మహినిఁ గ్రక్కిన దుర్మద మలినములవి
పాయ పాపాగ్ని చల్లాఱ, వగలె మిగుల. 220

తాపమును మ్రింగి యెట్టులో తనయు నొత్తి
కౌఁగిటను జక్క ముద్దాడి, "కైక పుణ్య
ఫలము పండఁగ నాముద్దుపట్టి వనికిఁ
బయనమైపోయి రమ్ము శుభమ్ము లొదవు" 221

నంచు, రాముని౯ దనియ దీవించి యను౯గు౯
గోడలిని సీత౯గడ౯బిల్చి "గుణగణాన్వి
తవు; పతిని దైవసమునిగా౯ దల౯చి కొలుచు
సతివి; నాతల్లి, నీకు౯ బతివ్రతా మ 222

హిమను బోధింప౯ గలుగ నేనెంతదాన?
మమత పీడింప నిత్తఱి మాట లొకటి
రెండు సెప్పక యూరక యుండలేని
మనసు మతిమాపి పలికెడు; మాఱుదల౯ప 223

రాదు; కంటికిఱెప్పగ రామభద్రు౯
గా౯చి కొలువుము నమ్మి నీకరములందు౯
బెట్టుచుంటిని, వెల౯దులు విశ్వమందు౯
బతుల సంపదలున్నంత వఱకె దనిపి 224

భాగ్యములు మాసినంతనె వలుచ౯ జేసి
పలుకుచుండుట సహజము; వారికేమి
కాని, నీవట్టి సతిగావుకద, కలంగ౯
గారణమె లేదు నాకు; మంగళము కలుగు 225

నీకు" నని చెప్పి కౌసల్య నిండు మనసు
తోడ వీడ్కొల్ప, "రామ న న్వీడిపోకు
మయ్య" యనుచు నున్మాదుని యట్టులఱచి
దశరథు౯డు నేల౯బడిదొర్ల, వశముగాక 226

వగల దిగ్రమింగ౯, పౌరులు పొగిలి పొగిలి
యేడ్చుచును౯ జుట్టుమూ౯గంగ నెందు సందు
విడక దారిని౯గొని యెట్లొ నడచి ముందు౯
బడుచు వా౯కిట సిద్ధమై విడిసియున్న 227

యరదమున రామలక్ష్మణు లంత నవని
జాతతోఁ జక్క నమరిరి; సాగిపోయె
రథ మయోధ్యను విడచి ధూరజము మిన్నుఁ
దాఁకఁ బైరేఁగుచుండ విస్తారముగను. 228

పట్టణమ్మది యవల దుర్భర విషాద
వహ్నిలోఁబడి దగ్ధమై పరువుదొరలఁ
బాడువడినది, రోదనధ్వనులె యెల్ల
కడల మ్రోఁగఁ గడు భయంకరముగాఁగ. 229

మధురమంగళవాద్య నిర్మల నినాద
మధువు పొంగినవాడల మగువ లేడ్వఁ,
బాఱె నత్యుష్ణ శోకబాష్ప ప్రవాహ
ములు, వికసితార్ద్ర హృత్పద్మముల దహించి. 230

రామరథమును నాల్గువర్ణముల పౌర
జన సమూహము వెన్నంటఁ గనిన, గజ హ
య పశుగణములు వారితో నరుగఁ దొడఁగెఁ
బట్టులను ద్రెంచుకొని యుండఁ బట్టలేక. 231

బాటపొడవున నటు రామభద్రుఁడడవి
కరుగుచుండఁగఁ గని, గుండె కరుగ నేడ్చుఁ
చందమునఁ జరాచర కోటినంచలించె
సంక్షుభిత మానసవికార సాంద్రములయి. 232

దట్టముగ నాటుకొని వ్రేళ్ళు ధరణిలోన
దిట్టముగఁ దమ్ముఁగదలక కట్టివేయ,
వాత గతులను నూఁగుచు బట్లు తొలఁగి
వృక్షములు వెంటఁ జనలేని విధముఁ జూపె. 233

చివురుటాకుల మెసవక చింతలోనఁ
దవిలి, కోయిలపిండులు దలలు వాల్చి
కొమ్మలను గ్రుంగి కుములుచుఁ గూయ నిచ్చ
పడక కూర్చుండినవి శిలాప్రతిమ లనఁగ. 234

చండమార్తండమూర్తియుఁ జదల వెలుఁగ
సమ్మతింపని వాఁడనఁ, గ్రమ్ముచున్న
భయదకృష్ణాంబుదమ్ముల ప్రావుఁగోరి
మఱఁగుచుండెను వ్యాకుల మానసుఁడయి. 235

వన్నెవన్నెల పురివిచ్చి పరవశమున
నాఁడు నెమళులుఁ పెనువంత నందినటుల
ముడిచి పింఛమ్ములను, రామమూర్తి రథము
పరుగులెత్తఁగఁ జూచి మ్రాన్పడుచు నిలచె. 236

తరణి గ్రుంకుచు నుండెడుఁ తరుణమందు,
రథము తమసానదీతీర రమ్యతలము
దఱియఁ బయనమ్ము నాపి, రాతిరిని నందె
గడపి పైచననెంచి, రాఘవుఁడు సారి 237

ధికినిఁ జెప్పెను; వాఁడునుఁ దేరునాపి
యశ్వముల విప్పి, యనువైనయట్టి చెట్టు
క్రింద శ్రమదీఱ మేఁతల నందియుండ
నిలువఁ, బుర జనములు వచ్చి, నిలచి రటనె. 238

అంత సంధ్యాహ్నికమ్ముల నాచరించి,
దప్పియారఁగ నిర్మలోదకము నింతఁ
ద్రావి, యాకుల పరుపు పై దాశరథియు
ధరణిజాతయుఁబండిరి తావవడక. 239

పక్వఫలములఁ దిని, మంచి పాలుఁద్రావి,
పట్టెమంచాలలోఁ బట్టుపాన్పులందుఁ
బవ్వళించెడు సుఖి, యట్లు పత్నితోడఁ
బర్ణశయ్యనుఁ బవళించుఁ బగిదినిఁ గని 240

బాధపడుచును, గైకను బలువిధములఁ
బలికి దూషించి, నిద్దురపట్టకుండ
వనికి రాఘవు వెన్నంటి వచ్చినట్టి
పౌరు లెల్లరు సంకటపడుచునుండ, 241

ఖడ్గ కార్ముకపాణి లక్ష్మణుఁడు, నిదుర
మాని కడు జాగరూకుఁడై, మంగళకరుఁ
డైన రామునకును వానియనుఁగు సతికి
నెట్టి యాపదయునుఁ గల్గనట్టు గాచె. 242

అర్ధరాత్రము దాటినయంతఁ, బ్రజలు
దమ్మెఱుఁగక తనువుల ధరణి వాల్చి,
గాఢనిద్రనుఁ జెందిరి, కలుగనున్న
మోసమును సుంత యెఱుఁగని ముగ్ధ లగుచు. 243

భానుఁడుదయించుటకుమున్నె, మేను మఱచి
పండి నిద్రించుచున్నట్టి పౌరుల విడి
పోవఁ దరుణం బటంచు సద్భావమునను
రేచి రాముఁడు, సారథిఁ జూచి, "రథము 244

సిద్ధపఱపుమిఁకను జాగుసేయరాదు;
పావ మెఱుఁగరు చూడు మీ పౌరులు, మన
వెంటఁబడినారు! వీరిని విడిచిపెట్టి
పనము చనవలె నిదుర మేల్కొనక మున్నె 245

యనిన, నతఁడును నరదమ్ము నపుడె సిద్ధ
పఱచ, సౌమిత్రితో నిజపత్నితోడ
నమరె రాఘవమూర్తియు; ననిలవేగ
మంది పరుగిడె రథము - వేఁగయ్యెనంత. 246

"నట్టనడిరేయి పఱకునుఁ బట్టనట్టి
పాడు నిద్దుర రాము వేర్పఱుప నిటులఁ
బట్టె వేకువ జామునఁ; బ్రాణసముని
వానిఁ విడియెందుఁబోవంగ వలయు? యమన 247

దనమెగా అయోధ్యయిఁక, నిర్దయుఁడు రామ
చంద్రుఁడిటు మోనమున ముంచి చనఁగ నేది
దిక్క టంచును విధిని వధింపలేని
పురజనులు నిద్రమేల్కని మఱలి ననిరి. 248

ధర్మవీరుఁడు రాముఁడు, ధరణిజాత
సాధ్వి సీతయుఁ, గైంకర్యసంపదలకుఁ
దావు లక్ష్మణుఁడును నతిత్వరితగతుల
రథము పరువిడఁ జాలదూరమ్ము గడచి, 249

తరణి యుదయింపఁ, బూర్వసంధ్యల ముగించి
దక్షిణోత్తరకోసల తలము దాఁటి,
దాఁటి వేదశ్రుతీనది, దాఁటి గోమ
తీనదిని, స్యందికను దాఁటి, తీరభూమి 250

నంటి చనుచుండ, శోకసిక్తాత్ములగుచు
జానపదు లొక్కటను మూఁగి, సాగిలఁపడి,
వందనం బిడ, నోదార్చి పంపి, వంగి
ప్రణతు లర్పించి కోసలరాజ్యము విడి 251

పయనమై నదినని, 'విష్ణుపాద జనిత,
స్వర్గవాసిని, సాంబుమస్తకముపైని
చక్కనెలకొన్న చతుర, భూస్థలమున భ
గీరథుని సాయమున జాఱి పాఱుచున్న 252

పరమ పూతాత్మ సకల పాపముల మాపఁ
జాలు నిర్మలజలపూర్ణసాంద్ర, వాహి
నీమతల్లిని, గంగను నిండు కనులఁ
గాంచి, సాయంతనమ్ము గాఁగఁ బయనమును 253

నాపి, యాతీరతలములయందె రాత్రిఁ
గడపి సుఖముగ, సూర్యుఁడు పొడిచినంతఁ
దరలి ముందేగ నగునని తలఁచి, రథము
నందె నిలిపిరి; లోన నానందపడుచు. 254

ఆ పవిత్రతటమ్మున కతిసమీప
మందె బోయల నేలెడునట్టి ఱేఁడు,
శృంగిబేరపురమునఁ బ్రసిద్ధుఁ డగుచు
వర్థిలుచునుండె గుహుఁడనఁబరఁగి; యతఁడు, 255

సఖుఁడు శ్రీరామమూర్తి యాస్థలముఁజేరి
నట్టి శుభవార్త సెవిఁ బడినంతలోనె
పరమ సంతోషభరితుఁడై, పరిజనయుతుఁ
డగుచు నచ్చోటి కరుదెంచె నతిరయమున. 256

'ధన్యుఁ డైతిని రామ, నీ దర్శనమున;
సేమమా నీకు? సుంత యోచింపవలదు;
నేను నీవను భేదమ్ము మాని, నన్నుఁ
జిత్తమున కెక్కునట్లు శాసింపఁదగును. 257

వర్ణశాలల నిర్మింతుఁ, బరిజనములఁ
బంచనేయుండి నిన్ను సేవించుచుండ
నాన యిడుదును; మంచి తీయని ఫలములఁ
బాల నెంతైన నిత్తు; మమ్మేలుకొను"మ 258

టంచు, వినయమ్ము నెయ్యమ్ము నతిశయింప
నా విషాదుఁడు సమ్ముదితాత్ముఁడగుచు
నిండు మనమున బ్రతిమాలుచుండ, రాఘ
వుండు సంప్రీత చిత్తుఁడై, పుండువడని 259

పగిది యాతని మనసు మితోక్తుల నిటు
పలికె మంజులదరహాస వదనుఁడగుచు;
"పలుకు వలుకున బహువిధ ఫలవితతులు
పండి రసములు చిప్పిల పడుచునుండఁ 260

గడువునిండిన దప్పుడే, కనులవిందుఁ
గూర్చె నీ రూపు నిటఁ గనుఁగొనిన యపుడె,
ప్రాణమిత్రమ, నీ మనోరాజ్య మధ్య
మందు నెలకొన నాకెందు నిందు కొదువ 261

కలుగనే బోదు నమ్ముము; వలసినంత
గడ్డినిడి గుఱ్ఱములఁదన్పఁ గలుగుదేని
చాలు నిప్పటికిని; త్రాగి జలమునింత
పండి నిదురించి, మేల్కొని భానుతోడఁ 262

బయనమైపోదు" ననఁగ, మార్వలుక లేక
మంచిదని చెప్పి యాకాటి మానిసియును,
బర్ణశయ్యల ననువుగఁ బఱచియుంచి
యవలి యాజ్ఞలకునుఁ గాచి యటనె యుండె. 263

రామచంద్రుని రమ్యాతిరమ్యములగు
గొప్పగుణముల సౌమిత్రి కొండఁజేసి
పొగడుచునె చేతఖడ్గమ్ము పూని రాత్రిఁ
గాయఁ, బత్నియుఁదాను రాఘవుఁడు, పర్ణ 264

శయ్యలోఁ బండి నిద్రించి శ్రమలు వాయ
మేలుకొనినంత, భానుఁడు మింటఁ బొడిచి,
పసిఁడి వెల్గుల నలనల్లఁ బ్రాఁకవిడిచెఁ
బుడమిపైఁ, బ్రకృతియెల్లనుఁ బులకరింప. 265

అమలభాగీరథీ తోయమందు స్నాన
మాడి, ముగియించి పూర్వసంధ్యాహ్నికముల;
కురులఁ దీరిచి జటలుగ గుహు నియతిని
గంగ దాటింపఁ బడవలు గాచియుండ, 266

రామచంద్రుఁడు సచివసారథి సుమంత్రు
నండకును బిల్చి, మృదుహృదయమ్ము విచ్చి,
"అడ్డులేనట్టులను రథ మరుగుదనుక
దాని నడిపించి జాహ్నవీతటమునందు 267

మమ్ము విడిపించితివి; యింక మఱలిపొమ్ము
మంచిదగు నీకు; నీమేలు మఱవ నెపుడు;
జనకుఁడును మాతలునుఁ బురజనులు నీదు
రాకలను వేఁచియుందురు; శోకతప్త 268

హృదయులై మాదు సేమమ్ము నెఱుఁగఁ దలఁచి;
తామసము సేయఁదగదు; సత్వర మయోధ్య
కరుగవలె నీవు; దినములె యనఁగఁ బదియు
నాలుగేడులఁ గడపి కానలను, సుఖము 269

గాఁగ మఱలంగఁ గలమని కన్నతండ్రి
కర్ణములఁబడఁ జెప్పుము; కడనె యుండి
కలఁత లొందవని కరణినిఁ గాచి పతిని
సతము గొల్వఁగఁ దల్లి కౌసల్యకుఁ దగు 27

మనవిసేయుము; నాదు సేమమ్ము నెంచి,
తానె తనయుని నావెంటఁ గానలకును
దరలఁ బంపిన యుత్తమోత్తమ జననిని
మఱవనేర నటంచును మననుకెక్కఁ 27

జక్కఁబలుమార్లు దెలుపుము; మ్రొక్కులఁ గొని
కైక కొసఁగుము; నను మోసగాఁడ నంచుఁ
దలఁపరాదని పురజనములను నచ్చఁ
బలికి శాంతింపఁ జేయుము; బయలుదేఱు" 27

మనిన, నాతఁడు మిగుల నాయాసపడుచు
వాగులై పాఱు శోకబాష్పములఁ గడిగి
దశరథాత్మజు పాదపద్మముల, వంగి
దండ మిడి మఱలెను నరదమ్ము నెక్కి 27

సతియుఁ దమ్ముఁడుఁ దోనుండ జనకవాక్య
పాలకుఁడు రామచంద్రుఁడు ప్రాణసఖుని
గుహునిఁ గూరిమిఁ గౌఁగిటఁగ్రుచ్చి విడిచి,
సాయపడినందులకుఁ గృతజ్ఞతను దెలిపి; 27

తోడు పడఁగను సీతకు నోడనెక్కఁ
దమ్మునకుఁజెప్పి యెక్కించి; తాను నెక్కి
వానితోడను, చెరచెరఁ బడవ నడువ
గంగపై సాగి యావలిగట్టుఁ జేరె. 27

"ప్రాణపతి రామమూర్తి యరణ్యవాస
మంది మఱలిన యంతనే మంగళముగ
మఱల దర్శించి పూజింతు మాన్య నిన్న"
టంచు, సీతమ్మ గంగకు నంజలించి, 276

వెంటఁబడ, వారు పయనమై వెడలి వెడలి
వత్సదేశమ్ముఁ జొచ్చి, క్షుద్బాధ హెచ్చఁ
జంపి నాలుఁగు మృగములఁ జక్క వండి
యాఁకలిని మాపుఁకొనఁ దిని, యస్తమయము 277

గాఁగ, నచ్చోటనే రాత్రిఁ గడుప నెంచి,
నందె వారిచి, యొక్కవృక్షమ్ము క్రిందఁ
బఱచి యాకుల పడకలఁ బండి, ప్రొద్దు
పొడువ మేల్కాంచి ముందేగి పోయిరి వడి. 278

దుఃఖపడకుండఁ బలువట్లఁ ద్రొక్కి సనుచుఁ,
బ్రకృతి సౌందర్యములఁ బరవశతఁ గనుచు,
జాహ్నవీదేవి యమునతో సంగమించు
నట్టి పావనతలముఁ బ్రయాగను గని, 279

యట, భరద్వాజమౌనీంద్రు నాశ్రమమున
నిలిచి, యాతిథ్యమును నంది నిశిని బుచ్చి;
యమ్మహాముని వాసయోగ్య మ్మనుచునుఁ
దమకుఁ దెలిపినఁ జిత్రకూటమును జేర 280

భానుఁ డుదయించి నంతనే బయలుదేఱి
ననిరి, మౌనీంద్రునకు మ్రొక్కి సాగిపోవ
సెలవు గైకొని, నడుమను సీతయుండఁ
ముందు సౌమిత్రి వెనుక రాముఁడును నడువ. 281

దారిఁగొని యమునానదీతటము నంటి
నడచి, యనువైన పట్టునఁ బడవఁ గట్టి
గడచి యమునను, బయనించి కాననమున,
మహిమ వెలిఁజిమ్ము నొకగొప్ప మఱ్ఱిచెట్టు 282

కానఁబడ మ్రొక్కి దానికిఁ, గదలి యేగి
మఱియు నొక కొంతదూరము, పరువు సిలుకుఁ
బట్టునుం జొచ్చి, బడలిక వాయ వీచు
చల్లగాలులఁ బీల్చుచుఁ, జక్కవిరిసి 283

నట్టి విరులును మాఁగినయట్టి పండ్లు
నిండియుండెడు తరువుల నేత్రపర్వ
ముగను జూచుచు, శుకపికముల మనోహ
రరుతముల వినుచును, గడురయమునంది 284

నని, మునీశ్వర సూచితస్థానమైన
చిత్రకూటాద్రి దరియఁగఁ, జిత్త మలరఁ
గాంచి, పులకరింతలఁ జిక్కి కాయము సుఖ
మయముగా నొప్ప, నాపిరి పయనము నట. 285

రాణి, ప్రకృతి పురంధ్రికి రాజధాని;
రాగ రహితాత్ములౌ మౌనిరాజులకును
శాంతినిడు స్వర్గరంగము; సౌఖ్యసదన
మనఁగ రంజిల్లుఁ జిత్రకూటాద్రి, సకల 286

గంధసుమ ఫలయుక్త వృక్షములతోడ,
మధుర కంఠస్వరమ్ముల మధుకణములఁ
జిలుకుఁ పులుగుల గమితోడఁ, జెలఁగియాడు
బర్హిణులతోడఁ, బసిలేళ్ళ పరుగుతోడఁ, 287

బశుగణమ్ములతోడను, బహువిధముల
వన్యమృగ సంచయములతోఁ, బచ్చికల బ
యళ్ళతోడను, బలు సెలయేళ్ళతోడఁ,
బద్మకాసారములతోడఁ బ్రణయకేళి 288

కెల్ల ననువైన పూఁబొదరిండ్ల తోడఁ,
బుష్పితారామములతోడఁ బొలుచుచుండ,
నద్ది, భూలోకస్వర్గమ్మె యంచు నెంచి,
పర్ణశాలల నిర్మించి, వాసమందఁ 289

దగిన పగిదిని, దగు బలిదాన మొసఁగి
వాస్తుదేవతలనుఁ గొల్చి, వందన మిడి
యచటి తాపసులకునుఁ బ్రీతాత్ము లగుచుఁ
దావుఁ గొనిరందు సీతతో దాశరథులు. 290

గంగ గట్టున రామునిఁ గానలఁబడ
వదలి, యరదమ్ము నొక భంగిఁ బాడువడిన
పట్టణపు వీథులను బోవ నెట్టుచున్న
సారథి సుమంత్రుఁగని, దుఃఖసాగరమున 291

మునిఁగియున్నట్టి పౌరులు "మోసగించి
మమ్ముఁ బోవంగఁ దగునె? సుమంత్ర రామ
భద్రు నేకానలోననో వదలిపెట్టి
మఱల, మనసయ్యె నీకెట్లు? మఱలిపొమ్ము 292

పోయి, రామునిఁ గొనిరమ్ము పుణ్యముండు"
నంచు, నున్మాదు లనఁగ శోకించుచుండ,
నతఁడు వంతల మ్రింగుచు నా జనులకు
బదులు వలుకంగలేని తాపమునఁ గ్రుంగి 293

యవనిపతియును నంతఃపురాంగనలును
రామరామా యటంచు దుర్భర విషాద
భారమునఁ గూలి విలపించు సారహీన
భవనమును జొచ్చెఁ గాయము వడఁకుచుండ. 294

దశరథుఁడు సారథినిఁగని తన్నుఁ జూడ
వచ్చెనటు రాముఁడే యన్నవగిది లేచి,
"సేమమా రామమూర్తికి? సీత చెంత
నున్నదా? కోపపడదుగా? యన్నను విడ 295

కుండ నున్నాఁడె గుణి లక్ష్మణుండు? వారి
వదలి వచ్చితి వెచ్చోటఁ? బన్తువడని
వగిది నున్నారె? చక్కఁగఁ బండనుండ
వసతిగల వట్లనే వారివదలి వచ్చి 296

యుందు వనుకొందు? నా ప్రియనందనుండు,
తన్ను దయమాలి యడవికిఁ దరలఁబంపె
తండ్రియని లోనఁగుందునా? తప్పరాని
సత్యమును నిల్పనే తను సాగనంపె 297

ననెడు ధర్మమ్ము నెంచునా? జనకునకును
జెప్పుమని యేమిచెప్పెను జెప్పు" మనుచు
దీనుఁడైవేఁడ, రాముఁడు దెలిపినట్టి
విధము వివరించి యతఁడు విన్పించె; వట్టు 298

దప్పి కౌసల్యయును సుమిత్రయును, "నడవి
పాలఁబడితివ, మమ్మెల్లఁ బాసినావ,
రావ యిఁక మమ్ముఁ జూడఁగ రామ," యనుచు
నఱచియేడ్వఁ దొడంగ, దయ్యమ్ము వగిది 299

వాయిఁ దెఱువని యొక్కకైకేయి దప్పఁ,
గలిసి యేడ్చిరి మూఁడువందలును నైదు
పదుల దశరథపత్నులు, భవన మద్ది
మాఱుమ్రోఁగఁ గఁ గంపింప మహియు దివియు. 300

ఆ విషాద మహాధ్వని యపుడె కర్ణ
రంధ్రములఁ జీల్చి, కంఠమార్గమున లోని
కరిగి, యుడుకుచునున్న రక్తమునఁ గలిసి
ప్రబలి, నాళమ్ములను ద్రుంచి, పగులఁగొట్ట 301

గుండియను, గ్రుంగి కుములుచుఁ, గుతలము పయిఁ
గూలె నసువులు విడిపోవఁ, గువలయపతి
రామజనకుఁడు 'హా రామ రామ' యనుచు,
ననదయై కోసలపురంధ్రి యటమటింప. 302

పతిని నటువాసి వాపోవుఁ పత్నుల నెటొ
పలికి యోదార్చి, యోగప్రభావమూర్తి
ముని వసిష్ఠుడు, విధి నెదుర్కొనఁగరాని
పగిది నెఱిఁగిన వాఁడౌట వగల విడిచి, 303

ప్రభువు దశరథు మృతకళేబరము నంతఁ,
తైలమ్మున ముంచియుంచి, సత్వరమె సచివు
లందఱనుఁ బిల్చి, యవలఁ జేయంగ వలయు
పనుల నిశ్చయ మొనరించి, భరతు నటకు 304

వివరముల నేమి దెల్పక వెడలిరాఁగఁ
బిలిచి, తోడ్కొని మఱలఁగ వితరిణి యగు
వాని, సారథి నొక్కని బత్తెమిచ్చి
పంపెఁ గేకయు నింటికి బాటఁ దెలిపి. 305

కార్యభారమ్మునెల్లఁ జక్కఁగ నెఱింగి
నట్టి యా సారథియు వేగ నశ్వములను
రథమునకుఁ బూన్చి, ప్రాస్వమార్గమ్ముఁ బట్టి
పయనమైపోయి భరతుని బయనపఱచె. 306

అంతకును మున్నె కనఁగూడనట్టి కలలఁ
గాంచి మేల్కొన్న భరతుఁడు, కారణమ్ము
విశదపడనట్టి పిల్పులో వివరములను
నరయనేరక శత్రుఘ్నుఁడనునరింపఁ, 307

దాతకును మామకును మ్రొక్కి, తరలిపోవఁ
దగిన సెలవంది, వడిగ రథమ్ము నెక్కి
బాటఁగడచెడు భంగి యేర్పడని యటులఁ
బరుగు లిడఁ దొడఁగినవి యశ్వములు సెలఁగి. 308

దరియవచ్చె నయోధ్య, దాశరథిగాని
దశరథుఁడుగాని లేని వ్యథా వికార
తలము శూన్యప్రదేశము, కలఁతలొకటఁ
గలిసియాడెడు ఘోర రంగస్థలమ్ము. 309

రాజవీథుల నడయాడు ప్రజలు లేరు;
భవనములనెట్టి సందడిపాటు లేదు;
వరమదేవాలయముల దీపములు లేవు;
పట్టణమ్మున నెందు జీవమ్మె లేదు. 310

కంప మందెను భరతుని కాయ మెల్ల;
కనులు దిరిగెను; గుండియ కరఁగి పాఱె;
వార్త యెయ్యది చెవులనుఁ బడఁగనున్న
దో యటంచును లోన నాందోళపడుచు, 311

నరదమును దిగి యాతఁడు, చెరచెరఁ జని,
జనకు సదనమ్ముఁ జొచ్చెను; గనక యందు
నెందుఁ దండ్రినిఁ గైకమ్మ యింటనుండ
నగు నటంచని యచ్చోటి కరిగి చూచి, 312

మాతకును మ్రొక్క, నామె కుమారుని బిగి
కౌఁగిటను నొత్తి ముద్దాడి, "కన్నతండ్రి,
నాదు బంగారుకొండ, పుణ్యంపుఫలమ,
సౌఖ్యముగ నుంటివా? తాత సౌఖ్యమేన? 313

మామ బాగున్నవాఁడ? సేమమ్మె యచటి
వారి కెల్లను? దెలియఁగఁ బల్కు" మంచుఁ,
గుశలవార్తల నడిగి, కైకొనక వాని
బదులునైనను లోని గర్వమ్ము పొంగ 314

"కైకకడుపునఁ బుట్టిన ఘనుఁడు వరుల
కాళ్ళఁబడియుండి కొల్వ నేకారణమును
గానఁబడకున్న వశ్యునిగా నొనర్చి
పతినిఁ బ్రార్థించి, రాముని వనుల కనిపి, 315

యాత్రపడుచుంటి నిన్నుఁ బట్టాభిషిక్తుఁ
జేసి కోసలరాజ్య విశిష్టభాగ్య
రమను నీచేతఁ బెట్ట; నిర్భయముగాఁగ
సింహపీఠమ్ము నెక్కుము చిట్టితండ్రి" 316

యనిన నేదియుఁ బాల్పోని యటులఁ, జెవినిఁ
బడిన మాటల యర్థ మేర్పడని కతన
భ్రమసి, ధృతిఁ దప్పి, ముందుఁ గన్పడెడు వ్యక్తి
మాతయే యయ్యు మారిగా మాఱి నిలుచు 317

కరణిఁ గన్పింపఁ గనలి యాగ్రహమహాగ్ని
మండుచుండఁగ, మనసులో మనసు నిల్వ
కుండ రొదవెట్ట, గుండియ గొట్టుకొనుచు
నుండఁ, బల్కులు దడవడుచుండ నతఁడు, 318

"అశనిపాతమ్ములో! రూపు లందికొనిన
స్వార్థభావాంకుశమ్ములో! పలుకు లివ్వి
కర్ణపుటముల భేదించి కష్టపెట్టు
నన్ను నంశయముల ముంచి ఖిన్నుఁజేసి. 319

ఏమియంటివి నీవు? నేనేమివింటి?
అన్నరాముని నడవికి ననిపి నావ?
నాకు రాజ్యమ్ము నిప్పింప నాథునడిగి
సిద్ధముగ నుంటివా? చెప్పవమ్మ! నాకు. 320

ఎట్టి పుణ్యమ్ము నంద నీవిట్టి పనికిఁ
బాలువడితివె నా తల్లి! భరతుఁడు నిను
గాళ్ళఁబడి వేఁడెనా రాముఁగాన కనిపి
తన్ను యువరాజుఁ జేయఁగఁ? దప్పఁదలఁచి 321

సేయరానట్టి సేఁతల సిగ్గుమాలి
సేసి చిచ్చిడితివి నాదు చిత్తమందు;
చేతి కరవాలమున నీదు శిరము నిపుడె
ధరణిఁబడవేయఁ గల్గుదు నణికి, రామ 322

భద్రుఁడేమనునో యను భయము నన్నుఁ
దన్ని యాపకయుండినఁ; గన్నతల్లి
వగుదువా నీవు! కావు; భయంకరాను
రాంగనవు, నిక్కమిది; వియ్యమంది యెటులొ 323

ఘనత కెక్కినయట్టి యిక్ష్వాకువంశ
క్రమఫల వృక్షమునుఁ జేరి, గరళము వెలి
గ్రక్కితివి కాళసర్పమ్ము కరణి, నిన్నుఁ
బత్నిగాఁగొని నాతండ్రి పాడువడెను. 324

పౌరజనరంజకుఁడు, నీతిపరుఁడు, ధర్మ
వర్తి, యార్తులఁదనుపు కల్పకము వినయ
గుణవిశిష్టుఁడు, విజ్ఞాని, యనుపమాన
ధన్వి, యీరేడులోకాలఁ దనిపి యేలఁ 325

జాలు దక్షుఁడు, పితృవాక్యపాలకుండు,
రామచంద్రుఁడు - కోసలరాజ్యరమను
నంద నెల్లవిధమ్ముల నతఁడె తగిన
వరుఁడటంచును నేఁ జెప్ప వలయునేమి 326

నీకు? నెఱుఁగనిదానవా? నీచమతికి
నీతికిని నెంతదూరము, నిన్ను దూఱి
నన్ను నే దూఱుకొనుచుంటి; నన్నుఁ గన్న
తల్లివే కదనీవు, పాతకుఁడ నేనె. 327

జ్యేష్ఠ నెప్పుడుఁ బట్టాభిషిక్తుఁజేయు
వాడుకనుఁ బాడుసేసి, నీ పట్టికి నెటు
పట్టమును గట్టనెంచితే పాపిని, కుల
గౌరవమ్మును నట్టేటఁగలపి యిటుల. 328

ధర్మవును నెందుఁదప్పని దశరథుఁడును,
ధర్మవర్తిని, జ్యేష్ఠ నధర్మమునకుఁ
బాలుపడియెట్లు వనులకుఁ బంపెనన్న
నందియము నన్ను బాధించుఁ గుందువఱచి. 329

అందఱకు నిష్టుఁడౌ ముద్దులయ్య రామ
భద్రుఁడెటు నీకుఁ గంటక ప్రాయుఁడయ్యె
నో యెఱుంగఁగ లేకుంటి? వాయి విచ్చి
వనికిఁ బొమ్మని సెప్పఁగ వాని, నీదు 330

మానసం బెట్టులొప్పెను? ప్రాణములను
బాపి నను జంపియుండిన, వసుధను విడి
యేగియుండనె దివికి నే నింపితముగ
నరకకూపమ్ములో నిటు దొరలివడక? 331

కంటికిని ఱెప్పవలెఁ గాచి, కడనెయుండి
కాంక్షల నెఱింగి, యడుగక కన్నతండ్రి
భక్ష్య భోజ్యములను బక్వ ఫలరసముల
విందులిడి, పట్టుపాన్పుల యందుఁబండ 332

నిచ్చి, పోషింపఁ బెరిఁగిన నిర్మలాత్ముఁ
డడవిలో వల్కలమ్ముల నంగములను
గప్పి, కాయల దుంపలఁ గడుపు నింపి,
పర్ణశయ్యల నెటుఁవండి బ్రతుకుఁ ద్రోయ 333

గలఁడు పాపము. సుకుమారగాత్రు, రామ
భద్రు, నే యెగ్గుఁదలఁపని పావరహితు,
నేమి సేసితివమ్మ, యింకెందుఁ బోదు
నేను? దిక్కేదియింక నాకు? నీదునెదుట 334

నిలువనైనను దోషము; నే నరిగెదఁ
గానలకు నారబట్టలఁ గట్టి యన్న
తోడ సుఖముండ; వలదు నీ నీడపట్టు
వలదు, జన్మాలకైనను వలదు వలదు. 335

మఱచితిని; తండ్రి యెందుండె? మనఁగలేక
రాము విడి మరణించెనా? భూమినున్న
వాఁడ? లక్ష్మణుం డేడి? పావన పతివ్ర
తా శిరోమణి ననెన సీతమ్మ వనికి 336

పతిని వెన్నంటి? పురములో ప్రజలు కలర?
విప్రసత్తము లున్నారె వెడలిపోక?
వెంటనే తెల్పు"మనినఁ గంపించి యామె
తాఱు మాఱులుగాఁ దన తలఁపులన్ని, 337

"కోపపడకయ్య, నీ మేలు కోరియె కద
చేసినది యెల్లఁజేసితి? చెప్పెద విను :
అడవి కేగెను లక్ష్మణుఁడన్నతోడ;
జానకియు నేగె; నింక నీ జనకుఁడు దివి 338

కరిగె రాముని నడవికి ననిపి పుత్ర
విరహమును సైప నింతయు వీలుగాక,
విధి విధించిన విధమిది, వేదనపడి
నీవు సాధించునదిలేదు నిజము వినుమ," 339

అనిన, 'నా యయ్య పోతివా' యంచు నఱచి
యవనిపైఁబడి, మూర్ఛిల్లి యటమటించి,
మఱలఁ గోల్కొని, యా మహామారి యిల్లు
వదలిపోవుచు నుండఁగ, వాకిలికడ 340

నందముగఁ దీరి సుందరి యనఁగఁ గాచి
యున్నగూనిని శంకించి యన్నిఁటికినిఁ
గారణం బని, కసిదీఱఁ గాలఁదన్ని
విడువఁ దమ్ముఁడు, కౌసల్య కడకు నేగె, 341

తాను నిర్దోషి యనెడు సత్యమ్ముఁ దెలియఁ
జెప్పి, యామెను నోదార్చి, సెలవునంది
సని, వసిష్ఠునిఁగని, వాని సాయముసను
నయ్య దహనాది యంత్యక్రియలను శాస్త్ర 342

సమ్మతమ్ముగ ముగియించి, సర్వాలు నటఁ
బట్ట మందఁగఁ దన్ను నిర్బంధపఱచు
చుండియునుఁ బాటిసేయక, నుండఁబట్ట
కచటఁ, బట్టమ్ముఁ గట్ట రాఘవునిఁదేర 343

సిద్ధపడి భరతుఁడు, పిల్చి శిల్పవరులఁ
బంపెఁ, గానల కేగఁగ వలసినట్టి
బాట నొకరీతి నవరించి పయనమునకు
ననువుగను దీర్ప నాక్షణముననె కడఁగి. 344

రాముఁడడవికి, దశరథుఁ డమరపురికి
నరుగ శోభావిహీనమై యగడువడు న
యోధ్య, 'యుత్తమ త్యాగ ప్రయోక్త', భరతు
సాయబలమున నూతనోత్సాహమందె. 345

చెట్టులను బుట్టలను దెగఁగొట్టి, చక్కఁ
బల్లములఁ బూడ్చి, మిట్టలనెల్లఁ జదను
పఱచి, చిఱువాఁగులకుఁబైని వంతెనలను
గట్టి దిటవుగ, రాత్రులఁ గడువవేలయు 346

వసతిఁ గల్పింపఁ దగినట్టి భవనములను
నిలిపి యుందందు, నిర్మలజలము లుండ
మంచి నడబావులనుఁ ద్రవ్వియుంచి, వంట
వస్తువుల నమ్మ నంగళ్ళ వరుసఁ దీర్చి, 347

రజముపైరేఁగనటుల నీరములఁ జల్లి,
కడకుమంటినిఁ దడిసేసి, గంగగట్టు
వఱకు శిల్పులు బాటనుఁ బయన యోగ్య
ముగ నొనర్పఁగ; వనికి నరుగ భరతుఁడు 348

సిద్ధమై, కులగురువుల శిష్టవిప్ర
వరులఁ దల్లులఁ దోడ్కొని పరువుసిలుకు
కనక వృక్షధ్వజముపైని కదలియాడు
చున్న రాజరథమ్మును మున్నునడిపి, 349

యవల, రథగజతురగ భటాది బలము
లనుసరింపఁగఁ; బుర జను లతిశయించి,
కరుల గుఱ్ఱాలఁ గంచర గాడిదలను
శకటముల నెక్కి సనుచుండ నంతనమున; 350

వందిమాగధులును, జంత్రవాద్యగోష్ఠి,
కవులు గాయకులును, నాటకత్తెలును; న
గరము నందలి కార్మిక గణములును జె
లంగి మూఁగఁగ; నమరి సలక్షణుఁడుగ 351

వేఱునొక్క రథమ్మున వేగమంది
పయనమై పోవుచుండ; నప్సరస లలరి,
చదల నర్తించి గంధపుష్పముల భువినిఁ
బడఁగ వర్షించి రెలమి శుభమ్మునెంచి. 352

అట్టుల నయోధ్యయే వైభవాత్మ యగుచు
రామసోదరు భరతుని రథముతోడఁ
గదలి సనిసని విడువ గంగానదీ త
టమున, భాస్కరుఁడపరశైలమున మఱఁగె. 353

రథములును గజములును దురంగములును
భట సమూహములును నటు బలిసి గంగ
గట్టుసేరినఁ, దాఁక రాఘవుని, భరతు
సైన్యములు వచ్చె నట కంచు శంక వొడమి 354

గుహుఁడు, బోయల నందఱిఁ గూడఁగలిపి
దండులై తోడమూఁగిరా, దరిసి యతని
దండ మిడి, తేనియలఁ బండ్లఁ దనిపి, కుశల
మడిగి, దాఁచక మనసును నుడివె నిటులు 355

"దశరథాత్మజుఁడవు; యుక్త ధర్మ మెఱిఁగి
నట్టివాఁడవు; రాముని యనుఁగుఁ దమ్ముఁ
డవు; ఘనుండవు; నీవు మా తావునందుఁ
గాలిడిన కారణం బేమొ! కనులవిందు 356

సేయు చతురంగబలములు! చెంగట నిటఁ
గలరె శత్రువు లెవరైనఁ? గాక మేమె
కాకపోయితిమా? కనలేక యడుగు
చుంటి వచియింపుమా? "యన, సూక్ష్మబుద్ధి 357

గల భరతుఁడంత, వానిశంకల నెఱింగి
వగలఁ బొగులుచు, వచ్చిన పనిని విశద
పడఁగ వానికిఁ దెలుపుచు, "నడుగఁ దగిన
ప్రశ్న నుమ్మిది యగ్రజు వనులఁ ద్రోలి 358

యక్రమమ్మున రాజ్యమ్ము నపహరించి
నట్టి ధూర్తుఁడ; నెప్పటికైనఁ బైనిఁ
బడును వగవాఁడు; వానిఁజంపంగ వలయు
నెందునుండిన నంచు లోనెంచి, రామ 359

చంద్రుఁదాఁకఁగ దండుతో శత్రుఁవగుచుఁ
దరలివచ్చితి నిటకని తలఁచి, యిట్లు
నన్ను నడుగుట యుక్తము; నిన్నుఁదప్పు
దలఁచి యలుగను వినుము; నా తల్లికైక 360

మనను నొకదాసి సెఱుఁవఁగ మతిసెడి యిటు
తెచ్చి పెట్టిన ముప్పిది తెలియు మయ్య,
నన్ను శంకించి వలుకకు పున్నెముండు;
రామభద్రుఁడు నా బహిఃప్రాణ మగుట 361

గాఁడు వగవాఁడు; వానిని వేడి కాళ్ళ
పైనిబడి తప్పు మన్నింపఁ, బట్టభద్రు
జేసి, కొనిపోవ వచ్చితి సీతతోడ
లక్ష్మణునితోడ; కాను నే లాతివాఁడ, 362

నమ్ము" మన, నుత్తముని మాననమ్ము నట్లు
గించవఱచిన తన్ను నిందించి కొనుచు,
నా నిషాదవతి యతని నభినుతించి;
రాముఁడటకును నరుదెంచి, రాత్రి గడపి 363

వయనమై గంగదాఁటి యావలికిఁ జనిన
కర్ణపుటములఁ జిచ్చిడఁగల విషాద
కథను వివరించి చెప్ప; మైకమునఁ బడెను;
భరతుఁ, 'డౌనా' యటంచును ధరణి నురలి. 364

తాపముల నెల్లఁ గడుపులో దాచికొన్న
తల్లి కౌసల్య యేడ్వఁగఁ దన్నుమఱచి,
వంచనున్నట్టి రాజకాంతలును నేడ్వ
దొడఁగి రడవియె మాఱ్మ్రోఁగ, దుఃఖితులయి. 365

కన్ను మూయని రాతిరి గడువఁ దరణి
వొడిచెఁ దూర్పున; వందలు వందలుగను
బలువిధమ్ముల యోడలఁ బయనమునకు
సిద్ధపఱువఁగ గుహుఁడు, మాసిన ముఖమ్ము 366

నమల భాగీరథీతోయమందుఁ గడిగి
స్నాన మొనరించి, యుదయభాస్కరుని గొలిచి,
పావననదీమతల్లికి వందన మిడి,
బందుగులతోడ, చతురంగబలముతోడ, 367

పౌర జనసమూహముతోడ, భరతుడోడ,
నెక్కి యాగట్టుఁజేరి, పైకేగి యేగి,
మునిభరద్వాజు నాశ్రమమునకు నుంత
దవ్వునను దోడవచ్చిన దండులఁదగ 368

విడచి, చని వసిష్ఠునితోడ, వినయభావ
ముట్టిపడుచుండ నాశ్రమమునకు నేగి
నతుల నర్పించె నభివాదనలను దెల్పి
తాపసేంద్రునకును భరద్వాజునకును. 369

అప్పు డప్పుడె పునిత నిత్యాగ్ని హోత్ర
కర్మలను సాంత మొనరించి, కదలనున్న
కాంతిమంతుఁడు, మునిరాజు కాంచి, ముని వ
సిష్ఠతోనున్న భరతునిఁ జిత్త మలర, 370

తా వొనఁగి నిల్పి, యర్ఘ్యపాద్యముల నొసఁగి,
శాంత గంభీరుఁ డగుచుఁ గుశలము నడిగి,
యనతి దూరమ్ములోఁజూపు కందువడిన
జనమహాజలనిధిని నాశ్చర్యపడుచుఁ 371

గాంచుచుండఁగ, భరతుఁడు గాంచి, "మౌని
వర్య, నాతోడ వచ్చిన వారువారు;
కర్మవశమున నాయన్న కానలఁబడి
పోవఁ, బ్రార్థించి యాతనిఁ బుడమినేల 372

మఱలఁ గొనిపోవచ్చితిఁ బురజనముల
తోడ; మీశాంతి సెడునని తోఁచి వారి
నందె వదలితి, మిమ్ము మాయన్న నూరి
వందనంబిడి సెలవంది యరిగి యుండు 373

తలముగొని యెందునుండె నాతండు? మాకుఁ
దెలిపి సెలవిచ్చి వంపుఁడు, దీనుఁడనగు
నాకు దిక్కును జూపించి నడుపఁదగిన
వారు మీ రొక్కరే యిట్టి వట్టులందుఁ; 374

జేయివిడకుఁడటంచును జెప్పి, తగ్గి
వేడ; ఋషిసత్తముఁడు వాని వేదన గని,
"చిన్న బోకుము, నినురాముఁ జేర్చు నీదు
చిత్తశుద్ధియె, నుంత యోచింప వలదు. 375

భానుఁడును గ్రుంకె; చీఁకటి వడుచునుండఁ
బయనమైపోవఁదగదు; నా పలుకు వినుము,
వగల విడనాడి, నీవు నీవారితోడ
నిందె విందును గొనియుండి డెంద మలర 376

నేఁటిరాతిరి గడపి, పైబాటఁ బట్టి
వెడలు మని చెప్పి వాని నొప్పించి; సకల
దైవముల, దిక్పతుల, నిష్టదేవతలను,
గ్రహగణమ్ముల, నక్షత్రరాజములను, 377

బంచభూతమ్ములను, నేత్రపద్మములను
ముడిచి, మఱచుచుఁ బరిసరములను, యోగ
పరవశుండయి, మంత్రజపమ్ముఁ జేసి
పిలిచి, శాసించె నతిథులఁ గొలిచి తనువ. 378

భాగ్యభోగమ్ములకు నాటపట్టుగాఁగ
స్వర్గసామ్రాజ్య మయ్యె నావనము; మౌని
యాజ్ఞలనుఁగొని దివ్యు లత్యద్భుతముగ
నిర్వహింపఁగ బనులను నియమితులయి. 379

అమలమణిమయ స్వర్ణసింహాసనమ్ము,
సచివ సత్తములకును నాసనములు, బుర
జనులు గూర్చుండఁ దగినట్టి చదునుబట్టు,
గవులు పండితవర్యులు గాయకులును, 380

నమర ప్రత్యేకపీఠము, నాటకత్తె
లాడ రంగస్థలమ్మును, నమరియున్న
యద్భుతం బగు రాజసభాంగణమ్ము
మధ్య రూపంద; స్నానంపు మందిరములు. 381

వస్త్రశాలలు, భోజనశాల, శస్త్ర
శాలలును రాణివాసాలు, సౌఖ్యములకు
నాలయములైన రమ్యశయ్యాగృహములు,
బందుగులు మిత్రు లుండఁగ నందునందుఁ 382

బొందువడియున్న సుందర మందిరములు
గలిగి, యమరేంద్ర సదనమ్ము కరణి వెలుఁగు
రాజసౌధము రమ్యాతిరమ్య మగుచు
నవనిపైనుండి యాకస మంట లేచె! 383

బ్రాహ్మణులకును, భటులకుఁ బౌరులకును
వసతి గల్పింపఁ దగిన భవనము లెన్నొ
కానలో నెల్ల కడలను గానుపించి
నయవి, నవనవలాడుచు నవ్యములయి. 384

పంచభక్ష్య భోజ్యమ్ములుఁ, బాయసముల
వాహినులు, మంచి పెరుఁగు గాల్వలును దేనె
పాఱుచున్నట్టి సరసులు, మేరఁ జూవ
నట్టి మధువుల మడుఁగులు, నవతరించె 385

నంత; గ్రొంబట్టు వరువులుఁ, బట్టెమంచ
ములును, జీనాంశుకమ్ములు, ముత్తియముల
హారములు, స్వర్ణభూషలు, నఖిలగంధ
లేపనమ్ములుఁ, బరిమళ ధూవములును, 386

బచ్చికబయళ్ళు, సెలయూటవట్లుఁ, బూల
తోఁటలును, బొదరిండ్లును, దూగుటూయ
లలును, జల్లని వెన్నెల వెలుఁగు జిలుఁగుఁ,
బాడియావులు, లేళులు, బర్హిణులును, 387

గోరువంకలు, చిలుకలు, గోయిలలును,
నవలఁ బొడసూపె; ఘుమఘుమలాడు గాత్ర
గంధములు చల్లుచును నెల్లకడల, విసరి
కొనచూపుఁ దూపుల గొనరి గొనరి, 388

మధుర దరహాసరుచి బ్రాఁక నధరములను,
నమర గణికాగణమ్ము లొయ్యారముగను
నల్లనల్లనఁ బచరించి యుల్లములను
బల్లవింపఁగఁ జేయఁగ, భరతనాట్య 389

గతులఁనాడిరి యప్సరోంగనలు; పాడి
రలరి గంధర్వగణము, లా యడవిలోని
మ్రోడు మ్రాఁకులు చివురించి మొగ్గదొడిగి
పూచి, పులకించి పూవుల భువిని రాల్చ 390

భక్ష్యభోజ్యమ్ములను దృప్తివడిరి విప్ర
వరులు; బొందియ లుండఁగ స్వర్గసుఖము
ననుభవించిరి పౌరులు; తిని, మధువును
ద్రాగి, తరుణులఁగూడి తైతక్కలాడి 391

భటులు మోదాబ్ధి మునిఁగిరి; పరమదుష్ట
మార్గమున నగ్రజునిదైన మకుటము నెటో
మగని వేధించి కొని తమ మస్తకమునఁ
బెట్టవచ్చిన తల్లిని దిట్టి, దాని 392

నన్నకును నప్పగింపక నడవులఁబడి
వచ్చియున్నట్టి యుత్తము, స్వార్థరహితుఁ.
దాౄగశీలుని, వరభరద్వాజ మౌని
రాజు నొనరించె నన నొక్క రాత్రిలోన, 393

భరతుఁడలరెను; జెల్లిన వగిది కాన
రాక నిశిననఁ, బొడిచె, మార్తండమూర్తి;
సర్వులును సంతటను సుఖస్వప్నములను
గాంచి లేచిన యటుల మేల్కానిరి మురిసి. 394

స్నానమును బూర్వ సంధ్యాది సకలదైవ
కార్యములఁ జక్క ముగియించి, కార్యదీక్ష
ప్రస్ఫుటముగ ముఖమునఁ గన్పట్టుచుండఁ
బరమతేజస్వియై భరద్వాజునకును 395

సొగిలంపడి, తన కృతజ్ఞతను తెలిపి
యాజ్ఞలను గొని సనఁగ నన్నయ్య యున్న
పట్టునకు వేచె భరతుఁడు, భక్తియు విన
యమ్ము రూపందియున్న కాయమ్ము వెలుఁగ; 396

"ధన్యవాహిని యమల మందాకినీమ
తల్లి చల్లని చూపులఁ దనిసియున్న,
మౌని జనముల కాశ్రయమై మనోహ
రమ్మునై యున్న ప్రబలపర్వతము చిత్ర 397

కూటమున నుండె నీయన్న; బాటఁ బట్టి
నూటిగను" బొమ్మనుచు, దారిఁజూపి పంప
మౌనివర్యుండు; సెల వంది మఱల మ్రొక్కి,
పయనమైపోయె నతఁడు సత్వరగతులను, 398

స్యందనమ్ములు, భద్రగజమ్ము, లశ్వ
రాజములు గాల్బలమ్ములుఁ బ్రజల గుంపు
లేకమై మూఁగ, నిల చలియించి భూర
జములు చిక్కని తెరలయి, చదలి కెగయ. 399

సైన్య కోలాహలములును, సైంధవములు
కరులు గావించు రుతములుఁ గలిసి దిశల
దాఁకి మాఱ్మ్రోఁగుచుండఁ, గాంతారజంతు
వితతి పరుగిడె నఱచుచు భీతి నంది. 400

అచటరాముఁడు చిత్రకూటాద్రిలోని
యంద చందమ్ములను జనకాత్మజకును
జూపుచునె యుండి, నందడిసోఁకఁ జెవులఁ
జకితుఁడై సోదరుని బిల్చి, "సంక్షుభితము 401

గా నడవి కారణం బేమి? కాంచి మఱలు"
మనుచుఁ బోఁబంపఁ జని, యతఁడునుగని మఱ
లెను, మహోగ్రుఁడై నిప్పుకలను గురిసెడు
కనులతో ఘోర దృశ్యమ్ముగాంచి నటుల! 402

"కాంచి వచ్చితి కనక వృక్ష ధ్వజమ్ము
గల రథమ్మును; వెనువెంటఁ గదలివచ్చు
చున్న చతురంగ బలముల- నన్ను నావ
వలదు; శాసించి వంపుము; తలల నఱికి 403

సరళ మందాకినీ నదీ సలిలములను
గడిగి కత్తిని మఱలెద, వెడలివచ్చు
చుండె భరతుఁడె నాలుగు దండులఁగొని
నిన్ను హాత మార్ప 'పో' యను మన్న" యంచు 404

భరతుఁ బగవానిగాఁగొని వదరుచున్న
లక్ష్మణునిఁగాంచి రాముఁడు, లక్ష్యపెట్ట
నటుల, "నోటికి వచ్చినయట్లు మంచి
చెడుగులనుఁనెంచి చూడక చెలఁగియాడ 405

దగదు; పావ కూవమునఁ ద్రోయఁగ రవిలిన
'కోవమునుగోల నెక్కిడి కొట్టుము మును
తమ్ముఁడా, బాగుపడెదవు; తమ్ముఁడు భర
తు>డు మదావ్తుఁడు; సుగుణాన్వితుండు; నన్ను 406

బట్టమునునంది పాలింప వలయునంచుఁ
బిలువనే వచ్చియుండును వేఱుకాదు;'
శాంతిగని వేచియుండుము సత్యమును గ
నెదవు; త్వరవడఁబోకుము; కుదుటఁబడుమఁ" 407

టంచు వారించు చుండఁగ, నటకు వచ్చె
ముని వసిష్ఠునితోఁ గైకతనయుఁడు భర
తుఁడు, వదలి కడుచేరువ తోడవచ్చి
నట్టివారిని, నంతసంబుట్టి పడఁగ. 408

అన్నరాముని, కడకుఁ గన్గొన్న ముదము,
నతని తీరును గని ఖిన్నుఁడైన విధముఁ,
గలిసి నేత్రద్వయమ్మునఁ గ్రమ్మి, బాష్ప
కణములై రాలుచుండఁగ, గుణి యతండు, 409

పలుకఁదగినట్టి భంగిని దలఁపులందు
మలచికొను తెలివిదప్పి, మౌనముగొని
మంగళకరమ్ము, మహితమ్ము, మాన్యమునగు
రామచంద్రుని చరణాల వ్రాలె నతఁడు. 410

కాళ్ళఁ జల్లఁగ నమల గంగాజలమ్ము
పాఱుచున్నట్లు భరతుని స్పర్శ, రామ
భద్రుఁ బులకితుఁజేయ, సంభరితమోద
గాత్రుఁడై, శుద్ధచిత్తుఁడై, ఘనుఁడతండు, 411

కరములను వానిఁబైకెత్తి కౌఁగిలించి,
నక్కఁ గూర్చుండ నొడిలోన స్థాన మిచ్చి,
తనువుఁదడవుచుఁ బ్రీతియుఁ జనవుఁబ్రాకఁ
బలికె నిట్టుల మంజుల వాక్యములను. 412

"కనులు విందులుగొనె, నిన్నుఁగఱవుదీఱఁ,
గాంచి యీ సుదినమ్మునఁ గైక సుఖమె?
జనకుఁడేమయ్యె? లక్ష్మణ జనని వగల
వదలియున్నదియా? నన్ను వదలి నాడు 413

తల్లి యేమనుచుండె? నీ తాతయిల్లు
వదలి వచ్చితి వెప్పుడు? పట్టభద్రుఁ
డైతివా? ధర్మబద్ధుఁడవై యఘములఁ
బాలువడకుండఁ బ్రజలను నేలుచుంటి 414

వేమి? వా రెటు లున్నారు? భూమినెందు
నీకు శత్రువు లుండరు; నిజమ? బదులు
వలుకు మోయన్న" యనఁ దావభరము క్రుంగఁ
దీయుచుండఁగ భరతుఁడు దీనుఁ డగుచు, 415

"అన్నిటిని నవలఁ జెప్పెద నన్న నన్ను
మున్ను క్షమియింపు; కైక నా కన్నతల్లి
కాదు; పాపాత్మ, పచ్చి రక్కసి; కుమతిని
మంథరను నమ్మి నీపైని మనసు నిటుల 416

మాఱ మండించినది; వరమంత్రములను
గర్ణముల జపియించి చక్కఁగను, సత్య
వాది జనకుని నొప్పించి వనికి నంపెఁ
బావ చింతనసేయక పాపినియయి, 417

ధర్మబద్ధుని, గుణసాంద్రు ధరణినేలఁ
దగిన దక్షుని నిన్ను స్వార్థమ్మె స్వర్గ
సౌధమని యెంచి; దానినిఁ జంపియుందు
నపుడె, నీవేమియందువో యన్న భయము 418

నన్ను దాఁకకయుండినఁ; బున్నెముండు
మఱలి రావన్న, కరుణించి మస్తకమున
మణిమయకిరీటమును దాల్చి మమ్ము నేలు
మనసు గొనుమన్న, నిన్ను, నే వనిని నిట్లు 419

వల్కలమ్ముల ధరియించి పర్ణశాల
యందు వసియించి, పచ్చికాయలను దినుచు
నుండఁ జూడఁగ లేనన్న, నిండుమనసు
జేసి పట్టును విడుమన్న, సిద్ధముగను 420

వచ్చితి నయోధ్యనే తోడఁ బయన పఱచి
తెచ్చి, నిన్నిందె యందఱు మెచ్చఁ బట్ట
భద్రు నొనరించి సర్వశుభమ్ము లొదవ
వెంట నిడికొని పోదు- నీ వీనులఁబడ 421

కున్నదా పౌరజనఘోష, కోరి నిన్నుఁ
జూడ వేచిరి యదెచూడు చూపుఁబఱపి,
జాలి యుదయించలేద? దోషమ్ము కాద,
వారి నలయింపఁ దగునేమి? పలుకు వినుము 422

ధరణి భారమ్ము భరియింపఁ దరముకాదు
నాకు; నిను వీడి యిప్పు డనాథ యగుచు
వగచుచుండె నయోధ్య; నిన్బాసి రోసి
రోదనల మున్గి మతిసెడి వేదనా భ 423

రమ్ము సహియింప నేరక, 'రామరామ
రావ రావా' యటంచును రాత్రి పగలు
గలవరించుచునే తండ్రి కన్నుమూసె"
ననుచునుండఁగ, దనువునఁ నశని పడిన 424

పగిదిని, బో తండ్రి యేగి, దివికి, నని
యఱచుచునె మూర్ఛలోఁబడె నవని పైని
దాశరథి లక్ష్మణుండుఁ జేఁతలు నశింప
నిలిచె! సీతమ్మ కనులలో నీళ్ళుగ్రమ్మె. 425

శత సహస్ర శకలములై చదలు విఱిగి
మస్తకము పైనిఁ బడినను మందర గిరి
యనఁగ నిశ్చలుఁడైయుండు ఘనుఁడు, దండ్రి
మరణ వార్తను విని గుండె తఱుగఁబడిన 426

పగిది, బుడమిని బడియుండఁ, బంచనున్న
సాధ్వి జానకి శైత్యోపచారవిధుల
నలిపి మేల్కొనఁజేసె- నా సజ్జనుండు,
ముని వసిష్ఠుని పంపున ముందు నడచి, 427

అనుఁగుఁ దమ్ముఁడు లక్ష్మణుఁ డండనుండ
మునిఁగి మందాకినిని, సిక్త వసనములతో
దర్పణఁబిడి, తానందుఁ దఱచు తినెడు
గార పిండిని బిండమ్ముగా నొసంగి 428

మఱలి పోవుచునుండఁగ, మది గలంగ
ముగురు మాతలు బురజనమ్ములును వెంటఁ
బడిరి; యాశ్రమతలమునఁ బడిన రాముఁ
డంత, ధీరుఁడు గావున వంత విడిచి, 429

భరతుఁ గడఁబిల్చి యనునయ వాక్యములను,
"ధరణిఁ బుట్టుట యనుట సత్యమ్మె యైనఁ
జచ్చుటయు నిత్యమే యగుఁ, బిచ్చివాఁడ,
తాప పడఁబోరు ధీరులు, తల్లడిల్లఁ 430

దగదు, జ్యేష్ఠుఁడు నేనుండఁ దక్కె నీకు
దండ్రి యంత్యక్రియలఁ జేయు ధన్యమైన
ధర్మ పుణ్యము, నే నేడ్వఁ దగినవాఁడ
నట్టి చేతకు నోచనియట్టి వాఁడ 431

నైతి నేయని, నాపైని మనసు, ద్రుడిచి
నీతి మార్గమ్ములోఁ బడు; నిన్ను మకుట
మందుమనెఁ దండ్రి; మఱి నన్ను నిందు నుండు
మనెను - జనకుని యాజ్ఞలు మనకు దైవ 432

శాసనమ్ములె యగు; శిరసా వహించి
పాలనము సేయవలెను దప్పంగ రాని
ధర్మమును దాని మనమెల్ల; దాని విడువ
నన్ను విడిచిన యట్టులే నమ్ముము నను. 433

క్షణములేకున్న రాజు రాజ్యమ్ము సెడును;
బ్రజలు పలుకాకు లగుదురు; వలు వలుకులఁ
బలుక ఫలితమ్ము గలుగదు; పదియు నాల్గు
వత్సరము లేగినంత నే వత్తు మఱలి, 434

మాట విని సత్వరమె పొమ్ము, మంగళముగ
మకుటమును నంది, మేటి, సంపదలఁ బడసి
ప్రజలఁ బాలింప లెమ్ము, నిర్మల మనో వి
భాసితుఁడవౌచు వసుధఁ బేర్వడయు" మనెను. 435

అంత రాముని హృదయమ్ము నరయ లేక,
యచట వ్యామోహితుండయి యటమటించు
భరతునికిఁ దెల్పెఁ గఱవఁగ వరమునీంద్రుఁ
డౌ వసిష్ఠుఁడు, దానె ప్రయత్న పడియుఁ 436

బట్టు వీడఁడు రాముఁడెప్పటికి నైన
నంచు రూఢిగ నెల్లరు నరయు నటుల
రాఘవునిఁ జూచి, "మంచిది రామ, నాదు
మాట వినఁదగు నేనియు మనసు నిచ్చి 437

వినుము సెప్పెద; గురు వాక్యమును నలంతిగఁ
ద్రోసి పుచ్చుటఁ దగ దది దోష మగును;
ధర్మ వర్తివి, కుల సంప్రదాయములను
దప్ప కూడని ధర్మమ్ము దప్పరాదు. 438

ఆది నుండియు జ్యేష్ఠుఁ బట్టాభిషిక్తుఁ
జేయు చుండుట యిక్ష్వాకు శిష్టవంశ
సంప్రదాయము; పెద్దలు సాగి పోయి
నట్టి దారిని దప్పుట యెట్టి ధర్మ 439

మగునొ యోజింపఁదగినట్టి దగును; జ్యేష్ఠ
నందనుం డీవు; రాజ్యమ్ము నందఁ దగిన
వాఁడు భరతుఁడు గాఁడు; నీ పాలిటి దది;
కానఁ, గొనరమ్ము విడిచి యీ కాననమును," 440

అనిన, "ననుఁ గూడ విననగు మునివరేణ్య
యార్యవర్యుల సంప్రదాయమును దాఱు
మాఱు సేయుట సరికాదు- మంచి మాట;
తప్ప రానట్టి యుత్తమ ధర్మములకు 441

నడ్డు వడునేని సంప్రదాయమ్ము లవ్వి,
వానిఁ బాటింప సాధ్యమా? వలను వడదు;
ఇంక గురు వాక్యముల నిల నెంత వఱకుఁ
బాలనము సేయఁ దగునను బలుకు కలదు. 442

పుట్టుకను నిచ్చి, యన్నమ్ముఁ బెట్టి పెంచి
జ్ఞానవంతునిఁ జేసిన జనకుఁ డాది
దైవమగు; కాన, నాతనిఁ దనిపి, మిమ్ముఁ
దనుప నగు; క్షమియింపు"డనినఁలోని 443

యాశ వదలెను కౌసల్య యచలుఁ డంచు;
మేటి మానిసి యనుచు సుమిత్ర మురిసె;
తప్పు దెలిసినఁ కైక, మంథరను దిట్టె;
బళి బళీ! యని మెచ్చిరి పౌరు లెల్ల! 444

భరతుఁడిఁక దారిలేదని పరమ పురుషు
పాదముల నంటి మ్రొక్కి, "నీ పాదుకలను
కాదనక నాకు నొసఁగుము, కదలి పోదు;
శిరముననను మోసికొని వాని నరిగి నేను 445

కోసల మహాప్రదేశ సింహాసనమున
నిలిపి నీ ప్రతినిధులుగ, నీవు మఱలి
వచ్చు వఱకును నెట్టులో బ్రతుకు చుందు;
మఱలఁ దగు దినమును దప్పి, మఱల వేని 446

ప్రాణముల మాపికొందును రవులుచున్న
మంట లోఁబడి నీ నామ మంత్రములను
జప మొనర్చుచుఁ దప్ప, నిశ్చయము రామ
యనుచు బాదుకలను గొని, యలరి శిరము 447

పైని నిడికొని చతురంగ బలములును బ్ర
జా సమూహములును రామ చంద్రునకును
వందనమ్ముల నర్పించి, ముందు నడువఁ,
జనెను, మృత్యుంజయమ్మను సామజమ్ము 448

నెక్కి యరదమ్ము గడకు, శంఖారవములు
వాద్య ఘోషలు జయ జయ ధ్వానములును
జెలఁగ, దిక్కులు మాఱ్మ్రోఁగ, యలరి సురలు
పుష్ప వర్షము వర్షింపఁ బుడమి పైని. 449

చని యయోధ్యకు, నట రాజసౌధమందు
విడచి తల్లుల మువ్వుర, బుడమి నొల్ల
నట్టి భరతుఁ డయోధ్యలో నన్నను విడి
యుండ నోపక, చేరువ నున్న నంది 450

గ్రామమున, వల్కలమ్ములఁ గట్టి జటలఁ
దాల్చి కురులను మలఁచి, యుత్తముని రాము
పాదుకల స్వర్ణ పీఠమ్ము పైని నిలిపి,
యనుదినము వానిఁ బూజించి యాజ్ఞలఁ గొని 451

పాలనము సేయఁ బూనెను బదియు నాల్గు
వత్సరమ్ములలోఁ గల వాసరముల
లెక్కఁ బెట్టుచు, ముంగలఁ జక్క వెలుఁగు
చితిని బోషించి యుంచి సజీవముగను. 452

అంతలో నట జిత్రకూటాద్రిలోని
సంయములు, ఖరుఁడనెడు రాక్షసుఁడు వరిస
రముల లోఁబడి ఋషుల నారాట పెట్టు,
చుండుటను విని, బెదరి యా కొండను విడి 453

చనఁగ, రాముఁడు పత్నిని ననుజుని గొని
చిత్రకూటమ్ము విడి చని, యత్రిని గని,
గడపి యొకరాత్రి నాతని విడిదిలోన
దండ కారణ్యమును జేరఁ దరలిపోయె. 454



# అరణ్యకాండము

రామ లక్ష్మణోభయులు నారాయణాంశ
సంభవులు, లక్ష్మి సీత, యన్సత్యము నర
యంగఁ జాలిన తాపసు లందు నందుఁ
బిలిచి ప్రియమార పరిపక్వ ఫలము లొసఁగి 1

తనియఁ బూజించి, రాక్షసాధములఁ గూల్చి
తమ్ము రక్షింపఁ బ్రార్థించి, తరలఁ బంపు
చుండఁ బయన మ్మొనర్చుచు సుకరముగను,
బడలి నడలని భంగి నిర్భయము కాఁగ, 2

ధ్వస్తతరులతా గుల్మ సంతతులతోడ,
కడు భయంకర జంతు సంఘములతోడ,
కలుషితాగాధ సలిల దుర్గంధ పంక
భరిత కాసారములతోడ, స్తబ్ధ విహగ 3

నివహముల తోడ, ఝుల్లికా నినదములను,
జటిల తమసావృతం బయి, కుటిల మార్గ
దుష్టమై, దుర్గమం బయి, దుస్తర మగు
దండకారణ్య భయద మధ్యమ్ముఁ జొచ్చి 4

నంత రాముఁడు, విలయ కాలాంతకుఁ డన
పైనిఁ బడవచ్చె వదన గహ్వరము విచ్చి
యాగ్రహోగ్రులఁ గ్రక్కుచు నడవి యద్రువ
నఱచుచును విరాధుఁడు రాక్ష సాధముండు. 5

నగము పైనుండి వెలిబ్రాఁకు నల్ల త్రాచు
పాములనఁ దోఁచు కరముల బ్రాఁక వదలి
వాఁడు పట్టి సీతను జంకఁ బెట్టి కొనుచు
నరుగు చుండఁగ, సంధించి యాశుగముల 6

గముల, సరసరఁ దఱిమె రాఘవుఁడు వాని
దాఁక, నెత్తుటఁ దోఁగుచు దానవుఁడును
బలము నెల్లను మోపి కోపమ్ము రవుల
లాఘవమ్మునఁ జేతి శూలమును విసరె! 7

రామ బాణమ్ము దానిఁ జూర్ణ మ్మొనర్పఁ,
దాఁకి సౌమిత్రి వాని నుద్దండుఁ డగుచు
కరయుగమ్ముల ఖండించి పరమ పుణ్య
వతిని సీతను రక్షించి పతినిఁ జేర్చె. 8

కాయఁ మెల్లను జల్లెడ కరణి గండ్లు
వడియు, రక్తంపు టేఱులు, పాఱు చుండి
యును, గరమ్ములు దునిఁగియు, ఘనుఁడతండు
చావకయె యున్నఁజూచి యాశ్చర్యపడుచు 9

దాశరథి, "లక్ష్మణా, వీనిఁ దరము కాదు
చంప శస్త్రమ్ములను, వరశక్తుఁ డితఁడు;
పాఁతి పెట్టుము వీనిని గోతిఁ ద్రవ్వి
ప్రాణములతోడ" ననిన లోలోన నలరి, 10

శాపమును దప్పి చనఁగ నిశాచరుండు,
"సత్యమును బల్కితివి; నను శస్త్రములను
జంపఁ జాలవు; బ్రహ్మశాసనము నెవరు
దప్పి వర్తింప నేరరు! తడవు సేయఁ 11

దగదు, దయఁజూచి తగుగోతి ద్రవ్వి యిపుడె
పాఁతి పెట్టుము నన్ను నీ వసుధను విడి
స్వర్గమునకును నేగుదు స్వస్వరూప
మంది; తుంబురుఁడను; భువి నసురుఁడ నయి 12

వడితి ధనపతి శపియింప, పతిత పావ
నా, వరాత్పర, రామ, దీనజన మిత్ర
మా, దయానిధి, ముక్తి నిమ్మా" యటంచు
నార్తుఁడై వేడుచుండ రామానుజుండు 13

త్రవ్వి లోతైన గోతిని దలను దన్ని
దానవుని నందుఁ బడఁద్రోసి మేను మఱుఁగఁ
బాఁతిపెట్టెను మంటిని బైనిఁ బోసి
దిట్టముగఁ దట్టి, ఘన వద ఘట్టనముల 14

శాప ముక్తునిఁ జేసి నిశాచరు నటు
దాశరథి వత్నితోడ, సోదరునితోడ
బయనమును గొనిచని శరభంగునకును
దర్శన మొసంగి మోక్ష ప్రదాత యగుచు, 15

నచటి యాశ్రమవాసుల కభయము నిడి,
రక్కసులఁ గూల్తు నని చెప్పి, చక్కవెడలి
కని సుతీక్ష్ణుని, మ్రొక్కి, చెంగటనె యున్న
యాశ్రమమ్ముల దర్శించి యవలి దారిఁ 16

బట్టి యేగుచుఁ దపసుల వంత మావఁ,
దమకు నెగ్గేది తలఁచని దానవులను
జంపుటయు న్యాయమా? యని సతి యడిగిన,
క్షత్రియులకును నార్తరక్షణము సేయు 17

ధర్మమది తప్పగారాని ధర్మ మనుచుఁ
జక్క బదులిడి, ఋషి సుదర్శనునిఁ జూచి,
ముని యగస్త్యుని యాశ్రమమునకు నరుగఁ
దగిన మార్గమ్ము దెలుప నాతనిని వేఁడి, 18

తెలిసి, ముందేగి చనుచును దెలియఁ జెప్పు
చును నగస్త్యుని మహిమల ననుజునకును,
త్వరిత గతినందియ మ్మహాతపసి యున్న
తలముఁ జేరెను జిత్త పద్మమ్ము పూయ. 19

అతిథి సత్కార ధర్మము లన్నిఁటిఁ దగ
దాశరథికిని వివరించి, తపసి యతని
కర్ఘ్య పాద్యాదు లిచ్చి యాహ్వాన మొనఁగి,
పక్వ ఫలముల, మకరంద పాయసముల, 20

కందమూలమ్ములను బెట్టి గడుపు నింపి,
జానకిని బతివ్రత యని చాల పొగడి,
యగ్రజుని తోడిదే స్వర్గ మనుచుఁ గొలుచు
చున్న యుత్తము లక్ష్మణు నన్నుతించి, 21

పద్మనాభుండు గమల సంభవుఁడు నమర
పతియుఁ దనకు నొసంగిన ప్రబల శస్త్ర
ములగు, ధనువును శరము నమ్ముల పొదులను
ఖడ్గమును బ్రీతి నందించి, కడు సమీప 22

మందుఁగల పంచవటి వానమంద యోగ్య
మైన వట్టని సూచించి, దానిఁ జేరు
మార్గమును దెల్పి, యందుండి మంగళముగ
మఱల దీవించి పోఁబంప, మస్తకమును 23

వంచి వందన మిడి మౌనివర్యునకును
రాఘవుఁడు బాట పొడవున రమ్యమైన
ప్రకృతి సౌందర్య శోభలఁ బరవశుఁడయి
కనుచుఁ, బయనించెఁ బత్నితో ననుజుతోడ. 24

దశరథ సఖుండు, వృద్ధుఁ, డుత్తముఁడు ఘనుఁడు,
పక్షిరాజు జటాయువు బాట నడుమ
పరిచితుండయి, తోనుండి వనుల వారి
ప్రాపుగా నుండఁగోరితోఁ బయన మైన, 25

వానిఁ దోడ్కొని చని దారిఁ బట్టి వడిగ
నడచి, నాలుగు క్రోసులు గడచి, మధుక
వనములోఁ బడి పయనించి పంచవటిని
జేరె నాతఁ డగస్త్యుఁడు చెప్పినటుల. 26

అమల జలములు, ఫలములు నమరియున్న
పట్టులును బండ నుండంగ వలయు వసతి
గలిగి యున్నట్టి తలమది గనుల విందు
సేయుచును గానఁబడినది హాయి గూర్చి. 27

కడనె గోదావరీనది; కమల భరిత
మైన కాసార సుందరి; యతి సమీప
మందె గంభీరనగము; సొంపైన ప్రకృతి;
పుష్ప ఫల రాజితమ్ములౌ భూరుహములు; 28

పచ్చిక బయళ్ళు; బహువిధ పక్షులును మృ
గములు; సెలయూటలును, గుల్మలముల గుంపు
వసుధ నెలకొన్న స్వర్గమ్ము పగిది పంచ
వటి మనోహర మగుచుఁ గన్పడుచునుండె. 29

పరిసర ప్రాంతముల రామభద్రుఁ డంత,
నంచరించుచు నుండఁగ సతిని గూడి,
తగిన పట్టును వెదకి సోదరుఁడు గడఁగి
పర్ణశాలను నిర్మించె వాస మంద. 30

అన్న సౌఖ్యమె తనసౌఖ్య మంచు నెంచి,
యన్ని పనులను జెప్పకమున్నె చేసి,
యాత్మ కింపుగ వర్తించు ననుజు నిండు
కౌఁగిటను గ్రుచ్చి తనిపి రాఘవుఁడు పత్ని 31

పంచ నుండఁగ నంతయు వంత గొనని
పగిది సుఖియించు చుండఁగఁ బంచవటిని,
వలపు దలఁపుల నూరించి కలిపి కవల
మురిసి యాడెడు హేమంతుఁ డవతరించె. 32

అండఁ గూర్చుండి లక్ష్మణుఁ డగ్రజునికి
రమ్యతరమైన యా ఋతురాజ వైభ
వముల వర్ణించి సెప్పుచు వంత దగుల
నట్లు సేవించుచుండె నెయ్యమ్ము మీఱ. 33

గణ్య గోదావరీ నదీ పుణ్య తోయ
ములను స్నాన మ్మొనర్చి, యమలములైన
వల్కలమ్ములఁ గట్టి, ప్రభాత సూర్యు
నకును నర్ఘ్యము లర్పించి, నతుల నిచ్చి, 34

దైవ పూజాదికమ్ములఁ దగ ముగించి,
యరుణ తరుణార్క రోచులు ధరణి పైని
బ్రాఁకుచునె వచ్చి తనువుపై సోఁకు చుండ,
నాశ్రమోపాంతకఠినశిలాసనమున 35

సోదరుఁడు చెంత నిలుచుండ సుందరుఁడయి
దాశరథి గూరుచుండ సీతాసమేతుఁ
డగుచు, నొకనాఁ డటకును భయంకరి యగు
రాక్షసాంగన యొకతె శూర్పణఖ యన్న 36

దరుగుదెంచెను; కనిపించి నంత నరుల
పైనిఁబడి చంపి తినెడు నప్పాపి మనను
మాఱ, సర్వాంగ సుందరాకారు, మార
నముని రామునిఁ, గనినంత సౌమ్య యగుచు, 37

మరులఁ లోఁబడి వానిని దరియ నేగి,
యతిభయంకర రూపిణి యయ్యుఁ దనదు
నందచందమ్ములను గొనియాడి కొనుచుఁ
దానె, సీతను విడనాడి తన్ను బెండ్లి 38

యాడి సుఖియింపఁ గోరిన, హసితవదనుఁ
డగుచు రాముఁడు, లక్ష్మణు నడుగు మంచు
వాని కడబంప, రాముఁడే వడయఁ దగిన
వాఁ డటంచును దానినిఁ బంపె మఱల 39

నన్న కడకును సౌమిత్రి; యది వినుఁగుచు,
సీతనే మ్రింగ నేగినఁ జేటగు నని
వెఱచి యద్దాని లక్ష్మణుఁ డరుగఁ దఱిమె
కోసి ముక్కును జెవులను గ్రూరుఁ డగుచు. 40

రావణుని తోడఁబుట్టువు, రక్కసి యది,
ముక్కు నొకచేతఁ జెవుల నింకొక్క చేత
మార్చి మాఱిచి మొత్తుచు మహి వడకఁగ
వాయి దెగవిచ్చి యఱచుచు, బాధ వడుచు, 41

భంగపాటును దలఁచుచుఁ గ్రుంగి కుమిలి
రక్త సిక్తాంగియై లోని శక్తుఁ లుడుగ
నరిగె, ననుజుల ఖరదూషణాదిఘనుల
కాళ్ళఁ బడితెల్పఁ దనగోడు కాంచి, యంత 42

భగిని శూర్పణఖను, భంగ పఱచి పంపి
నట్టి శూరుల చరితమ్ము నంతయు విని,
కనుల గెంపూరుచుండ, నాగ్రహము మండ,
ఖరుఁడు, పుడమిని దన్నుచుఁ గాలుని వలెఁ, 43

'జెల్లెలా, దుఃఖ పడకుము చిన్నఁబోకు
నేను జీవించి యుండఁగ దీన వగుచు
వగుచు చుండఁగఁ దగదు; కన్పడిన యంత
నరుల భక్షించు నీ విటు మరులఁ దగిలి 44

మఱలి వచ్చుట పొరపాటు; మఱల నట్టి
వనికిఁ బోకుము; క్షణము లోపలనె నిన్ను
నవమతించిన నీచుల యంగములను
కండ తుండెమ్ము లొనరించి కాళ్ళ క్రింద 45

నలుగఁ బడవేయుదురు పదునాల్గు వీర
వరులు; శాంతింపుమా' యని, భటులఁ బిలిచి
పంపెఁ జెల్లిలితోఁ; శస్త్రపాణు లగుచు
వారు నేగిరి రక్కసి బాటఁ జూవ. 46

పదియు నాలుగు భటులను బదియు నాల్గు
శరములను బడనేయ దాశరథి, ఖిన్న
యగుచు మఱలెను మునుపటి యటులె శూర్ప
ణఖ, యనుజు కడకును వేదనల మునింగి. 47

అటు చతుర్దశ వీరుల నంత లోనె
జముని యింటికి ననిపిన శౌర్యనిధుల
శక్తి నరయంగ లేని నిశాచరుండు,
చల్లఁబడి యూరకుండక సాహసించి, 48

మరణ దేవత పిల్చిన మాడ్కిఁ, దానె
పదియు నాలుగువేల పెన్భటుల తోడ,
ననుజుఁడును సైన్యనాథుఁడునైన దూష
ణుని, త్రిశిరుఁడను వీరునిఁ దనదువెంట 49

పయన మొనరించి, భగినిని భంగ పఱచి
నట్టి వారలఁ గూల్పఁగ మిట్టి పడుచు,
స్యందనము నెక్కి బహువిధ శస్త్రబల స
మన్వితుం డయి వెడలె, పెంపంది, ప్రబలి 50

కనక ముందున్న ముప్పును గర్వితుఁ డయి
ఖరుఁడు కదలుచు నుండ దిక్తటము లదరె!
యవని యుత్పాతములఁ జిక్కి యటమటించెఁ!
బ్రకృతి శోభావిహీనమై భయద మయ్యె! 51

శంఖములు రణభేరులు నందడింప,
సైన్యకోలాహలమ్ములు చదల నంట,
సమర మొనరింప నసురుఁడుత్సాహి యగుచు
సాగి వచ్చుచు నుండఁగ జక్కఁ గాంచి, 52

పత్ని సీతను నొక చాటు పట్టుఁ జూచి
దాఁచి గాపాడు చుండఁగ దండ నున్న
తమ్మునికిఁ జెప్పి, రాముఁడు తనువును ఘన
కవచమునఁ గప్పి, తూఁపులఁ, గార్ముకముల, 53

ఖడ్గముల సిద్ధ మొనరించి, ఖలులఁ దునుమఁ
గాచి యుండఁగఁ, బెక్కు రొక్కనిని దాఁక
వచ్చి పైఁబడఁ దొడఁగిరి; బల్లెములను,
బాకులను, నీటెలను బట్టి బాహువులను. 54

పరఁగు చుండఁగ శరపరంపరలు రామ
మూర్తి కార్ముక నిర్ముక్తముఁలయి, దారు
ణాయుధమ్ములు ముక్కలై, యవని పైని
కురలి శిరములు పెక్కులు దొరలిన యవి. 55

కొండ యంతటి పెనుదండు కుప్పగూలి
తెప్పలుగఁ బచ్చి నెత్తుటఁ దేలుచుండ,
రోషితారుణనేత్రుఁడై దూషణుండు
భటులు వేలకు ముందుండఁ బరుని దాఁకె. 56

ప్రబలి, కాలుండె యనఁగఁ గన్పట్టి యతఁడు
స్యందనము నుండి పోరుచు సాహసి యయి,
శత సహస్ర శరమ్ముల నర నర మని
దఱుమఁ దొడఁగెను గుఱిపెట్టి పరునిఁ దునుమ. 57

ఘోరముగ సాగె నాపోరు శూరు లగుటఁ
బోరు వారిర్వను; రఘువీరుఁడొంటి
గాఁడు పెక్కురఁ దాఁకి పోరాడుచుండ
నక్కజంపడి చూచిరి యమరు లెల్ల. 58

పుండు పడియును రాముఁడు కొండ వలెను
నిలిచి నిశ్చలుఁడయి కడునిశితశర ని
చయములను బాఱ విడువఁగ శత్రు సైన్య
రాశి నశియించుచుండె వీర్యమ్ము సెడఁగ. 59

ఖండితములైన శిరములు మొండెములును,
గరములును, గాళ్ళు, బహుశస్త్రఖండములును,
బచ్చి నెత్తుటి రొంపి లోఁబడి దొరలఁగ,
వని భయంకరనరక రూపమ్ము నందె! 60

సారథినిఁ జంపి, కూల్చి యశ్వములను రథ
చక్రముల నుగ్గు గావించి, క్షాత్రమూర్తి
రామచంద్రుఁడు, పొంగ నా గ్రహ మగస్త్యుఁ,
డంది యిచ్చిన వైష్ణవం బగు ధనువును 61

బట్టి శరముల నంధించి పాఱవిడువ,
దుష్టదానవముఖ్యుండు, దూషణుండు
కుధర మట్టుల నేలపైఁ గూలిపడెను
ఖరుని గుండియఁ గాలిచి గర్వ మడఁచి. 62

మూఁడు దలలను గల్గిన వాఁడు, త్రిశిరుఁ
డంత బైఁబడి పోర నుగ్రాకృతి గొని,
దాశరథి వాఁడి తూఁపులఁ దఱిమి వాని
తలలఁ దెగఁ గొట్టి కూల్చె నుద్దండుఁ డగుచు. 63

వదియు నాలుగు వేల పెన్భటులు గూల,
దర్పవంతుఁడు దమ్ముఁడు దన్ను వీడ,
మేరుధీరుఁడు ద్రిశిరుఁడు మిత్తివాతఁ
బడిన, నేకాకియై తోడు సెడిన ఖరుఁడు 64

మూఢమతి యయి, శ్రీరామమూర్తి మహిమ
నరయ లేకుండ నప్పటికైన, స్యంద
నమును ముందేగ నడిపించి జముని మాడ్కి
రాఘవుని దాఁకి యుగ్రుఁడై రణ మొనర్చె. 65

పొలి యాఱఁగ నున్న దీపమ్ము భగ్గు
మనుచు మండెడు భంగి న య్యసురుఁ డతిశ
యించి, యనమానుఁ డనఁగను మించి పోరు
చుండ గడగడ లాడె భూమండలమ్ము. 66

కవచమును జీల్చి, ముక్కలు గాఁగఁ గొట్టి
కార్ముకమ్మును, రాముని కాయ మెల్లఁ
గఱకుటమ్ములఁ గ్రుచ్చి రక్తమ్ము గాఱఁ
జేసెఁ గడు దుష్టుఁడై వాఁడు సేటు వడఁగ. 67

రక్త సిక్తాంగుఁడై రఘురామమూర్తి,
ప్రళయ రుద్రుని భయదరూపమ్ము నంది,
యాగ్రహ మహోగ్రుఁడై తాఁకి యంపపొదిని
యక్షయమ్మగు తూఁపుల నరిని దాఁక 68

పట్టు విడువులఁ గనరాని పగిది నేయ,
రథము ముక్కలు గాఁగ, సారథియుఁ జావ,
పగులఁ జేనున్న గదయు, బెం పుడుగ ఖరుఁడు
కడకుఁ బుడమిని బడెను లోకమ్ము లలర. 69

ప్రసవ వర్షమ్ము గురిపించ స్వర్గలోక
ాసు లానందపడిరి; తాపసు లలరిరి;
ాఁటు విడివచ్చి ధరణిజ నంతసమున
ఁగనిఁ గౌఁగిటఁ గ్రుచ్చె; లక్ష్మణుఁడు మురిసె. 70

ంత, చారుఁ డకంపనుఁ డనెడు రాక్ష
ాధముఁడు నచ్చియును గూడఁ జావకుండ
ఁగి తప్పించుకొని, జనస్థానము విడి
బల మాయావియై మింటి పైని కెగసి, 71

వారిధిని దాటి, లంక లోఁబడి మహా భ
యంకరుని, దుష్టచిత్తుని నసురనాథు,
నచలరూపుని, నిఖిలలోకాధిపతులఁ
బంచభూతమ్ములను, గ్రహసంచయముల 72

పద్మనాభుని, పద్మసంభవుని, గరళ
కంఠు శాసించి పనిగొనఁ గలుగు ఘనుని,
క్షాత్రమూర్తిని, రావణుఁ గని వడఁకుచు
నడుగులను బడి, యభయమ్ము నంది లేచి, 73

దండకారణ్యమున జనస్థానమందు
నాల్గు నొక పదివేల సైన్యములతోడ,
నొక్క వీరుఁడు దాఁకఁగ నుక్కడంగి
పడిన ఖరదూషణాదుల భయదమరణ 74

గాథలను నెల్ల వివరించి కర్ణములను
బడఁగఁ జెప్పెను; నిర్జింప వలను కాని
ఘనుల నటు మూఁడు గడియలకాలమందె
కాలు నింటికి ననుపంగఁ గలిగి నట్టి 75

వానిఁ బ్రత్యక్షమున దాఁకి వధ్యుఁ జేయ
సాధ్య పడదని యెంచి నిశాచరపతి,
వంచితు నొనర్చి సుందరవతిని నతిని
వశ్య మొనరించి కొని సుఖ పడఁగఁ దలఁచి, 76

యట్టి చేతకు మారీచు డండ నుండి
సాయ పడునని యతని యాశ్రమముఁ జేరి,
దలఁపు లోనున్న కోరికఁ దెలియఁ జెప్ప
నతఁడు వడవడ వడఁకుచు మతి గతిసెడ, 77

"రావణా, యేమి యంటివి? రామచంద్రు
సతినిఁ జేపట్ట నుంటివా? శత్రువు లెవ
రంత మొందింప నిన్నిట్టి యనువు గాని
వనికిఁ బురికొల్పివంపిరి? వంశనాశ 78

నమ్ము తప్పదు; నా మాట నమ్మి మఱలి
పొమ్ము దుశ్చింతనల మాని; పూతచరిత
రామపత్నిని దాఁకుట రాక్షస కుల
రాజ్య రమ గాల్చుటయె యగు! రాము నెట్టి 79

వాఁడవనిను కొంటివో నీవు? వాని చఁడి
బాణముల వేఁడి నెఱిఁగిన వాఁడ నేను,
ఒక్క విశిఖమ్ము, నను శతయోజనముల
వఱకు వెన్నంటి తఱిమి చంపకను ముంచ 80

వనధిలోఁ బ్రాణములతోడ బ్రతికి యుంటి
మరుగు చాఁటున నిట్టుల; మనుజ మాత్రు
డౌ నటంచు నెంచకు మతని; దైవ
మే యటంచును నెఱుఁగుము; మాయఁ బన్ని 81

వాని వంచింప నెంచుట, వలచి చావు
దయ్యమును బిల్వఁ దలఁచుట; కయ్య మునకుఁ
గాలు ద్రవ్వక చనుము నీ కాళ్ళఁ బడుదు
నన్న నిర్బంధపఱచక యతఁడు మఱలె. 82

అంతలో శూర్పణఖ యట కరుగు దెంచి,
యగ్రజునిఁ దిట్టి, యుబ్బించి; యనునయించి
కలికి సీతను శృంగారఖని యటంచుఁ
బలువిధమ్ముల వర్ణించి, వాని లోని 83

కామఁ వహ్నినిఁ దగ నూఁది, కన్ను గప్పి
ప్రాణములనైన బలియిడి రామపత్నిఁ
బడయఁ దగునన్నఁ నిశ్చయ భావమునకు
దెచ్చె నాతనిఁ; గుక్షిలోఁ జిచ్చు లాఱ. 84

మాఱి మతిదప్పి, కామాంధకారమందుఁ
బడి, తపించుచు రావణేశ్వరుఁడు మఱల
నరదమును నెక్కి మారీచు దరియ నేగి,
పట్టు విడఁదగు నని వాఁడు పాద మంటి 85

వేడు చుండియుఁ జెవి నిచ్చి వినక విసిఁగి,
యాగ్రహమ్మును వెలిగ్రక్కి, "యరుగు మింక
తామసించినఁ జత్తువు, దనువు మార్చి
పసిఁడి లేడిగఁ బయనమై పంచవటిని 86

జేరి, రామాశ్రమమునకుఁ జేరువ విహ
రింపు చుండుము; సీత పోఁబంపు నంత,
పతిని రాముని నిన్నుఁ జేపట్ట; నతఁడు
వదలి తమ్ముని సతిని గాపాడ నటనె 87

వచ్చు నినుఁగొన, పరుగులు వట్టి వాని
కందు పడునట్లు బహుదూర మరిగి యరిగి,
'హా! సతీ! సీత! లక్ష్మణా!' యంచు రాముఁ
డఱచి నట్టుల నఱచి మాయమ్ము గమ్ము" 88

టంచు, శాసించె; మారీచుఁ డతని చేతి
చావు కన్నను శ్రీరామచంద్రు చేతఁ
జచ్చు టెంతయు మేలని, సమ్మతించి,
యరదమును నెక్కె వానితోఁ; నది వడిగొని 89

పరుగు లిడి పంచవటి సమీపమున నిలువ,
మాఱి మారీచుఁ డంతలో మాయఁజూపి
పసిఁడి లేడిగ, దుముకుచుఁ బర్ణశాల
ముంగలను సీత గనుచుండఁ జెంగలించె. 90

పర్ణశాలను విడిచి పుష్పములు గోయ
వచ్చి ధరణిజ యాశ్చర్యపడుచుఁ జూచి
పసిఁడి లేడిని, లోనున్న పతిని బిలువ,
తమ్ముఁడును దాను వచ్చె నాతఁడును నటకు. 91

ఆ యమాయకురాలు మాయల నెఱుంగఁ
జాలనిది యౌట, మారీచు గాలమునఁ ద
గిలి, యపూర్వముగా నొప్పి, యటుల ద్రుళ్ళి
యాడు లేడిని బొందఁగ నానఁ జేసి, 92

"అంగమున కొక్క క్రొంగ్రొత్త రంగు; కనక
మయ మనోహర రూపము! మహిమఁసిలుకు
రత్నబిందువు లందందు రాజిలంగ,
నందములఁ జిందుచును గనుముందుఁ గానఁ 93

బడు పసిఁడి లేడిఁ జూడుము! వలతు దానిఁ
బడయ; చని పట్టుకొని రమ్ము ప్రాణ నాథ"
యనుచు చన పుట్టిపడఁగఁ బ్రార్థించె నంతఁ
జకితుఁడై లక్ష్మణుఁడు,"రామచంద్ర యసుర 94

మాయ యిది; పట్టఁ బోకుము; మహిని నెందుఁ
గాంచి యెఱుఁగము, చిత్ర మృగమ్ము దీనిఁ
జావఁగొట్టుము; మున్నొక్క సమయమందు
వచ్చె మారీచుఁ డిట్టి రూపముననె చెడు 95

దలఁపులను మనలను నేచ; దైవ వశము
నను గతింపక తప్పించి కొనిచనె" నన,
"యట్టులే యగునేమొ, కాదనను; దీని
తంతు గనుఁగొని యవల మాత మ్మొనర్తు; 96

బ్రాణములతోడ నిది నాకుఁ బట్టు వడినఁ
బట్టి తెత్తును; గానిచోఁ గొట్టి చంపి
చర్మమును దెత్తు; పడఁతి యాశలను భంగ
పఱచు టుచితమ్ము గాదు; నే నరిగి వత్తు" 97

నంచుఁ దమ్ముని నతికి సాయముగ నుండ
నందె విడి, దానవాంతకుఁడైన రామ
భద్రుఁ డరిగెను గోదండ పాణి యగుచు
నా మృగమ్మును దరియ; నయ్యదియుఁ బాఱి, 98

చెంగు చెంగున లంఘించి చిత్రముగను
జిందులను ద్రొక్కుచును జేతి కందు వడక
పరుగులను బట్టి యాగుచు, దరియఁ బోవ
మరల వడిగొని పాఱుచు, మఱఁగి నట్లు 99

మఱఁగి మరలను దోఁచుచు దిరిగి తిరిగి
చూచుచును జొర రానట్టి చోట్లఁ జొచ్చి
చనుచు, నాతని బహుదూరమునకు నీడ్చి
కొని చనంగను, విసుఁగంది కినిసి యతఁడు 100

కోల నెక్కిడి విడిచినఁ గుతలము వయిఁ
గూలె నది రాక్షసాకృతిఁ గొని యఱచుచు
"నయ్యయో, సీత, లక్ష్మణా," యనుచు రాముఁ
డఱచి నట్టుల, రావణు నాజ్ఞ వగిది. 101

కర్ణములఁ బడ నసురు నాక్రందనమ్ము,
రాము నాక్రందనమ్ముగ భ్రమసి సీత,
'యఱపులను జక్క వింటివా? మఱఁది? యన్న
యాపదలఁ బడె రక్షింప నరుగు' మనిన, 102

భీమ రామాజ్ఞచే నామె విడిచి వెడల
రాక నటు కట్టువడి యున్న రామసోద
రుండు, సుంతయుఁ జలియింప కుండ, "వెఱ్ఱి
దాన, భయపడఁ బోకుము; దానవుని కు 103

తంత్రమే యది; మఱలు భద్రమ్ము గాఁగ
తరలి పోయిన వనిని సొంత మ్మొనర్చి
రామభద్రుఁడు; లోన నారాట పడఁగ
గారణము లేదు; సప్తలోకముల నీదు 104

పతిని మార్కొనఁ జాలిన వాఁడె లేఁడు;
నమ్మి యోపిక పట్టుమో యమ్మ" యనిన
ప్రాణపతిపైని వ్యామోహపాశబలము
పట్టి దుర్మార్గమున కీడ్వఁ, బడఁతి యామె, 105

చక్క నెఱిఁగియు మఱఁదిని సంశయించి,
"వంచకుఁడ వీవు లక్ష్మణా, వనికి రామ
భద్రుపైఁ బ్రేమచేఁ గాదు, పడయ నన్ను
వచ్చితివి నిక్కువం బిది; ప్రాణఁ బతినిఁ 106

బాసి నిమునమ్ము మనలేను వసుధలోన;
కడనె గోదావరీ నదీ గర్భ తలము
గలదు నాఁకాశ్రయం బిడి కలుష మతుల
కరములను బడనీయని కరణి గావ; 107

కనుము ప్రాణమ్ములను నీదు కనుల ముందె
విడుతు" నని సూటిగను గుండెఁ బొడిచి పలుక,
నలిగి సౌమిత్రి, "ననుఁ దూలనాడి నట్టి
యఘఫలమ్మును బడయుదు" వంచు నరిగె. 108

అవనిజను వీడి యేగ రామానుజుండు,
కడనె తఱిగాచియుండిన ఖలుఁడు, రావ
ణాధముఁడు మాఱి సన్న్యాసి యగుచుఁ బర్ణ
శాలఁ జొచ్చెను పరమప్రశాంతుఁ డగుచు. 109

వందనం బిడి, జానకి, వాని వేష
ధారి యని సంశయింపక, తగిన రీతి
యర్ఘ్యపాద్యాదు లొసఁగి పక్వాన్నము నిడి
సత్కరించెను నిర్మలస్వాంత యగుచు. 110

కపట సన్న్యాసి యంత నిష్కపట మూర్తి
యనఁగ నటియించి, ప్రేమయుఁ జనవు దోఁప,
"కనుల మిఱుమిట్లు గొలుపుచుఁ గాంతిఁ జిమ్ము
కలికిరో, యెవ్వతెవు నీవు? కాము రతివ? 111

కాక యింద్రుని సతివ? యి క్కాన నొంటి
దానవై యుంటి వేల? సత్యమ్ము దాఁచ
దగదు సన్న్యాసి యడుగ; సత్వరమె నీదు
చరిత నంతయు నేను విస్తరము కాఁగ 112

వినఁగఁ గోరెదఁ; గాన విన్పింపు" మనుచు
నడుగ; ధరణిజ తన చరితాంశములను
నవనిఁ దను గన్న కథనుండి యతని నచటఁ
గన్న యంతటి వఱకును గప్పి యుంచ 113

నటుల వివరించి చెప్పె; న య్యసురుఁ డంత
మస్తకదశమ్ము నిరువది హస్తములును
నమరి యుండఁగ స్వర్ణ భూషాంచితుడఁయి
భయద గంభీర గాత్ర వైభవము వెలుఁగ, 114

స్వస్వరూపము నంది సాక్షాత్కరించి,
"కావి గట్టిన సన్న్యాసి గాను నేను;
కనుము నను సుందరీ, చక్కఁ గనులు విచ్చి
కరవు దీరఁగ; వినుము: నే ఘనుల కెల్ల 115

ఘనుఁడ; నిఖిలజగమ్ములఁ గాళ్ళ కడను
గట్టి వేసిన దిట్టను; గరళకంఠుఁ,
బార్వతీశ్వరు ఘోరతపఃప్రభావ
మహిమ మెప్పించి, బలహీనమానవులను 116

వదలి, ననుఁ జంప నేరికి వలను గాని
వరము నందిన వాఁడను; తరణి పొడువఁ
డడుగకయె నన్ను; వహ్ని నాయాజ్ఞ లేక
మండ వెఱచును; కదల నేరండు నంత 117

పవనుఁడును నేను గోరక, వనధి యడఁగి
స్తబ్ధ గతి నందు నా చండశాసనమున;
లక్ష్మి మాయింటి పనికత్తె; లంక నేలు
రాక్షసేశ్వరుఁడను నేను, రావణుండ! 118

త్రిజగముల లోనఁ గల సుందరీమణులను
దెచ్చి యుంచితి; నను మనసిచ్చి కొలుచు
రాణు లున్నారు వేలకు; రాణులకును
రాణివై వారు నీపాద రజము లనఁగ 119

కాళ్ళఁ బడి కొల్చుచుండ, లంకాపురమ్ము
నేల నావెంటరమ్ము జంకేల? రాముఁ
డెందులకుఁ గాని బైరాగి యెట్టి సుఖము
నీయఁ గలుగును? సుంతలో నెంచి చూడు" 120

మనిన, లక్ష్మణు, నిష్కల్మషాత్ము నట్లు
తిట్టి పోసిన పాపమ్ము ముట్టి నటులఁ
జిత్త మల్లాడ, ధైర్యమ్ము జెదర, మేను
వడఁకఁ, బల్కులు దడబడఁ బుడమి బిడ్డ, 121

"పాపి, వదరకు, రాముఁడు వచ్చు వఱకుఁ
బలుక కుండఁగ నుండి, యా పైని నీదు
ఘనత యెట్టిదొ నా కెఱుగంగఁ జూపి
నన్నుఁ గొనిపోవుదువు గాని; నిన్ను నీవె 122

యేల కీర్తించు కొందువు? చాలు నీ ప్ర
తాపములు; బాగువడుము న న్దాఁకి నంత
దగ్ధుఁ డగుదువు; రామకోదండ ముక్త
బాణరుచి నుంత యెఱిఁగిన వాఁడ వేని 123

సాహసించియుండవు పర్ణశాలఁ జొచ్చి
పతిని నిడియున్న పత్నిని పరిభవింప;
కాల మాసన్న మయ్యె రాక్షసకులమ్ము
పాడు వడిపోవ' ననుచు శాపమ్ము నిడఁగ, 124

రాక్షసేంద్రుని సహాన వీర్యమ్ము తఱుగ,
నొక్క కరమునఁ గొప్పును, నొక్క చేత
నూరువును బట్టి, యెక్కించి తేరు, చదలి
మార్గమును బట్టి చనెను దుర్వారుఁడగుచు. 125

కంటఁ బడినట్టి నగముల ఖగముల, మృగ
గణములను, భూరుహమ్ములఁ గాలువలను,
దుష్టుఁడట్టుల వంచించి దొంగిలించి,
తన్నుఁ గొనిపోయె నను వార్త దాశరథికిఁ 126

దెలుపఁ బ్రార్థించి; యా వనదేవతలకు
మస్తకము వంచి, యాకాశమార్గముననను
యసురపతితోడఁ జనుచు, జటాయువు నొక
మఱ్ఱి చెట్టునఁ గని దీనమానన యయి, 127

'లెమ్ము, ఖగరాజ రక్షింప రమ్ము, నన్న'
టంచు బతిమాల సీత, నిద్రించు నతడు
పిడుగు వడినట్లు లేచి, పెన్నడుల రేపి
ఱెక్కలను గొట్టి, ఱివ్వున బైకి నెగసి, 128

రథముపై వ్రాలి, లోఁజొచ్చి రావణు పయిఁ
బడి, మహాబలమును మోపి, పక్షములను
చఱచి, తెగఁగొట్టి, గోళ్ళతోఁ బెఱికి పెఱికి
కండరమ్ములఁ జీల్చి, రక్తమున ముంచి 129

కాయమును; ద్రుంచి శిరములఁ గరములఁ దెగ,
చామరగ్రాహకుల తోడ సారథిని ధ
రణికి నురలించి, కొట్టి ఛత్రమును, నుగ్గు
గా రథమ్మును బడఁద్రోసి, ఘోరముగను 130

కవచ కార్ముకములను ఖడ్గమును విఱిచి,
పోరి, యసురేంద్రు, రావణుఁ బుడమినిఁ బడఁ
జేసి బడలిన; తునిఁగిన చేతులును శి
రములు పొడచూప మరల, నా రక్కసుండు 131

పక్షి రాజును వధియించి, పక్షములను
ద్రుంచి, సీతను జంకను నుంచికొని యె
గసి వియత్తలమునకు, మార్గమ్ము నంది
పయనమై పోయి లంకలోఁ బడెను గడకు. 132

అంత నంతఃపురమ్మున కరిగి యతడు
సాధ్వి సీతకు నందున్న సర్వసౌఖ్య
సంపదలఁ జూపి, తనుఁగూడి స్వర్గసుఖము
ననుభ వింపఁగఁదగు నందు ననుచు ననున 133

యించి పదముల వ్రాలి ప్రార్థించి యడుగు
చుండియును నామె యొప్పకయుండ, నలిగి,
"పడఁతిరో, పట్టు విడవేని ప్రాణములకు
హాని కలుగును దప్పదు, హీన మాన 134

వునిఁ దలంచుచునున్న దేవునిగ నెంచి
దిక్కు సెడి దేవురింతువు; తెలివిని గొని
బాగు పడు దారి వెదకుము; పదియు రెండు
నెలల గడువిత్తు, నంత లోపలనె చక్కఁ 135

బడితివా, సుఖపడెదవు; పాడు పడుదు
పటులఁ గాకున్న, నీ యిష్ట మెటులొ యటులె
చేయు మిఁక" నని, కడమాట చెప్పి, పిలిచి
యతి భయంకరరూపుల నసుర పరిచ 136

రాంగనల, "మూర్ఖురాలి నీ యబలను గొని
చూచి తగుపట్టు, నిలిపి యశోకవనిని
వత్సరం బేగు దనుక కావలిని గాచి
యుండు" డని చెప్పి యనిపె, నత్యుగ్రుఁ డగుచుఁ. 137

"చంపి మారీచుఁ, దానేడ్పు జందమునను
నఱచి పడె నేలొకో వాఁడటంచు లోనఁ
గలవరించుచు, నెట్టి దుఃఖమున సీత
పడెనొ యంచును శంకించి, పొడమ దుశ్శ 138

కునము లెన్నియొ, వంతల మునిఁగి రాముఁ
డరుగుచుఁ దనకు నెదురైన యనుజునిఁ గని,
"ఏల వదినెను విడి యిటు లేగి వచ్చి
తివి? వచింపుము లక్ష్మణా, తెలివిమాలి," 139

యనిన; విధిలేక తానటు లటకు వచ్చి
నట్టి భంగిని వివరించె నాతఁ; డబల
పలుకుఁ బాటించి దాని నబ్బంగి నొంటి
దానిఁ జేయంగ రాదని వానిఁ దిట్టి; 140

"భయద భీకర మృగముల వాతఁ బడెనొ?
కాక యసురులె మ్రింగిరో? కాంచఁ గలనొ
లేనొ? నా ప్రాణసతి" నన్న లోని వగలు
దఱుము చుండఁగ త్వరపడి దారి గడచి 141

చని, జనస్థానమునఁ బడి, జనకసుతను
నాశ్రమంబునఁ గానక, యనువుఁ దెగయ
నున్న యట్టులఁ దపియించి, కన్ను దిరుగ,
"జానకీ, యెందు నుంటివి? ప్రాణనాథు 142

రామచంద్రునిఁ జేరఁగ రావె" యనుచు
కంఠమును విచ్చి పిలచియుఁ గడకు రామి,
పరిసర ప్రాంతముల చుట్టుఁ దిరిగి వెదకి,
యెందుఁ గానక యామెను కుంది క్రుంగి, 143

వంకలను, వాఁగులను మృగపక్షినివహా
ములను, గొండల గుట్టలఁ, దెలుపఁగోరి
ప్రాణసతి యున్న తలమును దీనుఁ డగుచు,
బదులు రాకున్న, నట నున్న పాదపముల 144

చెంగటకుఁ బోయి, సీత ప్రత్యంగ సౌష్ఠ
వమ్ము ప్రతిబింబితమ్ములై వాని యందుఁ
గానఁ బడచుండఁ గన్నీళ్ళు గ్రమ్ముచుండ,
"ధరణిజను బట్టిఁ యొసఁగుడు, దాఁచి యుంచఁ 145

దగ" దటంచును బతిమాలి, తెగని వగలఁ
దగిలి యారాటపడుచుండ, మృగవితతులు
చూచి, యాతని నొకసారి చుట్టి వచ్చి
మఱలి దక్షిణదిశనంటి యరుగఁ దొడఁగె. 146

"కనుము రామన్న, వన్య మృగమ్ము లివ్వి
కరుణ గొని సీత చనిన మార్గమ్ము దక్షి
ణాభిముఖమని సూచించు" ననిన లక్ష్మ
ణుఁడు, సుముఖుఁడౌచు, నంత రాముఁడును దక్షి 147

ణంపు దిశఁబట్టి వగచుచు నడచుచుండ
మార్గ మధ్యంబులో రక్తమాంసములును,
ఖండితశిరమ్ములును, బహుకరములును గ
వచములును, జాపములు, రథ భాగములును, 148

కంట బడ, గుండె పగిలిన కరణి దోచి,
ధరణిజను గొనిచనినట్టి దానవు లట
నామెకై పోరు సలిపి రటంచు భ్రమసి,
జయము గాంచిన యసురుఁడు సతిని మ్రింగి 149

యుండు నని నిశ్చయించి, యుద్దండుఁ డగుచుఁ
గాంచు మెల్లను గంపింపఁ గన్ను లెఱ్ఱఁ
వడుచు నుండఁగ, గడగడ వణఁకఁగ బుడమి,
దివ్యచాపము [illegible] సంధించి గుణము, 150

వాఁడి కోలను జెక్కిడి యౌడు గఱచి,
“జానకీ దేవి లేసి విశ్వము నశింపఁ
దగును! దానిని నేఁడె దగ్ధఁమ్మొనర్తు”
నంచు, నేయఁగ నుండ, రామానుజుండు, 151

యవని గావంగఁ జేడ్పడ నట్లు, రాము
నాపి, యటు సేయఁ దగని న్యాయముల ధర్మ
ములను వివరించి నడిపింప ముందు చనుచు,
దారి నడుమను చావసిద్ధముగనున్న 152

వానిని జటాయువును గని, వాఁడు తెలువ
ధరణిజాతను దానవాధముఁడు రావ
ణుఁడు హరించిన భంగిని, కడఁగి యతని
తోడ నాతఁడు ప్రాణమ్ము లుండువఱకుఁ 153

బోరిన విధమ్ము, దెలిపి యా పుణ్యమూర్తి
యసువులను వాయఁ గనుముందు; నటమటించి,
వానిఁ బితృ నముఁడన నెంచి, వహ్నిఁ బెట్టి
దహనకార్యాదికమ్ములఁ దగ నొనర్చి, 154

పైఁబడి గమించి, భయదమౌ వనిని జొచ్చి
క్రౌంచవనమును జేరి; రక్కసి నయోము
ఖిని సుమిత్రాత్మజుఁడు నాసికను జెవులను
గోసి వంపఁగ, మఱికొన్ని క్రోసులు సని, 155

తలయుఁ గాళ్ళను గడుపు లోపలనె దూర్చఁ
బడిన పర్వతరూపుని, గడుపు నురము
మాత్రమే కల్గియున్న దుర్మార్గు, నుదర
మున బిలనిభవక్త్రము, నురముసను నేక 156

నేత్రమును బొంది, భీకర నినదములను
బయలువడఁ జేసి, బహుదీర్ఘబాహువులను
సాచి, తమ్మునితోఁ దన్నుఁ జక్కఁ బట్టి
వక్త్రమునఁ జొన్పనున్న కబంధుఁ గరయు 157

గమ్ములను గత్తరించి, మోక్షమ్ము నొసఁగ,
శాపముక్తుం డతండును స్వస్వరూప
మంది, భాసితగాత్రుఁడై యవనిని విడి
యాకసమ్మున కెగయుచు, "లోకమాన్య 158

రామ, వందన మిడెద, నారాట పడకు;
పైకిఁ బయనించు మింక; పంపానరోవ
రమ్ము చెంగట ఋశ్యమూకమ్ము కలదు;
ఆ మహాద్రిని సుగ్రీవుఁ డనెడు ప్రబల 159

వానరుం డిష్టజనులతో వాస మంది
యుండు; వానినిఁ గని వానరుం డటంచుఁ
బలుచ సేయక, వానితో వహ్ని సాక్షి
కాగ మైత్రిని బడయుము; కలఁత మాపి 160

యతఁడు సీతను వెదకి నీ యండఁ జేర్ప
గలఁడ"టంచును, మఱుఁగ; మార్గమ్ముఁ బట్టి
బెంగ యొకసుంత వెలియ మతంగవనముఁ
జొచ్చి, శబరికి ముక్తిని నిచ్చి, సప్త 161

శరధులును వృద్ధ మునిజన స్నాన యోగ్య
మై కదలి వచ్చి యుండఁగ నందు, మునిఁగి
వాని లోనెల్ల రాముఁడు పైకి నడచి
చని మతంగసరస్సున స్నాన మాచ 162

రించి, తమ్మునితోఁ బయనించి, రాచ
యంచలును, నీటికోళ్ళు, మత్స్యములు, వన్నె
వన్నియల తామరలును, గల్వలును గలిగి
రమ్యమై యొప్పు పంపాసరస్సుఁ జేరె. 163



# కిష్కింధా కాండము

వృక్షసంతతి నెల్లఁ బుష్పిత మొనర్చి,
పక్షులను బాడఁ బురికొల్పి, బర్హిణులను
నాట్యగతులను దేలిచి, నవ్యగంధ
మధురమారుతములకును, మందగతులఁ 1

గఱపి వచరింపఁ బంపి, యక్కాన యెల్ల
దానెయై నిండి, పూర్ణమోదమ్ము పొంగ,
నంచరింపఁ దొడంగె వసంతఋతు కు
మారుఁ డనమానుఁ డౌచు మన్మథునితోడ. 2

రమ్యపంపాసరోవరప్రాంత మందు
మన్మథప్రేరితమ్ములై మానసమ్ము
లలరఁ బులుగులు సెట్టు కొమ్మలను గవలు
గవలు గాఁగూరుచున్నవి; కానలోని 3

జంతువులు గంతు లిడుచును జంటలు గొని
తనియ రమియించినయవి; పద్మముల వలచి
మధుపములు మూఁగినవి; పెను మ్రాఁకులను బె
నంగినవి చక్క లతలు; ప్రేమాంగి ధరణి 4

జాత కడలేని కతన విశ్వమునె రోసి
జానకీపతి విరహ తీవ్రానలములఁ
బడి తపించుచు, సామాన్యు వగిదిఁ బట్టు
దప్పి, శోకించుచుండెను దనువు దఱుఁగ. 5

చెట్టు చెట్టున కొక్కక సీత గానఁ
బడిన యట్టులఁ, జిలుకలు వలికి నంత
యామెయే చేరఁ బిలిచిన యటులఁ దన్ను,
భ్రమసి, యున్మత్తుఁడయ్యెఁ బావ మ్మతండు. 6

వీరవర్యుఁడు, ధీరగంభీరమూర్తి,
ధైర్యమేరువు, దశరథాత్మజుఁడు, రామ
భద్రుఁ డటు ధృతి సెడి కలవరపడుచును
నుండఁ గనలేక, గుణి లక్ష్మణుండు, వాని 7

వంతలను మాప, "నాయన్న, వగవఁ దగదు
పామరుని వలె నీయట్టి వాఁడు, వినుము:
'ప్రేమ చెడ్డది; దానినిఁ బెంచ రాదు;
పెంచుకొలఁదియు విరహము మించి వేచు. 8

అపరిమితమైన యట్టి స్నేహమ్ము గాల్పఁ
గలుగుఁ దడిసిన వత్తిని, కలఁత విడిచి
కార్య సాధకుఁడవు గమ్ము,' కంటి కందు
వడిన, రావణు నతిదిగర్భమ్ము నందు 9

దాఁగియున్నను వెలికీడ్చి, తలల దునిమి
చంపి వదినెను దెత్తును; చావ కుండ
నుండఁ డాతఁడు నేమని యుండ," ననుచు
శాంతి చేకూరఁ బలికి విచార ముడిపె. 10

నార బట్టలు గట్టి సన్న్యాసు లనఁగఁ
గానిపించియు దివ్యప్రకాశ భాన
మానులయి వెల్గు దశరథాత్మజులఁ గొండ
మాటులోనుండి కని భయమానసుఁ డయి, 11

తన్ను నొప్పని జేష్ఠ సోదరుఁడు వాలి
యనిపెఁ దనుఁ దాఁక వారి నటంచు భ్రమసి,
పవననందను, హనుమంతుఁ, బండితు, ఘను,
నాప్తతముఁ బంపె సుగ్రీవుఁ డరసి మఱల 12

వారి వృత్తాంతముల నెల్ల; వాఁడు నంత
స్వస్వరూపమ్ము మఱఁగించి, బ్రహ్మచారి
పగిది రూపంది పయనమై, వారిఁ జూచి
చకితుఁడై వందనం బిడి సాగిలపడి, 13

సవినయమ్ముగఁ బల్కులఁ జక్క దిద్ది,
"అడుగఁ దగునంచు నడిగెద నయ్యలార;
యలుగఁ బోకుఁడు; మీ రూపు లద్భుతములు;
అపరదైవాంశసంభవు లన నెఱిఁగితి; 14

కావి గట్టిన కరములు గాంతిఁ జిమ్మ
ఖడ్గములఁ గార్ముకమ్ములఁ గలిగి యుండు
కారణమ్మును నరయను; కారు మీరు
దానవులు, రాజరాజనందనులు; లోక 15

రక్షకులు, మీదు నామ వర్ణమ్ము లెవ్వి?
వంశ మెయ్యది? మిముఁ గాంచు భాగ్యము గనఁ
దండ్రి గా నోచినట్టి యుత్తముఁ డెవండు?
అడవి పాలైతి రేల? యియ్యెడకు వచ్చి 16

నట్టి పనియేమి? చెప్పు" డటంచు వేడ;
నన్న సెలవంది, సౌమిత్రి యతనిఁ జూచి,
"నన్ను లక్ష్మణుఁ డండ్రు; నా యన్న నితనిఁ
బిల్చెదరు రాముఁడని; మేము వీడ నట్టి 17

జంట సుఖదుఃఖముల రెంట; జనకుఁడు దశ
రథ నృపాలుఁడు; చంద్ర మార్తండ వంశ
జాతులము మేము; తండ్రి యాజ్ఞను శిరమునఁ
దాల్చి పాలింప వల్కలధారి యగుచుఁ 18

గాంతతో వనిఁ జొచ్చె నగ్రజుఁ; డితనినిఁ
గొలువ వచ్చితి నేనును గోరి వెంట
నంటి విడువక; మమ్ము మాయలను ముంచి,
వంచితులఁ జేసి, దొంగిలి వదినెను గొని 19

చనె, నిశాచరపతి సాహసమున; వాఁడు
రావణుం డను నీచుఁడు; రాము కృపను
శాపముక్తుఁడుగా నొక సత్పురుషుఁడు,
మమ్ము, చని గిరిఋశ్యమూకమ్ము లోన 20

వాన మొనరించుచున్నట్టి వానరకుల
ముఖ్యు సుగ్రీవుఁ గని సఖ్యమును గడింప,
నతఁడు సీతను వెదక సాయమ్ము సేయఁ
గలఁ డటంచును బంపిన కారణమున 21

వచ్చితిమి వానిఁ జూడఁగ నిచ్చ గించి,"
యనిన, సుగ్రీవు శత్రువై యగడు వెట్టు
వాని యన్నను వాలిని వధ్యుఁ జేయఁ
దగిన వీరులు దమయింటి తలుపు దట్టి 22

వచ్చె వేచి రటంచు లోపలనె పొంగి,
సత్పురుషులను శంకించి స్వస్వరూప
మును మఱుంగిడి యొక వటు వనఁగ,వారి
మోనగించుచు వల్కిన దోన ముడుగ, 23

నడుగులను బడి మన్నింపుఁ డనుచు వేడి
వానరుం డయి; దాఁచని భంగిఁ దనదు
చరిత నంతయు వివరించి సాంతముగను,
ఘనభుజస్కంధముల వారిఁ గొని ధరణిని 24

బాదములఁ దన్ని యెగసి పై బాటఁ బట్టి
కదలి చని, ఋశ్యమూక నగమ్ము పైని
వారి దిగఁబెట్టి సుగ్రీవు పంచ, వారి
చరిత నంతయు వానికి నరయఁ జెప్పె. 25

మర్కటశ్రేష్ఠుఁ డంత, నయ్యర్కకుల వ
తంసులకు మ్రొక్కి, తన జన్మ ధన్యమైన
యటుల భావించి, మృదుల పర్ణాసనములఁ
బఱచి యాసీనులను జేసి, పంచఁ గూరు 26

చుండి, శ్రీరామ చంద్రునిఁ జూచి, 'నన్నుఁ
గాన వచ్చిన దైవమ్ము కరణి నిన్నుఁ
గాంచితిని రామ, సుకృతిని; కలఁగ వలదు;
అన్ని దిశలను వెదకించి యనురుఁ డెందు 27

దాఁచి యుంచిన కాని నీ ధర్మపత్నిఁ
దప్పకను నిన్నుఁ జేర్తు; తథ్యమ్ము మాటఁ
దప్ప నిది రూఢి; యేమియు గొప్ప పని య
టంచు నెంచను; నన్ను వేధించు చున్న 28

శత్రుఁ డొకఁడుండె; శూరుఁ డసాధ్యుఁ డతఁడు
వాలి, నా యన్న; మృత్యురూపమ్ము నాకు;
వాని వధియింపఁ గలిగినవాఁడవేని
సంతసింతును, కరుణించి సాయపడుము. 29

సూర్యుఁడుదయించి యస్తమించుటకు మున్నె
యరిగి నాలుగు దిక్కుల యందు నున్న
జలధులను సంధ్య వారిచి చక్క మఱలఁ
గల మహాబలశాలి యా ఘనుఁడు వినుము. 30

అగ్రజుం డౌట, వానరు లంద ఱతని
వానరాధిపు నొనరించి, భక్తి గొలుచు
చుండ, నొకరాత్రి నతఁడు బరుండి యుండఁ
బత్నులను గూడి, తను మించు వాఁడు లేఁడ 31

టంచు, గర్వించి దుందుభి యన్న మహిష
రూపమున నున్న దుర్మతి, దాపురించి,
కాలు ద్రవ్వెను గయ్యమ్ము గావలె నని
యగ్రజుని లేపి; యాతఁడు నుగ్రుఁడగుచు, 32

వాని దాఁకఁగ బయటికి వచ్చి, గొప్ప
వృక్షమును వ్రేళ్ళతోడను బెఱకి, చేతఁ
బట్టి పైఁబడఁ బోయినఁ, బరుగు దీసె
వాఁడు, భయకంపితుం డయి; వానిఁ బట్టు 33

వాలి వరుగిడె; నేను నవ్వాని వెంటఁ
బడితి సాయమ్ముగా నుండ; పర్వత బిల
మార్గమును జొచ్చె దుందుభి మండి పడుచు
బిల ముఖమ్మున నను నిల్పి, ఖలునిఁ గూల్ప 34

వాలియును నేగె; నందె కావలిని గాయు
చుంటి నొక వత్సరము నేను కంటి తెప్ప
వాల్చ కుండఁగ; నా బిల ద్వారము విడి
వచ్చి నెత్తురు పొంగి పైఁ బాఱు చుండ, 35

హాత మొనర్చెను దుందుభి, యన్న ననుచు
వగచి, బిల ముఖమును బెను బండఁ ద్రోసి
కప్పి మఱలితి; మట్టు లగ్రజుఁడు చచ్చె
నంచు లోనెంచి, నన్ను వానరులు రాజుఁ 36

జేసి, నిర్బంధ పఱచి కిష్కింధ నేల
వలయు నంచును వేడఁ దప్పని విధాన
మకుటమును గొంటి; నంతలో మహిష రూప
రాక్షసుని దుందుభి నిజంపి రక్తసిక్త 37

గాత్రుఁడై వచ్చి వాలి, నన్గద్దె పైనిఁ
గాంచి కను లెఱ్ఱవడఁగ, నాగ్రహము మండ,
పట్టి యీడిచి పుడమిపైఁ బడగఁ ద్రోసి,
నాదు పత్నిని హరియించి నన్నుఁ దఱుమ 38

వచ్చి యిటు ఋశ్యమూక పర్వతతటమున
దాఁగి యుంటిని వెఱచి; మతంగ మౌని
శాపమున నిట కతఁడు రా నోపఁడన్న
ధైర్యమున, దిక్కు సెడి వేఱు దారి లేక. 39

వాని బలమును నెఱుఁగుదు గాని నీ ప
రాక్రమం బెట్టిదో కన రాక యుంటి;
సప్తసాలమ్ములను జొచ్చి చక్క నొక్క
శరము వెలువడ నాతఁడు దఱుమఁ గలఁడు; 40

మేరు వన నొప్పు దుందుభి మృత కళేబ
రమును గడకాలఁ దన్ని పర్వతము పైనిఁ
బడఁగ విసరిన మేటి! యెవ్వనికిఁ గాని
పట్టు వడనట్టి దిట్ట, నా వగతుఁ డరయ," 41

ననిన రాముఁడు తన్నరయంగ లేని
వానరశ్రేష్ఠు శంకలు వాయ నెడమ
కాలి కొనగోట నటను చెంగటనె కొండ
పగిదిఁ బడియున్న మృతకళేబరము నెగయఁ 42

దన్నె మింటికి; శరమును దఱిమె సప్త
సాలములఁ గూల్చి వెడల, నాశ్చర్య పడుచు
నందుఁ గల వానరోత్తము లందఱుఁ గను
నట్లు, సుగ్రీవు శంక మాయంగ నపుడె. 43

రామసుగ్రీవు లంత గరములఁ గలిపి
శపథములు చేసికొని యగ్ని సాక్షి గాఁగ
మైత్రి నందిరి; కడనున్న మారుతాత్మ
జుండు సంతోషఁ పడి చూచుచుండ; నంత, 44

'అన్న దమ్ముల మధ్య కయ్యమ్ము లుండ
వచ్చు నెన్నైనఁ; బాటింప వాని; కాని
యనుజు పత్నిని నగ్రజుఁ డపహరింపఁ
దగదు; క్షమియింప నేర నద్దాని నేను. 45

సిద్ధ పడి రమ్ము, మనము కిష్కింధ కరిగి
వాలి నిప్పుడె వధియించి వత్తు' మనిన
మానవోత్తము రాముని మాటలు విని
యాలసింపక యతనితో, నన్న యున్న 46

పట్టునకుఁ జని, నవ్యజీవమ్ము నంది
నటుల సుగ్రీవుఁడుగ్రుఁడై యడవి యద్రువ
సింహనాదమ్ము సేసెను; జిచ్చు లుమియు
చును ఘనుఁడు వాలి తాఁకి తమ్ముని దఱుమఁగ 47

వచ్చి పైఁబడె, పిడికిళ్ళ గ్రుచ్చి కొనుచు
వారు పోరాడఁ దొడగిరి పర్వతముల
జంట ఢీకొని నట్టుల! నడలి బడలి,
శక్తి చాలని వాఁడయి, చావు దప్పు 48

నేనియును జాలునని లోన నెంచి బరుగుఁ
బట్టి సుగ్రీవుఁ డన్నయ్య మెట్ట రాని
పట్టు లోఁబడె, రాముని వంచకుఁ డని
భ్రమసి, మాటను దప్పిన వాఁడగుటను. 49

రాముఁ డత్తఱి, "నేను నిర్మలుఁడ, నాదు
చిత్త శుద్ధి నెఱుంగవు; చెప్పెద విను:
అన్నయును నీవు గలసి పోరాడుచుండ
భ్రాంతి వడితిని; నందు నెవ్వఁడవు నీవొ 50

వాలి యెవ్వాడొ కనలేక; వాని రూపె
నీదు రూపును; భేదమే లేదు నిజము;
అభయ మిచ్చిన వానినే హతు నొనర్తు
నేమొ యని యూరకుంటి; నిందేమి తప్పు 51

కలదొ? యోచించి వల్కుము; కంఠమందుఁ
దాల్చి, యీ గజపుష్పిలతను గుఱుతుగ
మరల వాలిని దాఁకుము; మఱఁగి యుండి
తఱిమి యొక వాఁడి తూఁపును దాకఁ వాని 52

క్షణములోఁ గూల్తుఁ బొమ్మ"ని, శంకలఁ బడి
వందురుచు నున్న సుగ్రీవుఁ బంప, నతఁడు
సఖుని పల్కులలోఁ గల సత్య మెఱిఁగి
నందియము వాయ మరల కిష్కింధ కరిగె. 53

తన్ని పంపిన తమ్ముఁ డంతటను జోక
తన్ను దాఁకఁగ సింహనాదమ్ము సేయ
మరల మునుపటి యట్టుల; మండి పడుచు
వాలి చనఁబోయె, నాతని పత్ని తార 54

యాత్మనాథుని రక్షింప నాతురపడి,
'వలదు, పోకుఁడు; వినుఁడు నా పలుకు; నేటి
దినము దప్పించి యావల జనుఁడు; నన్ను
సంశయమ్ములు వేధించు; నంచలించు 55

మానసము : నొచ్చి వెన్నిచ్చి మఱలి నట్టి
వాఁడు పైఁబడ నింతలో వచ్చె ననినఁ
జిత్ర మనిపించు! మీ చేతఁ జిక్కు వడని
పగిది మీ రడు గిడలేనిపట్టు వెదకి 56

దాఁగి యున్నట్టి భీరు విత్తఱిని తానె
మన తలుపు దట్టి పిలిచెడు ననిన ననికి,
సాయ పడు నొక్క నవశక్తి సరస నుండె
ననుట యూహింపఁ దగిన సత్యమ్ముఁ; వింటి 57

ఘనుఁడు మన పట్టి యంగదుఁ డనఁగ, దశర
థాత్మజులు దైవతుల్యు, లుత్తములు, వీర
వరులు శ్రీరామ లక్ష్మణోభయులు వచ్చి
తమ్మునికి మిత్రు లైరని; తాఁకి వారిఁ 58

బోరి మఱలఁగ నేరరు మీరు; చలముఁ
బట్టి మీతోడఁబుట్టిన వాని శత్రు
వగుచుఁ బీడింప నేల? సఖ్యమ్ము నంది
కలిసి మెలఁగుట యుక్తమ్ముగాఁ దలంతు" 59

ననెను; చెవిటికి శంఖూది నట్లు వాలి,
యాలి మాటలు సెవిసోఁక నటుల చావు
స్వాగతం బిడుచుండఁగ నాఁగ లేక
యరిగి బలమెల్ల మోపి సోదరుని దాఁకె. 60

ఘనులు వా రిర్వురును భయంకర మహోగ్ర
గాత్రులై నిప్పుఁ జెఱగుచుఁ గనులఁ, బ్రళయ
భైరవుల మాడ్కి తాఁకి దుర్వారు లగుచు,
వక్షముల వజ్రనిభములౌ ప్రబల ముష్టి 61

ఘాతముల నిడి, కుటిల వక్త్రముల వెడలి
వచ్చి నెత్తురు గాఱ; బీభత్సు లగుచు
బండలను గొండలను, వృక్షకాండములను,
బట్టి పైకెత్తి విసరుచుఁ బ్రబ్బి పోరు 62

చుండ, నడవియె యల్లాడె గుండె లదర!
బెదరి చెదరుచుఁ బరుగిడె విపిన జంతు
సంతతులు, దిక్తటమ్ములు సంచలింప
జగతి గంపించె! వడ వడ చదలు వడఁకె. 63

కలఁడు కోదండ పాణి రాఘవుఁడు చెట్టు
చాఁటుఁ నను దాఁగి వాలిని సంహరింప
సర్వసంసిద్ధుఁడై యని, సాహసించి,
అంత కాలము సాధింప నలవి కాని 64

వాలితోఁ బోరి, బడలి పెంపడఁగ నడలి
పడఁగ నున్నట్టి సుగ్రీవు వగిదిని గని,
తడవు సేయఁగఁ దగదని తలఁచి, వాలి
వక్షమును దాఁకి చీల్పఁగ వాఁడి కోలఁ 65

నొక్కటిని వింట నంధించి చక్క విడిచె
దాశరథి; యంత యింద్రనందనుఁడు వీర
వరుఁ డజేయుఁడు, వాలి, పర్వతము భంగి
వసుధపైఁబడె, తార తాపమున మునుఁగ. 66

స్వర్గపతి వాని కిచ్చిన స్వర్ణ మాల
కంఠమున వ్రేలు చుండఁగ క్ష్మాతలమునఁ
బడియుఁ జెడనట్టి కాయసంపదను గలిగి,
వాలి, యప్పుడె తనముందు వచ్చి నిలిచి 67

యున్న శ్రీరామచంద్రుని గన్ను విచ్చి
కాంచి, "వంచించి ననుఁ జంప వలసినట్టి
కారణం బేమి రాఘవా? నేర మేమి
చేసితిని నీకుఁ జెప్పుము? చెప్పె నాదు 68

పత్ని, నే సోదరుని పైనిఁ బడఁగఁ బయన
మగుచు నుండఁగ నీ విట కనుజుతోడ
వచ్చి, సుగ్రీవ మైత్రిని బడసి వాని
ప్రాపుగా నుంటి వనియు, నా ప్రాణములను 69

బాపి, కూల్తు వనియును; నేఁ బాటి సేయ
కుండ, "నన్నేల చంపు రాముండు? వాని
కెట్టి యపరాధమును నెందు నింత సేసి
యెఱుఁగ, ధర్మాత్ముఁ డతఁడని యేగి వచ్చి 70

నాఁడ; నా నమ్మకము నేఁడు పాడు వడఁగ
వట్టి వధియించి నాఁడవు చెట్టు చాఁటు
నుండి, ప్రత్యక్షముగఁ బోరు గుండె లేని
భీరువన - నీదు పత్నిని వెదకి తెచ్చు 71

పనికి నేఁజెల్లనా? నన్నుఁ బంపి యున్న
పది తలల గిల్లి కొనగోట, భంగ పఱచి
యసురపతి రావణునిఁ జంపి, యవనిజ గొని
వచ్చి నీకిచ్చి యుండనా? పరువు మాయు 72

మాడ్కి వధియించితివి కదా! మహిని నున్న
వారి నెల్లను ఘనవేషధారి వగుచు
వంచితులఁ జేయుచుంటివి; పరమ ధర్మ
వర్తి వని యెంచి నినుఁ బొరవడితి"ననిన, 73

ధర్మ వీరుఁడు రాముఁడు, "ధర్మ మర్మ
ముల మహామునులైనను దెలియ నేర
రనిన నీకెట్లు తెలియు? సర్వజ్ఞుఁడైన
వాఁడు పరమాత్ముఁ డెఱుఁగును; పట్టు సెడని 74

పగిది ధర్మస్వరూపము వసుధ లోన
వరలఁ, బాలించు భరతుఁడు ధరణి నెల్ల;
వాని యాజ్ఞల కెందు లోఁబడిన మే మ
ధర్మవర్తుల ఖండించి ధర్మము నిల 75

నిలుపు చుందుము; తెలియక పలుకఁ బోకు;
పాపచింతన లేక నిర్బంధ పఱచి
యనుజు పత్నిని చేపట్టి యనుభవించు
చున్న దురితాత్మ, దుర్మార్గ నిన్నుఁ జంపఁ 76

దగిన ధర్మమ్ము నెంచి నిర్దయుఁడ నగుచుఁ
జంపితిని; నిన్ను నిఁకఁ జెట్టు చాఁటు నుండి
చంపఁగా నేల యంటివి; చక్క వినుము:
నరుని నటు చంపఁ దగదు; వానరుఁడ వీవు 77

కాన వనచరముల నెట్టి కరణి నైన
నేయఁ దగునన్న న్యాయమ్ము నెఱిఁగి మఱుఁగు
పట్టు లోనుండి నిన్నటు గొట్టితి" నని
బదులు పల్కినఁ, దెల్విని బడసి వాలి, 78

"అల్ప మర్కటజాతి నా దగుట నిన్నుఁ
దప్పుఁ దలఁచితి, క్షమియింపఁ దగును నన్ను;
చావు నీచేత గలిగె! మోక్షమ్ము నందఁ
గలను; ధన్యుఁడ నైతిని -కాంత తార 79

సాధ్వి; యుత్తమురాలు; నా చనవు పట్టి
యంగదుఁడు నా బహిః ప్రాణ మగును; వారిఁ
దగిన రీతినిఁ బాలింపఁ దమ్మునికిని
జెప్పి సాయమ్ము సేయుము, చేయి మోడ్చి 80

నిన్నుఁ బ్రార్థింతు రామ, నే మన్ను విడిచి
చనెద నిశ్చింతుఁడ నయి నిర్జరులఁ జేర"
నంచు రక్తమ్ము గ్రక్కి శ్వాసించి, విడిచి
ప్రాణముల, నేగె దివికిఁ బాపమ్ము వాయ. 81

వానరప్రముఖులును, నవతులు రోద
నమ్ము సేయుచు వెన్నంటి నడువ, వచ్చి
మలలు మార్మ్రోఁగ నేడ్చుచు, మన్ను పైని
మరణశయ్యను బడియున్న మగని దరిసి, 82

పలుక లేనట్టి బొందిపైఁబడి పొరలుచుఁ,
బగుల నురమును గరముల బాది కొనుచుఁ,
బరితపించిన తారను ప్రబల కాల
మహిమలను గర్మ ఫలముల మనను కెక్కఁ 83

జక్కఁ బోధించి యోదార్చి; శత్రు వగుచుఁ
దన్ని వంపుచు నుండియుఁ దఱచుఁ, దన్నుఁ
జంప నెన్నఁడు దలఁచని సత్పురుషుని
వంచితుని జేసి యటులఁ జంపించి నట్టి 84

పాప భరములఁ గ్రుంగి యెబ్బంగినైన
వారి దహియింపఁ బెట్టిన వహ్నిలోనఁ
బడి నశింతు నటంచును బలవరించు
వాని, సుగ్రీవు నెట్టులో బాట కీడ్చి, 85

శాస్త్ర రీతుల దహన సంస్కార కర్మ
లన్నిటిని సంగుదునిచేతఁ బిన్న తండ్రి
వంచ నుండఁగఁ జూచి చేయించి, వర్ష
కాల మరిగిన యంత శీఘ్రముగఁ దన్నుఁ 86

గలిసి కొని మాట నిచ్చిన కరణి ధరణి
జను వెదకు యత్నములఁ బడఁ జనునటంచుఁ
జెప్పి, తారను సంగదు చేతఁ బెట్టి
యంపి వానరపతినిఁ బట్టాభిషిక్తుఁ 87

డౌచు కిష్కింధ నేల భాగ్యములఁ దేలి
యాడుచును సతి రుమ తోడఁ గూడి; ప్రస్ర
వణ గిరి బిలమునందు నివాసము గొని
యుండెఁ దమ్మునితోడ రాముండు; నంత 88

కళల నీనుచుఁ గిష్కింధ గనుల పండు
వుగను రాజిల్ల; మంగళ ప్రభలు వెలుఁగ,
శంఖములు మ్రోఁగ, వాద్య నిస్వనము లలర,
జయ జయ ధ్వానములు మీఱ, సతి యయిన రు 89

మను మరలను చేకొని మోదమున మునింగి
నట్టి వాఁడయి సుగ్రీవుఁ డతిశయించి
మకుటమును నందె! దశర థాత్మజుని సాయ
బలమునను శాశ్వతముగ నిశ్చలత కుదుర. 90

వాలి దుందుభి వధియించి వచ్చి, తన్ను
గద్దెపై నుండఁ గాంచి యాగ్రహము నంది
కరములను బట్టి యీడిచి ధరణిని బడఁ
దన్ని, వత్నిని జేకొని, తఱుమ, బెదరి 91

పరుగులిడి, ఋశ్యమూక పర్వత బిలముల
జేరి యజ్ఞాత వాసమ్ముఁ జేయుచున్న
వానరుం డట్లు శ్రీరామభద్రు కృపను
రాజమకుటమ్ము నంది స్వర్గమ్ము నందుఁ 92

బడిన యట్టుల భావించి, పాన్పుల వయి
మధుర మధుపాన మత్తుఁడై, మహిని మఱచి
తారతోడను రుమతోడఁ గోరి నటుల
గూడి రతి సుఖములఁ దేలియాడ దొడఁగె. 93

భానుమూర్తిని, కరముల వసుధ పైనిఁ
బ్రాఁక విడువని భంగి నిర్బంధపఱచి,
తమన కారాగృహమ్మునఁ దలుపు దన్ని
బంధితునిఁ జేసి, కప్పు నభ్రమును గొప్ప 94

మబ్బు పిండుల దండులఁ బ్రబ్బ నడిపి,
కఱకు మెఱపుల కత్తుల కరముల గొని
పిడుగు టడుగులఁ బుడమిని నిడి యుఱుముచు
వర్ష ఋతురాజు కదలె దుర్వారుఁడగుచు. 95

పర్వతబిలమ్ములను మోది, ప్రబల వృక్ష
రాజముల నూచి, భీకరారావములతో
చండపవనమ్ము రేఁగ, వర్షమ్ము గురియ
నడవి జలమయ మయ్యె మహార్ణవ మన! 96

చక్క వర్షించి వర్షించి చాల బడలి,
తనువులను డించ కొండనెత్తముల నంబు
దములు, తమనమ్ము వెలియఁగ ధరణి గంటఁ
బడిన, దేఁటులు ముకుళిత పద్మములను 97

వదలి పుష్పిత నవ కదంబముల దరియ
నరుగు చుండఁగఁ, జిత్తము లలరఁ జాత
కమ్ము లానందమున మున్గ, గజముల గమి
కరిణులను గూడి చరియింపఁ, గవియ వలచి 98

యావులను గని యాబోతు లరుగు చుండఁ
జెలగి కేకారవమ్ముల సేయ వనమ
యూరములు, కేతకీపుష్ప సౌరభముల
నంది మారుతములు వీవ, నవనిజ కడ 99

లేని కతమున విరహాగ్ని లోనఁ బడిన
మానసము దగ్ధ మగుచుండ, మథనపడుచుఁ
గాలమును ద్రోయ రాముఁడు, కడచి వర్ష
ఋతు వరుగుదెంచినది `శరదృతు వపూర్వ 100

కళలఁ దేలుచు; నిర్మల సలిల భరిత
మై సరస్సులు శోభిల్లె! నమల చంద్రి
కలను నెల్లెడఁ జల్లి యాకసము నందు
సుందరుం డయి యుదయించెఁ జందురుండు!' 101

కడుపులోనున్న నీరమ్ము పుడమి పైనిఁ
బడఁగ వర్షించి భారమ్ము లుడుగఁ దెల్ల
వడుచుఁ గృష్ణాంబుదమ్ము లభ్రమునఁ దేలి
యాడు చందాన, బహుదీర్ఘ మగుచు మాన 102

నమ్ము నేచిన వానకాలమ్ము గడచి,
యవనిజాతను వెదకు ప్రయత్నములకుఁ
దగిన తరుణమ్ము రాఁగ, బాధా భరమ్ము
నడల, రాముని హృదయము శాంతి నందె. 103

అయ్యు, సుగ్రీవుఁ డమిత కామాంధకార
మందుఁ బడి కన్నుఁ గానని యట్లు తన్ను
మఱచి, 'మగువల తోడిదే మహి' యటంచుఁ
దలచి యంతఃపురాంతర తలము లందె 104

కాలమును బుచ్చుచును రామకార్యము నెదఁ
దలఁప కుండిన, యోపిక దఱిగి రామ
భద్రుఁ డనిపెను లక్ష్మణు నతని కడకు
నరిగి మఱలఁగఁ దగిన హెచ్చరిక నిచ్చి. 105

తప్పు మన్నింప మును నని తార, యతనిఁ
బ్రార్థనము చేసి వినయ మార్గమున శాంతి
పఱచ, సౌమిత్రి శాంతిల్లి, వానరాధి
పతిని నంధించి రాముని వంచఁ జేర్చె. 106

"ఆలసించితి నుంత; యాయాన వడకు;
మాడి తప్పని వగిది నే నాచరించి,
మిత్రకార్యమ్ము దీర్చెద; మిత్రమా, క్ష
మార్హుఁడను నేను, మన్నింప దగును నన్ను. 107

పర్వతోపమకాయులు, ప్రబల వీర
వరు లతిభయంకరులును, నేర్పరులు, గామ
రూపులగు వానరశ్రేష్ఠు, లే పనినయి
నను నులువుగఁ జేయఁగఁ గల్గు ఘనులు గలరు 108

వంపి వారిని, వనధి లోపలను నున్న,
యభ్రమున నున్నఁ, బాతాళమందు నున్న,
నవని పైనున్న, వెదకించి యండఁ జేర్తు
దవ్వకయ నీదు పత్నినిఁ; దావ వడకు" 109

మంచు రామునకును విన్నవించి, మర్క
టాధిపతి, ముఖ్యమంత్రుల కాజ్ఞ నిడెను,
వానర మహాబలముల సత్వరమె చేర్చి
యటకుఁ బంపఁగ; వారును నటులె సేయ; 110

కుతల మద్రువఁగ, కోటానకోట్ల ప్రముఖ
మర్కట భటాగ్రగణ్యులు మస్తకముల
వంచి నిలిచిరి యట కరుదెంచి; యంత,
దండులను దీర్చి, నాలుగు దండనాథు 111

లను వివేకుల, శూరుల నని పె నాల్గు
దిక్కులకు నేగి వెదుక మైథిలిని వాన
రాధిపతి; తూర్పు దిక్కున కరిగె వినతుఁ
డనెడు బలశాలి; 'హనుమంతుఁ డరిగె నంగ 112

దాది వీరులు తోనుండ నతిశయించి
దక్షిణపు దిశనంటి; యుద్దండుఁడైన
వీరవరుఁడు సుషేణుఁడు వెడలె పశ్చి
మ ముఖముగను; చనెను మహా మహాుఁడొకడు, శ 113

తవలి యను వాఁడు, ప్రబలి యుత్తరపు దిక్కుఁ
బట్టి; సీతను గనుఁగొని వారు మరల
వలయు నెలలోనఁ; దప్పిన ప్రాణములను
దీయు సుగ్రీవుఁడుగ్రుఁడై; తిరుగు లేదు! 114

వారి నటు పంపుచునె పిల్చి పవన పుత్త్రుఁ
బంచకును నిండు చనవుతో వానరపతి,
"మాదు కార్యమ్ముఁ దీర్ప సమర్థుఁ డీవె
మారుతీ, మంగళమ్ముగ మఱలి రమ్ము" 115

యనుచుఁ గొనియాడి యనిపిన, నతఁడె తగిన
వాఁడటంచును లోనెంచి, పసిఁడి యుంగ
రమును గుఱుతుగఁ జూప భార్యకును, వాని
చేతికిని నిచ్చె రాముఁడాశీర్వదించి. 116

అరిగి యుదయాద్రి వఱకును మఱలె వినతుఁ,
డస్తగిరి వఱకును జని యలసి మఱలి
వచ్చెను సుషేణుఁడును; శతవలియు నుత్త
ర కురు దేశమ్ముఁ జేరువఱకును నరిగి 117

మఱలె; దక్షిణ దిశనంటి యరిగి నట్టి
వాయు నందనుఁడును వాని పంచ నున్న
వానరశ్రేష్ఠులును బట్టు వదల కుండ
నతిభయంకర వింధ్యాచలాటవీప్ర 118

దేశములఁ బడి దారియుఁ దెన్నుఁ గనని
భంగిఁ, దిరుగాడుచును గున్కు పాటు లేక;
కొండ కోనల లోనను, గుహల లోనఁ,
గారు చీఁకట్లు చిమ్ము భీకర సురంగ 119

గర్భముల లోన వెదకుచు నిర్భయు లయి,
ధరణిజను నెందుఁ గానక, తనువు లలసి
దప్పి గొని సోల, జలమున్న తలముఁ జేరఁ
దలచి యరుగుచు, నొక మహాబిల మగుపడ 120

దాని జొరబడి చని చని లోని కరిగి,
తమన మయ మార్గమును బట్టి తరలిపోయి
బయటఁ బడి, స్వర్ణవృక్షసంపదలతోడఁ
గనుల విందిడి పిలిచెడు వనిని గనిరి. 121

అట్టి యనమాన వనమును నమర శిల్పి
మయుఁడు నిర్మించె ననియు, 'హేమ' యను సుంద
రాంగితో నతఁ డందు సౌఖ్యమ్ము నందు
చుండ, నతతమ్ము, గినిసి యింద్రుండు శావ 122

మిడిన విడి చనె ననియును నుడివి యందు
వాస మొనరించుచున్న తపస్విని ఫల
జలముల నొనంగి వారి నా బిలమును విడి
చనఁగఁ దోడ్పడి, కడలి గట్టునను విడిచె. 123

మగువ సీతను గనుఁగొని మరలఁ దగిన
గడువు కాలమ్ము తీఱె నయ్యెడనె! యవలి
కరిగి, సీతను గానక మరలి పోవ
జంపు సుగ్రీవుఁ డంచును జడిసి, యంగ 124

దాది వానర వీరులు వేదనాఁయు
తాత్ములై యందె నసువుల ధారవోయఁ
దలఁచి నిస్సారు లగుచు దర్భలను బఱచి
తనువులను బైని వ్రాల్చిరి ఘనులె యయ్యు. 125

అంగదుని ప్రోద్బలమున నధైర్య పడుచు
నటులఁ బ్రాయోపవేశులై యవనిఁ బడిన
వానరుల రామకార్యమ్ము భంగపడున
టంచు వాయుసుతుఁడు ప్రోత్సహించి పలికె. 126

తండ్రి, రామునిఁ బంప గాంతారములకుఁ
బత్నితో లక్ష్మణునితోడ, వాఁడును వని
నుండ, మోనమ్ము నను రావణుం డవనిజ
నవహరించిన విధమును, నతని బాట 127

నడుమ నెదిరించి పోరి ప్రాణములఁ బాసి
నట్టి పక్షి జటాయు వీ యవనిని విడి
నట్టి భంగిని, బత్ని యున్నట్టి పట్టు
నరయ సుగ్రీవ మైత్రిని నభిలషించి 128

యతని రాముఁడు సేరిన యట్టి తెఱఁగు
నంతయును జెప్పికొంచు నా యాన పడుచు
కడలి గట్టునఁ బడిన మర్కట భటులను,
చెంగటనె మహేం ద్రాద్రిపై చేరి యున్న, 129

పక్షి, జటాయువునకు నన్న, బాగఁ జూచి,
పల్కులను విని, తమ్ముఁడు, పాపి దాన
వాధమునిచేతఁ జచ్చిన వగిది నెంచి
బాధపడి లోన, ప్రాణాలఁ బాయ నెంచి 130

క్రిందఁ బడియున్న వానరు లందఱిఁ గని,
"మర్కటోత్తములార, నా మాట వినుఁడు;
నేను సంపాతి యను వాఁడ, దానవాధి
పతి వధింపఁగ నసువులఁ బాసి నట్టి 131

పక్షిరాజు జటాయువు, ప్రాణసముఁడు,
నా సహోదరుఁడగు; చిన్ననాఁడు మేము
భానుఁ బట్టఁగ నెగసి యభ్రమును జేర
నరుగ, సూర్యాతపమ్మున కాగ లేక 132

యనుజుఁ డల్లాడె! నపుడు నే నతనిఁ గావ
పక్షముల విచ్చి యర్కుని నడ్డు పఱచ
యత్న పడుచుండఁగను, ఱెక్క లగ్గి తగిలి
కాల వట్టూడిపడితి నీశైలము పయి; 133

తపసి నొక్కని నేను నిత్యమ్ము గొలుచు
చుండ, సంప్రీతుఁ డగుచు నతండు, 'రామ
కార్యమునకును తోడ్పడఁ గలిగి నపుడు
మఱల ఱెక్కల నంది, నెమ్మదిని బడయఁ 134

గల వటంచును దయగొని పలికి దివికి
నరిగె; నా పుణ్యవశమున నట్టి యదను
కలిగె నీనాఁడు; మీరింక కలఁత పడఁగ
వలదు; శ్రీరామపత్నిని, ఖలుఁడు రావ 135

ణుండు పెట్టిన చోటు నిందుండి నేను
జ్ఞానదృష్టిని గనుచుంటి; చాన యద్ది
యసుర కాంతలకును మధ్య నగడు పడుచు
నున్నయది లంకలోన కొండొక్క వనిని; 136

కలదు శతయోజనముల కావలను లంక
కడలి నడుమను; మీలోన ఘనుఁ డొకండు
సత్వరమె శరధిని దాఁటి చనిన కార్య
సిద్ధి కలుగు"న టంచును, చెప్పి, ఱెక్క 137

లందికొని పోయె; వానరు లంత వంత
వదలి ప్రాణమ్ములను గొన్న వగిది లేచి,
యట్టి ఘనకార్యమును జేయ నర్హుఁడైన
ఘనుని నొక్కని నప్పుడె కడలి దాఁటి 138

పోయి లంకను గాలిడి, పుణ్యవతిని
జానకిని జూచి, మరలఁగ సాగనంపఁ
దలఁచి యోజింపఁదొడఁగిరి తలలు గలిపి:
గజుఁడు, గవయుండు, శరభుఁడు, గంధమాద 139

నుఁడును, మైందుఁడునా, ద్వివిదుడుఁను, బ్రబలుఁ
డగు సుషేణుఁడు, వేర్వేఱ నందు నున్న
వారు వినఁ దమ శక్తులఁ బ్రకటితమ్మొ
నర్చి; రయ్యును, శతయోజనముల దాఁట 140

గలుగు వాఁడెవ్వఁడును నందుఁ గానఁ బడకఁ
యుండె; నంగదుఁ డూరకయుండ లేక,
"లంకఁ జేరఁగఁ గల, మరలంగ నేర
నేమొ శంకింతు ననె, దాన నేమి ఫలము? 141

వృద్ధ భల్లూక రాజు, వివేకి జాంబ
వంతుఁడంతట నేమియుఁ బలుకకుండ
దూరమున నొంటిపాటునఁ గూరుచుండి
యుండు హనుమంతుఁ గని, వాని దండ కరిగి, 142

'మర్కటేశ్వరు నాజ్ఞను మస్తకమునఁ
దాల్చి పాలించవలె; నీతి దప్ప నటుల
మనల నమ్మిన రాముని మనసు నొప్పి
వడని యట్టుల వర్తించ వలెను; నీవు 143

పండితుండవు, నావంటి వారు నీకు
ధర్మముల నెత్తి చూపఁగఁ దగదు; పవన
నందనా, కార్య భారమ్ము నందఁ గలుగు
ఘనుఁడు నీవొక్కఁడవె యిందు; కదల కుండ 144

కూరుచుండిన పని నెఱవేఱు నెట్లు?
చింత సేయుము నుంత; నేఁజెల్ల నెట్టి
పనికిఁ గడు వృద్ధుఁడౌట; నీ బలము నీకుఁ
దెలియ దింతకు, వినుము నేఁదెలియఁ జెప్ప: 145

శాపవశమున నొక్క యప్సరస యవని
నంజనాదేవి యన వానరాంశమందు
జన్మమును గొని ఘనునిఁ గేసరిని బెండ్లి
యాడి మనుచుండి, పని నొక్క నాఁడు సంచ 146

రించుచుండఁగ నొంటిమై, పొంచి చూచు
చుండి 'పవనుఁడు దరియక యుండ లేక
కదలి చల్లఁగ మెల్లఁగఁ, గడకు నేగి
యల్ల నల్లన వీచి సర్వాంగములను 147

దాఁకి క్రీడించె!' గర్భమ్ము దాల్చి యామె
నిన్నుఁ గన్నది; భానునిఁ జిన్న నాఁడె
పం డటంచును భావించి పైకి నెగసి
పట్టఁ బోవఁగ నీవు, చేడ్పడును భువి య 148

టంచు భయపడి, వాసవుఁడాగ్రహించి,
చేతి వజ్రాయుధమున నీ చెంపఁ గొట్టి,
ధరణిపైఁ బడ ద్రోసె! నీ తండ్రిఁపవను
డాగ్రహమ్మునఁ గదలక యాగ, సుర ల 149

తనిని శాంతింపఁ జేసి, రక్తఱిని బ్రహ్మా
శస్త్రముల నిన్ను నెవ్వరుఁ జంపలేని
వరము నొసఁగెను; పెను దెబ్బ వడియు నొక్క
పాటి సేయని నీ కాయ పటిమను గని 150

చావు నీ విష్టపడిననే సంభవించు
నీకు నని సురపతి పల్కె; తాఁకి నిన్ను
చంపనెవ్వనికిని గూడ సాధ్యపడదు;
పవనపుత్త్రుఁడ వీవు; జవమ్ము నంది 151

వారినిధి దాఁటి, లంక లోపలికి నరిగి
మరలఁ గలవన్న నిందు నమ్మకము నాకు
కలదు; పయనమ్ముగొ" మ్మనఁ, గడనె యున్న
వానరసమూహమును వాని ప్రతిభ నెఱిఁగి 152

పలువిధమ్ములఁ బ్రార్థింపఁ బయన పడఁగ;
తనకుఁ దెలియకయే తన్ను నాశ్రయించి
యున్న, యనుపమశక్తుల కుబ్బి గాలి
పట్టి యపుడె మహేంద్రాద్రి పైకి నెగసి 153

తావుగొన సంద్రమును దాఁటి, దానవపురిఁ
జేర, వానరకోటి జేజేలు సెప్ప
మాఱు మ్రోఁగెను దిక్కులు; వారిధి గద
లాడె, చెలరేఁగి, తరగ లల్లాడి విఱుగ. 154



# సుందర కాండము

రామభద్రుని హృదయగర్భమున నిలిపి
మానసికపూజ గావించి, మర్కటేశు
మదిని దలపోసి, తగ్గి నమస్కరించి
వాయువునకును, నవ్యజీవమ్ము నంది, 1

యాంజనేయుఁడు, పెంచి కాయమును, గొప్ప
గను త్రివిక్రమునట్టుల, కాలుగవను
పదిలముగ మోపి యద్రిపై, వలసి నంత
వాయువును బీల్చి వెల్వడవలనుకాని 2

భంగి బిగఁబట్టి లోననే; బాహువులను
బైకి నిగుడించి సూటిగ; వంచి కటిని
కడలి వైపుగ; చక్క దోకను విదిల్చి,
పదములను మోది పలుమార్లు, పైకి నెగసి 3

దాశరథి వింట సంధించి తఱిమి నట్టి
శరము కరణిని శరధిపై చదల నంటి
పక్షములు గొన్న పెనుగొండపగిది పవన
జవము గొని సాగె, కార్య దీక్షను వహించి." 4

మత్తమాతంగముల మాడ్కి మబ్బు పిండు
లడ్డు పడుచుండ మార్గ మధ్యమున; వాని
మస్తకమ్మునఁ గ్రుమ్ముచు మారుతాత్మ
జుండు వడిగొని పయనించు చుండఁ, గడలి 5

వానికిని సాయ పడ నెంచి పర్వతాగ్ర
గణ్యు మైనాకుఁడనువాని కడుపును విడి
గగనమున కెగయఁగఁ బంపెఁ; గడుఁ రయమున
నాతఁడును మింటి పైకేగి యా ఘనుఁ గని 6

"బడలికలు వాయ నుంత నా పైని విశ్ర
మించి యరుగు" మటంచు ప్రార్థింప, "తడయ
రాని కార్యమ్మ్మ రామకార్యమ్మ్మ, నిమున
మైన నాగఁగ వలనుకా" దనుచు బదులు 7

పలికి, ముందేగె నాతఁడు; వానవుండు
వాని శక్తిని గనుఁగొన వలచి, యతి భ
యంకరిని సురసను వాని నడ్డగించి
మ్రింగఁ బంపిన, నదియును మేను పెంచి 8

పర్వత బిలం బనఁగ నొప్పు వాయి విచ్చి
యతని మ్రింగఁగఁ బోయిన, నద్భుతముగ
నతఁడు కడుసూక్ష్మ రూపమ్ము నంది యామె
వక్త్రమును జొచ్చి వెల్వడి వయనము గొని, 9

పైకి నేగుచు, నీడను బట్టి యీడ్చి
పైన సంచార మొనరించు వారి తన్ను
దరియఁగను జేసి భక్షించు, దాని, 'సింహి
కను' వధించి నిర్విఘ్నముగను కడలిని 10

దాఁటి, యాలంబ పర్వత తటము పైకి
ప్రాలి, కనుచూపు మేరలో రాక్షసపురి
కానుపింపఁగ సంతోష మానసుఁ డయి
కన్నులను విచ్చి తిలకించఁ గడఁగె నతడు. 11

రమ్య హర్మ్యమ్ములును, నవరత్న ఖచిత
మైన మేడల వరున, లత్యంత, సుంద
రమ్ములౌ రాజవీథులు, రథ గజ తుర
గములు, కాల్బలములును, రక్షకభట నివ 12

హములు, నాకాశమును నంట నరుగు గొప్ప
కోట బురుజులు, ప్రాకారకుడ్యములును,
శరధు లనిపించు పరిఘలు, సలిల పూర్ణ
కమల కాసారములు, పుష్ప గంధములను 13

జల్లు నుద్యాన వనములు, సకల వృక్ష
సంపదలు గల్గి భూలోక స్వర్గ మనఁగ
భ్రమలు గొల్పుచు నేత్రపర్వమ్ము గాఁగ
కన్పడెను లంక, రావణు ఘనత చాటి. 14

అస్తమయ మయ్యె నంతలోః నర్కుఁ డపర
శైలమునఁ గ్రుంకె; నుదయించె చందురుండు;
అమలరత్న ప్రభల వెల్గునట్టి లంక
యతిశయించుచు మఱియును నంద గించ. 15

రామపత్నిని దాచిన రావణుండు
పైనిఁ బడవచ్చు రాముఁ డెప్పటికి నైన
నంచు కడు జాగరూకుఁడై యతిభయంక
రాసురుల, వక్రరూపుల రణవిశార 16

దులను, కన్నులు మూయక కలయఁ దిరుగు
చుండి లంకను గాచుచు నుండ సతము
నాజ్ఞ నిడ, వారు పురినెల్ల నాక్రమించి,
గండ్ర గొడ్డళ్ళ, నీటెలఁ, గార్ముకముల 17

బల్లెముల బాకులను, బెనుబండలఁ దరు
కాండములఁ జక్కఁ జేపట్టి కాలుఁ డనిపి
నట్టి కింకరు లన నొప్పి, జట్టులు గొని
సంచరింపఁ దొడంగిరి సందు విడక. 18

ఘనత కెక్కిన యట్టి లంకాపురవర
వైభవమ్మును, రక్షక భటుల భీక
రాకృతుల గనుఁగొని పవనాత్మ జుండు
భ్రమసి నిలిచెను కార్యభారమ్ము నెంచి. 19

చీమకును దోమకును గూడ చిక్కు పడక,
చొరఁగ రానట్టి లంకను జొచ్చి, ధరణి
జాత, సీతను గని, వైరిచేతఁ బడక
మరలు మార్గమ్ము నరయక మథనపడుచు 20

నతఁడు, "పట్టు పడుదును కాయమ్ము గొప్ప
దైన; మరలగ లేను సీతను గనుఁగొని
రామ భద్రుని కడకును; రాక్షసులను
వంచితులఁ జేసి చనవలె" నంచు లోన 21

నెంచి నిజరూపమును గుదియించి పిల్లి
కోఁతివలె మాఱి, దూఁకి యా కొండ నుండి
క్రిందికిని, వెల్గుచుండఁగఁ జందమామ
దారి గనుఁగొని లంకలో దూఱె, నెటులొ. 22

పురబహిర్ద్వారమున భయంకరి యొకర్తె
యడ్డుపడి లోని కేగఁగ నలవి కాని
భంగి వారించి యతనిని, "వానరాధ
మా, యెవండవొ నీవు? నెమ్మదిగ నన్ను 23

పాటి సేయక పురములోపలికి నేగ
సాహసించుచు నుంటివి, చావ నుంటి
వనుచు నెఱుఁగక, లంక నే నౌదు; నన్ను
గెలిచి చనలేవు లోనికి; నిలు, నిలు" మన, 24

కోఁతి పిల్లను నన్నిట్లు కొండ యంత
వాని నొనరించి వారించి పలుకఁ దగదు
నీ మహావైభవమ్ముల నేత్రపర్వ
ముగను దిలకించి మరలెదు ముదమునుగొని 25

వచ్చితిని, చూచి పోయెద వదలు" మనుచు
నవినయమ్ముగఁ బల్కియుఁ జక్కఁ బడని
దానిఁ బిడికిట గ్రుద్దిడి ధరణిని బడఁ
ద్రోసె నాతఁడు చంపుట దోష మనుచు. 26

రక్తమును గ్రక్కికొనుచును రక్కసి యది
చచ్చి బ్రతికిన తీరుగ నొచ్చి లేచి,
"సత్పురుష, నీదు శక్తి నిస్సంశయముగ
సాటి లేనిది! పెనుగ్రుద్దు చాలు; చావఁ 27

దన్నకుము నన్ను దయఁజూచి; 'దానవ కుల
మంతరించెడు దుష్కాల మరుగు దెంచు
వానరుఁడు నిన్ను దాఁకి పెంపడఁగఁ ద్రోయ
వసుధపై' నన్న కమలసంభవుని వాక్కు 28

తప్పరానిదియై నేఁడు తథ్య మయ్యె;
స్వేచ్ఛగను లంకలోఁబడి సీతను గని
మంగళమ్ముగ మరలుము మాన్య", యంచు
సాగ నంపెను వానిని సంతసమున. 29

ప్రథమ విఘ్నమ్ము దొలఁగిన వాయుసుతుఁడు,
పట్టు పడనట్లు లంక లోపలికి నరిగి,
వాడ వాడల నింటింటఁ బడి వెదకెను
రామపత్నిని; కనక యారాటపడుచు, 30

కొండ గుట్టల లోనను, గుహల లోనఁ,
గొలని గట్టుల సైకతస్థలుల గుల్మ
లముల నుద్యానవనులఁ గూపములఁ గలయ
వెదకియును గానఁ బడకున్న తుదకు సాహ 31

సమునఁ భీకర దానవ సార్వభౌమ
సదనమును జొచ్చె! నయ్యది సాటిలేని
చిత్ర జగతిగఁ దోఁచ, నిశీధవేళ
గడచి మార్తండుఁ డుదయమ్ము గాక మున్నె 32

యన్ని చోటుల వెదకి రహస్యముగను
బయట బడు టెట్టులో యని భ్రమసి నిలిచి,
ధైర్యమును గొని రాముని తలఁపు లందుఁ
జక్క నెలకొల్పి ప్రార్థించె సాయపడఁగ. 33

అర్ధ రాత్రమ్ముగా నట నసురు లెల్ల
దనుజ కాంతలతోఁ గూడి తప్ప త్రాగి,
యాడి పొరలుచు దొరలుచు నలసి నియమ
రహితులై కోఱలున్న వక్త్రములఁ దెఱచి 34

గుఱక లిడుచును నిద్రించు కరణి నెల్లఁ
గాంచుచునె పోయి, యెందును గానఁ బడని
కతన సీతమ్మ, యప్పట్టు గడచి వెడలి,
రావణాంతఃపురాంతర రమ్య తలము 35

నందుఁ జొరబడి, సకల సౌఖ్యముల కాల
వాలమై యది రతిరాజ భవన మనఁగ
కళల నీనుచుఁ గన్పింపఁ గాలివట్టి
కనులవిందుగఁ జూచెను దనువు మఱచి. 36

త్రిభువనమ్ముల లోఁగొన్న ధీరు, ననుప
మానతేజోవిరాజితు దానవకుల
చక్రవర్తిని రావణేశ్వరునిఁ గూడి
స్వర్గ సుఖములఁ దేలఁగ వలచి వచ్చి 37

నట్టి సౌందర్యవతులు కాయములఁ బూల
పాన్పులను వాల్చి, రతిసుఖపారవశ్య
గతుల చీరలు దొలఁగిన కరణి నైనఁ
గనక నిదురించుచుండినఁ గలలఁ గనుచు. 38

'నసురపతి మేలుకొనిన నయ్యంద గత్తి
యలను జూడఁగ లేమని యమల రత్న
దీపములు వారి సొబగుల తీరు లరయు
చున్న యట్టుల వెలుఁగుచు నుండె నందు'. 39

ధనపతిని గుబేరుని గెల్చి ఘన విమాన
రాజమును బుష్పకమ్మును రావణుండు
లంకలోఁ దన యింట విలాసవస్తు
వనఁగ నిలువఁగ, నచట నయ్యది, యపూర్వ 40

శోభలను జిల్కుచును నొప్పి చూపరులకు
కనుల విందిడి యతని పరాక్రమమును
చాటుచుండినయటుల ప్రశస్త మగుచు
కానఁ బడినది చిత్రమై కనుల ముందు. 41

పరిమళద్రవ్యములు పాన పాత్రములును,
పలురకమ్ముల మధుకుంభములును పక్వ
ఫలములును, రుచికరములై వండఁ బడిన
మాంసములు, పిండివంటలు, మధురమైన 42

పాయసమ్ములు నందున్న వారు వలసి
నంత సేవించి తిని తృప్తి నంది వదలి
వేయ వృధగను బడియున్న విధమును గని
వాయుపుత్త్రుఁడు దనుజ సంపదల నెఱిఁగె. 43

పట్టు పీతాంబరమ్మును గట్టి మంచి
రక్త వర్ణ గంధమ్మును రాచి మేన,
రత్న భూషల పసిఁడిహారములఁ, దాల్చి
సన్న జాజుల మల్లెల సంపెగలను 44

జల్లి యున్నట్టి క్రొంబట్టు శయ్యపైని
పట్టెమంచానఁ బర్వతోపముఁడు రావ
ణుండు సుఖనిద్రలోనను నుండెఁ, జుట్టు
వలచి కొలిచెడు పలుపతివ్రతలు వాని 45

వలచి నట్టుల మెప్పించి, వలపు సుధలఁ
దనియఁద్రావించి తమ తమ తల్పములను
వ్రాలి యలఁతలు వాయఁగ పరిసరముల
మఱచి నిదురించుచుండ, నెమ్మదిని బడసి. 46

అందు నొక దివ్యసుందరి యనుపమాన
యై మహాపతివ్రతయన నమరియుండఁ
గాంచి మారుతి సీతయే కాఁదగునని
తలఁచి, మానస ముప్పొంగఁ దాండవించి, 47

యంతలో సాధ్వి జానకి యచట నట్లు
వరుని చెంగట భూషణభాసితయయి
వంతలను వీడి మృదులతల్పమ్ము నందు
హాయిగను బండి నిద్రించ దంచు మరల 48

మతిని సరిదిద్దుకొని, లోన మగనవడుచు,
నామె నెందును కనలేక నటమటించి
సంక్షుభిత మానసుం డయి శంక లొదవ,
"ధరణిజను గొని జలధిని దాఁటు చుండ 49

రావణుఁడు, నీటఁ బడియెనా? రాముని విడి
రాక్షసుల మధ్య మనలేక బ్రతుక రోసి
ప్రాణములఁ బాసి, వసుధనే వదలి చనెన
రామ సహధర్మచారిణి? యేమి యయ్యె? 50

కలయ వెదకియు నెందును గానఁ బడని
కారణం బేమి? నను నొక ఘనుఁడటంచు
నమ్మి సత్కార్యభారము నాదు పైనిఁ
దగుదు నంచును మోపెట్టి తరలఁ బంపి 51

నట్టి రామ సుగ్రీవుల యండ కరిగి,
దానవుని రాజ్యమున నెందుఁ గానఁ బడక
యుండె జానకి యందునా? యుర్విని విడి
చనిన దందున, తప్పు: భూజాత మరణ 52

వార్త విని రామభద్రుఁడు బ్రతుక లేఁడు;
మనఁడు వానిని విడిచి లక్ష్మణుఁడు; వారు
చనిన వానరపతియును జచ్చు; పతినిఁ
బాసి రుమయును దారయు బ్రాణములను 53

బాపికొందురు; తమ్మేలు వాఁడు లేని
కారణమ్మున వగచి మర్కట నివహము
మడియు; నేనింక నచటికి మఱలి పోయి
చేయు పని యేదియును లేదు; తోయధిఁ బడి 54

చచ్చుటే చాల మంచిది, సత్పురుషుల
చావు దప్పింప" నని నిరుత్సాహపడి త
పించి యొక కొంత తడవు, జపించి రామ
నామమును, ధైర్యమంది దైన్యమ్ము మాయ, 55

"పరులు చొరరానిచోట గుప్తముగ నెందొ
ధరణిజను దాఁచి యుండును దానవపతి
మరల వెదకెద," నంచు నసురుని యిల్లు
వదలి, ప్రాకారమును దాఁటి బయటఁ బడెను. 56

విరియఁగాయుచునున్న జాబిల్లి పాల
వెన్నెలలువెల్గు లోనఁ గన్పించె రక్త
వర్ణ పుష్పయుతాశోక వనము! సీత
దానఁ గన్పడునని చొచ్చె దాని నతఁడు. 57

చైత్రరథమును మఱపించి, స్వర్గ నంద
నమును దలఁదన్ని, యావని నమ్ర వృక్ష
సంపదలఁతోడ, వివిధపుష్పములతోడ,
పద్మకాసారములఁతోడఁ, బరువు సిలుకు 58

పసిఁడి తిన్నెలతోడ, సొంపైన మంది
రములతోడను బలుకు కీరములతోడ,
నాఁడు నెమళులతోడను, పాడుచున్న
కోయిలలతోడ, ముదమును గూర్చుచుండ, 59

నతఁడు స్వేచ్ఛా విహారియై యందు నెల్ల
కడలఁ దిరుగాడి, సీతను గానక యొక
శింశుపావృక్షమును నెక్కి, చిక్కు వడని
కరణి నెలకొనెఁ గాయము గప్పి యుంచి. 60

అతిభయంకరరూపిణులైన రాక్ష
సాంగనలమధ్య వనగర్భమందుఁ నచట,
గంటఁదడిపెట్టి యేడ్చుచు, కాఱు మబ్బు
గముల మఱఁగిన చందురు కరణిఁ గానఁ 61

బడిన యొక తన్వి: యటకుఁ దన్బంపు ముందు
దాశరథి చక్క వర్ణించి తనకుఁ జెప్పి
నట్టి లక్షణముల నెల్ల నంది యామె
తనరు చుండిన, సీతయే యనుచు నెంచి 62

పరమముదితాఁత్ముఁడై ఱెప్పఁ వాల్చ నటులఁ
దన్మయుం డయి కనుచుండ; ధరణి సుతను
స్వప్నమునఁ గని పుష్పతల్పమును వదలి,
పట్టు పుట్టమ్ములను గట్టి, పసిఁడి నగలఁ 63

దాల్చి యందమ్ముగను దీరి; దండ నున్న
పత్నులను లేపి, తనతోడఁ బయన వఱచి,
కనక కరదీపములఁ గొని ఘనులు ముందు
నడచుచుండఁగ; వేదనినాదములును 64

వాద్య ఘోషలు సెలఁగ, రావణుఁ డశోక
వనిని జేరెను రాముని పత్నిని బ్రతి
మాలి నెబ్బంగి నైనను మనసు మార్చి
వశ్య నొనరించికొని సుఖపడఁగ దలఁచి. 65

కామదాహము మించ రక్కసుఁ డతండు
తన్ను దరియగ వచ్చుచునున్న బెదరి
జానకీ దేవి, శ్రీరామచంద్రు నెదను
దలఁచి తలవంచుకొనెఁ దాపతప్త యగుచు. 66

ధరణిజను జేర నరిగి యా దానవపతి,
"కాడు వీడుగ, నారను గట్టి యాకు
లలములను దిండిగను గొని నిలువు పెంచు
నట్టి బైరాగి రాముని యండ నుండఁ 67

గలుగు సుఖమేది యోచించి తెలువు మింత
భయదసాగరమును దాఁటి వాఁడు లంకఁ
జేరిఁ ననుఁ దాఁక నోపఁడు; చేరఁ గలుగు
నేనియునుఁ నిన్ను జేపట్టి ప్రాణములతొ 68

మరలనే లేఁడు; వినుము నా మాట; నన్నుఁ
గూడి సుఖపడు" మంచును వేఁడి యామె
మనను మాఱకయుండిన, మండి పడుచు
నరస నున్నట్టి దనుజ పిశాచినులను 69

బిలిచి, గడు విచ్చెదదను రెండు నెళలు; దీనిఁ
జక్కఁ బడకున్న, దయవీడి చంపి తినుఁ" డ
టంచు శాసించి యరుగ; భయంకరులయి
వారు చుట్టును మూఁగుచు, పరమ సాధ్వి 70

జానకిని దారి కీడ్వఁగ, "చక్కఁబడుము
నెత్తి వ్రాతగ మాపాలి మృత్యు వగుచు,
దాపరించితి వేలకో? తఱిగినే నిన్ను
ముక్కలుగఁ గోసి తిందుము ముష్కరతను 71

బెంచి మా ఈని కోర్కె చెల్లించ వేని
భాగ్యముల వట్టు; కమల సంభవునిచేత
వరములను గొన్న బలశాలి; వన్నె కాఁడు,
పిలువఁ జేదయ్యెనా నీకు? వెఱ్ఱి దాన 72

విడుము నీ వట్టు; మా నోటఁ బడక స్వర్గ
సౌఖ్యముల నంది మనుము-విచారవడకు"
మనుచు బెదరించు చుండఁగ; నందు కలలఁ
గని త్రిజట యను వృద్ధరాక్షసి యొకర్తె 73

కలఁగ నిద్దుర బెదరి మేల్కాంచి తోడి
వారలను జూచి, కాయమ్ము వడఁకుచుండ,
"కంటి దుస్స్వప్నముల నేను; కడలి దాఁటి
రాఘవుఁడు లంకలోఁబడి రాక్షసులను. 74

జంపి రావణు బలిగొని చన్న యటుల
సాధ్వి సీతను జేపట్టి సంతసమున;
రామపత్నిని, దీని, నారాట పెట్ట
వలదు; దవ్వులనుండి దైవమును నమ్మి 75

కాచి యుండుట తగు" నన; కాఁదగునని
వారు భయపడి సీతను వదలి చనిరి
దవ్వులకు; నామెయును నంత తన్నెఱుఁగక
కదలి మారుతి యున్న వృక్షమును జేరె. 76

తాను వెదకుచు నుండిన తరుణి తన్ను
దరియగను వచ్చి తానున్న తరువు క్రిందఁ
దావు గొని యుండఁ జూచి, మోదమున పొంగి
తనుఁగనెడు భంగి నామె దృష్టిని మరల్ప 77

కర్ణములఁ బడ శ్రీరామ కథను జెప్ప,
చిత్తము చిగుర్ప, లో మండు చిచ్చునార్పి
శాంతి చేకూర్చు నున్న యా సచ్చరితను
దనకు విన్పించు నుత్తముఁ గనఁగ నామె 78

చూపులను బైకి సారించి చూచి యొక్క
మర్కటమ్మును, రాఘణు మాయ యంచుఁ
దలఁచి తలవంచి, మునుపటి వలెనె, మరల
చింతలోఁబడి కూర్చుండె చేష్టలుడిగి. 79

అనిల సుతుఁడామె మాయాఁ స్వరూపుఁ డంచు
దన్ను శంకించి జడియుచు నున్న పగిది
నెఱిఁగి, సత్యమ్ము వివరింప దరువును దిగి
యామె ముంగల నిలిచి, శ్రీరాముఁ దలఁచి, 80

వందనం బిడి వినయ భావమ్ము విరియ,
"మాతరో,రాముదూతను, లాతి వాఁడఁ
గాను, నమ్ముము; దుష్టుఁడు దానవపతి
నిన్ను దొంగిలి రాముని కన్ను గప్పి, 81

చనిన, నీ పతి మతిసెడి మనను లోన
మనను నిల్వక యున్మాదుఁడనఁగ నిన్ను
పలువిధమ్ములఁ బలుచోట్లఁ గలయ వెదకి,
వచ్చి కిష్కింధ నేలెడు వాని, మాదు 8

తేని సుగ్రీవుఁ గనుఁగొని, వాని తోడ
సఖ్యమును నంది, యాతని శత్రువైన
వాలి నొక కోలఁ గూలిచి, పత్నియున్న
పట్టు వెదుకఁగ సాహాయ్య పడఁగ గోర; 8

వానరేంద్రుఁడు పంపె నేర్పరుల నాల్గు
దిక్కులకు నిన్నుఁ గనుఁ గొని చక్క మరల;
వచ్చితిని దక్షిణపు దిశఁ బట్టి నేను
తోడుగాఁ గొని కొందఱ; త్రోవ కడ్డు 84

పడిన జలనిధి, నాతోడ వచ్చినట్టి
వారి నందుండు నిలిపి, నే వారినిధిని
దాఁటి లంకను జొరఁబడి తరణి క్రుంక
తమనములు క్రమ్ముకొనుచుండ, దాఁగి దాఁగి, 85

చొంఁగరానట్టి చోటులఁ జొచ్చి చొచ్చి
చూచి నిన్నెందుఁ గనక నశోకవనిని
గడకుఁ జేరితి నిటుల; రాక్షసుఁ డతండు
దరియ నినుఁ జేరి నిర్బంధ పఱచి, విసిఁగి, 86

యలిగి నినుఁ జంప శాసించి యరిగి నట్టి
పగిది నంతయుఁ గనుచుంటి, వగవ కమ్మ
మరలి నే నేగి నీదు సేమమును రామ
భద్రునకుఁ జెప్పి వానర బలముతోడ 87

పయన మొనరించి కొని వత్తు; పది తలలను
దఱిగి రావణు వధియించి తప్పకుండ
సత్వరమె నిన్నుఁ జేకొని సంతసమున
మరలు నీ పతి; సుంత నెమ్మదిగ నంత 88

వఱకు నోపికఁబట్టి యిప్పట్టు నందె
యుండఁ గలిగినచో వేచి యుండు; మట్లు
కానిచో నిన్ను నా భుజస్కంధము పయి
నిలిపి యవలీలగను జలనిధిని దాఁటి 89

చని యివుడె రామచంద్రుని సన్నిధి నిడఁ
గలను రొ'మ్మనుచును, మహాకాయము గొని
దర్శనం బిచ్చి, తను నమ్మఁ దగిన యట్లు
రాము రూపాతిశయముల, రమ్యగుణ వి 90

శేషములఁ జక్క వర్ణించి చెప్పి, చిత్త
మునకు నెక్కఁగ, తన్నట కనువు నవుడు
దాశరథి నతికిని జూవఁ దగు నటంచు
నప్పఁ జెప్పిన యంగుళీయకము నొసఁగె. 91

వాని వల్కుల చేఁతల వాలకములఁ
జక్క పరికించి, నిర్మలస్వాంతుఁ డంచు
నమ్మి, యుంగరమును గొని నాథుఁ గాంచి
నటులు మురియుచు, కనులకు నద్దు కొనుచు, 92

వాయుసుతుఁ గని జానకి, "నీ యుదార
మాననమ్మును నెఱుఁగక మాన్య, నిన్నుఁ
దప్పఁ దలఁచితి, మన్నించి నొప్పి వడకు
మయ్య, యేరిని నమ్మ శక్యమ్ము కాని 93

పాడు రాక్షసరాజ్య గర్భమునఁ బడితి
ప్రాణనాథుని విడనాడి; పలువిధముల
మాయలను బన్న కలుగు దుర్మార్గులున్న
మంచియును చెడ్డ కాఁగఁ గన్పించు నాకు; 94

సేమమా రామ మూర్తికిఁ? జెంత నున్న
వాఁడె సౌమిత్రి? నను బాసి వనుల లోన
వాడెనో, మాడెనో, శోక భారమునను
గ్రుంగి కృశియించెనో, చాల కోపపడెనొ 95

ప్రాణ కాంతుఁడు? క్షమియింప వలయు ననుము;
మాయలేడిని వలదన్న, మంకు పట్టు
పట్టి తెమ్మన్న పాపము పండి, తగిన
పగిది శిక్షించె ననుము; పావనుని, ఘనుని, 96

కల్ల కపటము లెఱుఁగని చల్ల నైన
వాని మఱఁదిని నాథునిపైని మమత
కనులు గప్పఁగ దూఱితిఁ గావరమునఁ
దప్పు మన్నింప వేఁడు మాతనిని; తెలివి 97

దఱుగ నాయంతకును నేనె నరకవాన
మంది కొంటిని; గతి లేక మందమతిని
గలఁగు చుంటిని; మోక్షమ్ము కలుగు దారి
కానఁ బడలేదు పాపిని గాన నేను. 98

రాము నంతటి వానికి రాణి నయ్యు
రాక్షసునిచేతఁ జిక్కి దుప్ప్రాప్తి కలిగె!
కొఱివి చేకొని తలగోకి కొంటి నయ్య!
యాఁడు తెలివికి నడ్డేది యన్న వగిది. 99

చూచితివి కాదె నా చుట్టుఁ గాచియున్న
కటిక రాకాసి మూకల? కాలు దూత
లనఁగ వేధించు చుందురు, వినఁగ రాని
విధము లాడుచు నెపుడు నన్వేడవ నట్లు. 100

పడఁగ రానట్టి వీరల బాధ లొకట;
పాపి రావణు దుష్టప్రలాప మొకట,
ఆర్పఁగను గాని విరహ తాపాగ్ను లొకట,
నన్ను వేధించు ననుము; నా నాథుని గని, 101

రమ్ము నీమేలు మఱవను బొమ్మ" టంచు
నానవాలుగఁ బతి చేతి కంది యీయఁ
దనదు చూడామణిని వానికిని నొసంగి
వంపె దీవించి; యతఁడును వందన మిడి, 102

యామె సెలవంది చనుముందు నసురపతిని
కాంచి యాతని హృదయమ్ము గని మఱలుట,
తగు నటంచును దలఁచి భూతల మద్రువగ
నఱచి, వృక్షమ్ములను గూల్చి, యమలము లగు 103

పద్మకాసారములఁ లోనబడి కలంచి,
విరుల వెదజల్లి, ఫలముల గొఱికి విసరి,
సౌధముల నెల్లఁ బడఁగొట్టి, చావఁ దన్ని
వంపి వనపాలకులను, దుర్వారుఁ డగుచుఁ 104

నా యశోకవనమ్మున నన్ని కడలఁ
దానయై సంచరింపఁగ; దనుజ భటులు
వరుగు లిడి చని రాక్షసేశ్వరుని కడకు
దండ మిడి, వనిలోని వృత్తాంత మెల్ల 105

విన్నవించిరి; దానవవిభుఁడు నంత
నలిగి నిరుపమవీరుల నతని మద మ
డంచి మరలఁగఁ బిల్చి శాసించి వంపె
ననిలసుతు నొక్క సామాన్యుఁడంచు నెంచి. 106

శస్త్రముల నంది వారెల్లఁ జని పవనజు
తోడఁ బోరాడఁ దొడఁగ, వ్రేళ్ళూడ గొప్ప
వృక్షముల నవలీలగఁ బెఱికి తలలు
వగుల వారిని బుడమిపైఁ బడఁగ మోది 107

యనువ మృత్యుగృహమ్మున కతఁడు, చావు
దప్పి మిగిలిన కొందఱు దానవభటు
లతిరయమ్మునఁ, బరుగిడి యసురపతికి
నరయఁ జెప్పిరి వీరుల మరణవార్త. 108

రవిలి మండ దొడంగ నాగ్రహమహాగ్ని
రావణుం డుగ్రుఁడగుచు మర్కటమును హాత
మార్చి రాఁబంపె ఘనుని బ్రహస్త పుత్త్రు
జంబుమాలి యనంబడు శౌర్య నిధిని. 109

చైత్రప్రాసాదమును నగ్నిహోత్రునకును
నాహుతి నొసంగి, యందున్న యసుర భట శ
తమును గూలిచి, వనబహిర్ద్వారముననుఁ
బలి గొనఁగ దాఁక వచ్చిన వారి నెల్లఁ 110

గాచి యుండిన మారుతి; కాల్బలములు,
రథగజమ్ములు, హయములు రా వెను బడి
శస్త్రముల నంది ప్రబల తేజస్వి యగుచుఁ
బయనమై జంబుమాలి యప్పట్టు సేరి, 111

శంఖములు మ్రోఁగ, రణభేరి నందడింప,
వాయుసుతు దాఁక దూఁపులఁ బాఱ విడిచెఁ
బట్టు విడుపులు దెలియ రానట్టి పగిది
గాలుఁ డన భీకరుం డౌచు కానిపించి. 112

అచల సన్నిభుఁడగుచు గాయమును బెంచి
యాకసమునకు నెగసి భయమ్ము గొలిపి,
యంతలో సూక్ష్మరూపమ్ము నంది యవని
పైనిఁ గనఁబడి, మరల నభ్రమునఁ దోఁచి, 113

కొండలను బెనుబండల గొప్ప గొప్ప
తరువులను నినుప గుదియలద్వార బంధ
నములఁ దలుపుల దీర్ఘ యూపములఁ జేత
బట్టి వినరుచుఁ జెలఁగి బీభత్సగతుల 114

ధ్వంస మొనరించి నాలుగుదండుల, కడు
భయదుఁడై జంబుమాలి పైఁ బడి వధించె
వాయు సుతుఁ; డంత దానవపతి యనుఁవగ
సచివనందను లేడ్గురు వచ్చి యతని 115

దర్పమున తాకి, పోరాడి ధరణిఁ బడిరి
దెబ్బలను దిని; యావలఁ దేరు లెక్కి
యైదు దళపతు లరుదెంచి, యని నొనర్చి
తనువులను మాపి కొనిరి యుద్దండు లయ్యు. 116

రావణుని చిట్టి పట్టి పోర్పడయఁ గలుగు
తఱిని గనిపెట్టి యున్న యుత్సాహి, బాల
వీరుఁ డక్షుఁడు, జనకుఁడు వెడలఁ బంపఁ
బయనమును గొని చతురంగబలసమేతుఁ 117

డగుచు నరదమ్ము పై నుదయార్కు భంగి
ప్రభల వెలిఁజిమ్ముచు నశోకవనినిఁ జేరి
ధీరగంభీరు హనుమంతుఁ బాఱఁ జూచి
బాణ వర్షమ్ము గురియించి వాని పైని, 118

పట్టు విడకుండఁ బోరాడి, బహువిధముల
వాని మెప్పించి నొప్పించి బడలి నడలి,
పట్టు సెడ నోర్వ లేక దెబ్బలకు, ధరణి
పైని రక్తమ్ముఁ గ్రక్కుచు వడెను గడకు. 119

రాక్షస మహాభటులఁ బల్వురను, సచివ కు
మారులను నేడ్గురిని నసమానులైన
దళపతుల నైదుగురను, నుద్దండవీరు
నక్షు నొక కోఁతి నిమిసాన హత మొనర్ప, 120

దనుజపతి చాల భయపడి దర్పవంతు;
నిఖిల శస్త్రాస్త్ర బల సమన్వితుని, నిపుణు
జ్యేష్ఠసుతు నింద్రజిత్తును జెంతఁ బిలిచి
"యల్పమర్కట మొండు రూపంది ఘనుల 121

చంపినది యన్న నే నమ్మఁ జాల కుంటి;
ఫాలనేత్రుఁడు నివసించు పర్వతమును
నాఁడు పెకలింప యత్నించినాఁడ నంచు
వాఁడె నన్నేచ గోఁతియై వచ్చె నేమొ? 122

యమరు లెవ్వరు ననుఁ జంప నలవి కాని
వార లగుటను నిట్టుల వాసవుండె
వానరుం డయి వచ్చెనో? మౌను లొకట
కలిసి నా పోరు పడలేక కడఁగి మర్క 123

టమును సృష్టించి పంపిరో? సంకటమును
గొలుపు చుండెను! దానిని గూల్పఁదగును:
శస్త్రములఁ గూలదను వరశక్తిఁ బడసి
యుండ వలె నద్ది; నస్త్ర ప్రయుక్తి చేత 124

పట్టి గిట్టింపఁ దగుదాని; పరుల కలవి
గాని పని యద్ది; కాన నీపైని మోపి
భారమును బంపఁ బిలిచితి; బయలు దేరి
చని జయమ్మును బడసి రా’మ్మనిన, నాల్గు 125

భద్ర గజములఁ బూన్చిన పసిఁడి రథము
పైనిఁ గూర్చుండి, ధనువును బట్టి యతఁడు
చదలు గడగడ లాడ, భూస్థలి వడఁ కఁగ
బయన మై చని హనుమంతు పైని బడెను. 126

అంప పొదు లన్నిటను గల యాశుగముల
పాఱ విడిచియు నా వీరవరుఁడు; పాఱి
యనిలనందను వజ్ర కాయమును దాఁకి
యవి తునియలైన యవి చేత నంది వినరి 127

నట్టి నిశితాయుధమ్ములు ముట్టి వాని
ముక్క లైనవి; దివ్యాస్త్ర ములకుఁ గాని
కట్టు వడఁ డాతఁడని యెంచి కడకు నతఁడు
వదలి బ్రహ్మాస్త్రమును, వాని బంధితునిగఁ 128

జేసి కొనిపోయి, రావణు చిత్త మలర
ముందు నిల్పిన, నాతఁడు ముక్కు పైని
వ్రేలి నిడికొని వానరు వింత మనుజుఁ
డనఁగఁ జూచుచు, నాగ్రహ మతిశయింప, 129

మస్తకమ్ముల మణిమయ మకుట రుచిర
మహిమ విస్ఫార; గురుముఖ మండలములు
బహు విశాలములగు ఫాలభాగములను
పద్మపత్రాక్షములతోడ ప్రభల నీని 130

భానుబింబింబు లనఁగను భాసిలంగ;
పసిఁడి యంచుల మెఱవుల పరువు సిలుకు
పట్టు పీతాంబరమ్ములు స్వర్ణభూష
ణములు నవరత్నరమ్యహారములుఁ గృష్ణ 131

వర్ణగంభీరగాత్రవైభవము చాఁట;
చామరమ్ములఁ గొని వీచు చాన లిరు కె
లంకులను వరుసలు దీరి పొంకముగను
వరలు చుండఁగ; సచివులు, బంధుగులును, 132

నాప్తులును బురజనములు, నమరియున్న
పెను సభను దశకంఠుఁడు పేర్మి మీఱ
స్వర్ణ సింహాసనమ్మున స్వర్గనాథు
వగిదిఁ దేజస్వియై కంటఁ బడిన, గాలి 133

పట్టి కనుచుండఁ, జకితుఁడై పరవశుఁడయి,
సచివుఁ డొక్కఁడు రావణు శాసనమున
వాని చరితమ్ము నంతయు తేనికిని వి
వరముగఁను దెల్పఁగోరఁగ, వాఁడు దాఁచ 134

నటులఁ దా నెవ్వఁడో, లంక కరుగు దెంచ
వలయు గారణ మేమియో, తెలియ కాలికిఁ,
రావణుని గని, ధర్మమార్గమున కీడ్వ,
"దానవోత్తమ, రావణా, దనుజకుల వి 135

నాశనమ్మును గోరకు, నన్ను వినుము:
పరుని పత్నిని బడయఁగ వలయునన్న
పాపచింతనముల విడి, బాగు పడుము;
ధరణిజను రామభద్రు పాదముల నునిచి 136

తప్పు మన్నింప వేఁడుము, తప్పక యభ
యమ్ము నొసఁగును బూర్ణదయాబ్ధి యగుట;
కానిఁ చోఁ బాడువడెదవు, ఘనుని రాము
ఘనత నెఱుఁగవు, సప్తలోకముల వాని 137

సాటి కాఁగల వీరులు జన్మ మంది
యుండ రెవ్వరు; చండప్రచండుఁ డతఁ డ
టంచుఁ బలికిన, తీవ్ర కోపాగ్ని రవుల
దానవేంద్రుఁడు, హద్దులు దాటు చుండె, 138

నితఁడు సాహసి యయి నాకు హితవుఁ జెప్ప
వచ్చె! చంపుఁడు వీని గర్వమ్ము నడఁచి,"
యన విభీషణుఁడవ్వాని యనుజుఁడౌట,
"తగదు దూతను జంపఁగ దానవేంద్ర, 139

ధర్మముల నెల్ల నెఱిఁగియు దారి దప్పి
చనఁగ నీవంటి ఱేనికిఁ జాల తగ్గు
దనము దెచ్చును; వీని మదమ్ము నడఁచి
వంపఁ బ్రాణమ్ము దీయని భంగి, నన్య 140

మార్గ మున్నది; వాలము మర్కటమున
కతిప్రియంబగు నంగము; కాన, దాని
కాల్చి వంపినఁ జాలుఁ జక్కఁగ" నటన్న,
నటులె సేయంగఁ దగునని యసురపతియు 141

నాన యిడె; జాగు సేయక దానవభటు
లంత, కొన తోఁక నీడిచి యగ్గిఁబెట్ట
ననువుగను వస్త్రములఁ జుట్టి, మునుఁగ ముంచి
తైలమునఁ జిచ్చు ముట్టించి ధగ ధగ మని 142

మండఁ దొడఁగినఁ జూచి యా మర్కటాగ్ర
గణ్యు వదలిరి: వాఁడును క్షణము లోనఁ
గాయమును సూక్ష్మ మొనరించి, కట్టి యున్న
త్రాళ్ళు విడి వడ నప్పట్టు దాఁటి చనెను. 143

వార్త యది యంతలో రామపత్ని చెవులఁ
బడిన దుఃఖించి యామెయు వహ్ని దేవు
మనసులో నిల్పి ప్రార్థించె వినయముననను,
జల్లఁగను మండ; నగుటను సాధ్వి కృపను 144

వహ్ని తాపమ్ము తగులని పగిది యతని
వాల మది మండుచుండఁగ, బాధ పడక
యతఁడు, దగ్ధమ్ము గావించి యసురపురిని
మరలి పో నెంచి, వడిగొని పరువు లెత్తి 145

వాడ వాడల నింటింటఁ బడి వెడలుచుఁ
జిచ్చు ముట్టించుచునె బహుచిత్రగతుల
సంచరించుచు నుండఁగ, జ్వాల లెగయఁ
గనలి మండఁ దొడంగె లంకాపురమ్ము. 146

పసిఁడి మేడలు ద్రవియించి పాఱఁ, జిటిలి
చిటపటారావములతోడఁ జెదరి మింటి
పైకి నెగయుచు రిక్కల వలెను రాలి
పడఁగ బహురత్నరాసులు పుడమి పైని, 147.

మంచి గంధపుఁ జెక్కలు మలఁచి నట్టి
ద్వార బంధనములును, గవాటములును,
ద్రావులును దంతెలును గురుస్తంభములును
ప్రబల జ్వాలాయుతమ్ములై రవిలి కొనుచు 148

దగ్ధమై పడుచుండఁగఁ, దత్తరమున
దిక్కు లరయక దీనులై తెరువులఁ బడి
'యయ్యొ, కుయ్యో!' యటంచును నఱచుచు బలు
రక్కసుల గుంపు పరువిడ రావుఁ గొనుచు, 149

తప్పి చనలేక చిక్కిన తనువు లగ్గి
పొలుగను గాలుచుండఁగఁ, బలువిధముల
వానవలు వర్ణదీప్తులు బయలువడుచు
నుండఁ, బొగలను జిమ్ముచు మండుచుండ 150

వృక్షములు; పెను గొండలు విఱిగి పడుచు
నుండఁ, గొలఁకుల నీరమ్ము లుడుకుచుండ,
నాకసమ్మున కెగసి వాతాత్మజుండు
దనియఁ గాంచెను జక్క నేత్రముల విచ్చి! 151

దనుజపురి నట్లు కాల్చి యాతండు మరల
యత్నపడుచుండ, నంతలో యవనిజయును
నగ్నిహోత్రుని కాహుతి యయ్యె నేమొ!
యనుచు శంకించి, యాతఁడు మనసు చెదర 152

పరుగుఁలిడి యామె నెలకొన్న పట్టుఁ జేరి
సౌఖ్యముగ నుండుటను గాంచి నంతసించి,
వందనం బిడి సెలవంది, వారినిధిని
దాఁటి చని, మహేంద్రాద్రిపై తనువు డించె. 153

'కాంచి వచ్చితి సీత'నటంచు నచటి
వానరులకును దెలుపఁగ వాయుసుతుఁడు,
వారు సంతోష భరితులై వానిఁ బొగడి
తాండవింపఁ దొడంగిరి తన్మయులయి. 154

రామలక్ష్మణులును వానరపతియు నటఁ
గాఁచియుందురు తమదు రాకలకు వేఁచి,
యగుట జాగొనరింపక నచటి కరుగఁ
దగు నటంచును వా రెల్ల నెగసి దివికి, 155

మార్గమునుబట్టి యేగుచు, మధువనమున
మధ్య మధువును గ్రోలి మైమఱచి యాడి,
పాడి, దూఁకుచు దొర్లుచుఁ, బలువిధముల
హర్షమును బ్రకటించి, పై కరిగి యతి ర 156.

యమునఁ బయనించి, విజయనాదములు సెలఁగఁ
జని, ప్రవర్షణగిరిఁ జేరి సాగిలఁ బడి
రామఁ సుగ్రీవులకు మ్రొక్కి, రామపత్ని
చరితమును నెల్ల వారికి నరయఁ జెప్పఁ 157

బవన తనయునిఁ గోరిన, వాఁడు నంత
కరములను మోడ్చి పులకితగాత్రుఁ డగుచు,
భక్తి పొంగార వినయ భావమ్ము విరియఁ,
బంప వానరపతి, తోడి వానరులతొ 158

పయనమై దక్షిణపు దిశఁ బట్టి వెడలి
యవనిజను వెదకుచు, మహేంద్రాద్రిఁ జేరి,
యంబునిధి యడ్డువడ, దాఁటి యవలి గట్టుఁ
జేరఁ గల శక్తిఁ బడసిన వారెవరును 159

నందు లేకున్న కతన, వా రందఱుఁ దను
దగిన వాఁడని పొగడి ప్రోత్సాహపఱచి
పంపఁ గాయమ్ముఁ బెంచి పర్వత మనంగఁ
బైకి లంఘించి, దాఁటి యవ్వారినిధిని, 160

గట్టు లోఁబడి చొచ్చి లంకాపురమును
ధరణిజనుఁ గన్న విధమును; దానవపతి
సాధ్వి యామెను వేధించి చనిన యట్టి
చందమును; దీనయై యామె తన్ను నమ్మి 161

పతికిఁ దెలుపఁగ వివరించి పలికి పంపి
నట్టి సందేశవార్తను, నవలి కథను
కన్నులకుఁ గట్టి నటులఁ జక్కగను జెప్పి,
సీత చూడామణిని రాము చేతఁ బెట్టె. 162

దానిఁ జేకొని రాముఁడు జానకినె గ
నిన విధమ్మున ముదమున మునిఁగి తేలి,
పవననందనుఁ గౌఁగిట పట్టి గ్రుచ్చి
వదలె, ఋణపడియున్న భావమ్ముఁ దెలిపి. 163

# యుద్ధ కాండము

మారుతాత్మజు శక్తి సామర్థ్యములను
మెచ్చి, చనవిచ్చి కౌఁగిటఁ గ్రుచ్చి యతనిఁ
దనిపి, కడు భయంకర మగు వననిధి నెటు
కడచి లంకాపురమునఁ గా లిడఁగ నౌనొ 1

యన్న పెనువంతలోఁ బడి యున్న జాన
కీ పతికి శాంతి నీయ సుగ్రీవుఁ డతని
మదికి నెక్కఁగ, "లోకోత్తమా, ఘనతమ
రామ, పత్నిని గొందువు రమ్ము రావ 2

ణాధము వధించి; యే పని నైనఁ జేయఁ
గలరు వానర వీరులు; కడలి దాఁటఁ
గలుగు మార్గమ్ము నేర్పడుఁ; గలఁత విడు" మ
టంచు నోదార్చి వలయు ధైర్యమ్ము నిచ్చె. 3

జన్మదినతార నాటి నక్షత్ర మైత్రి
నంది, సాధనతారయై యతిశయింప,
నాకసమునకు నడుమ మధ్యాహ్న, భాను
మూర్తి వెలుఁగఁగ, నభిజిన్ముహూర్త మందు, 4

వానరుల మహావాహినీ బలముతోడఁ
బయనమై చని, దనుజ రావణునిఁ ద్రుంచి
పత్ని చేపట్టి మిఱల నెబ్బంగి నైన
సిద్ధపడె రామభద్రుఁడు చింతల విడి. 5

అంత సుగ్రీవశాసన మంది యపుడె
దర్పవంతుఁడు, నీలుఁ డుద్దండుఁ డగుచు
ముందు నడువుచు దండుల నెందుఁ గనిన
నందె కన్పించి యాజ్ఞల నంది యిచ్చు 6

చుండ నాలుగు దిక్కులనుండి, ప్రముఖు
లైన భల్లూకవీరులు వానరాగ్ర
గణ్యులును నప్రమత్తులై కాచుచుండ
సైన్యనివహమ్ములను, రామచంద్రుఁ డనిల 7

తనయు పైనను, వాలినందనుని పైని
లక్ష్మణుండును, నమరి విలక్షణులుగ
ధనువులను నంది, సైన్యమధ్యమున వెలుఁగ,
వలు శుభశకునములు గానవచ్చుచుండ, 8

క్ష్మాతలము కంపమంద, దిక్తటము లద్రువ,
శరధు లుప్పొంగఁ, జలియింపఁ జదలు, కదలె
జయ జయ ధ్వానములతోడ, సర్వ సైన్య
కోటి దక్షిణ దిశఁబట్టి కుమతిఁ గూల్ప. 9

కొండ గుట్టల నడుగిడి, కోనలందు
గమన మొనరించి, వాఁగు వంకలను దాఁటి,
క్రమఫలపుష్పభరితవృక్షములతోడ,
రమ్యమై యొప్పు సహ్యపర్వతము నెక్కి, 10

ఫలములను దిని, మకరందములను గ్రోలి,
పాడి యాడుచు నఱచుచుఁ బట్టరాని
కౌతుకమ్మునఁ జనుచు మర్కట భట నివ
హము మహేంద్రాద్రిఁ జేరె నాయకులతోడ. 11

ఆ మహాగిరినుండి భయంకరాబ్ధి
కానఁ బడుచుండ, దండులఁ గలిపి నడపె
కడలి గట్టును జేర జక్కఁగను సర్వ
సైన్య నాథుఁడు నీలుఁడు చతురుఁ డగుచు. 12

అచట శాస్త్రీయముగను సైన్యముల విడువఁ
దగిన విడుదలఁ గల్పించి, దళముల విభ
జించి మూఁడుగ, నిలువ శాసించె నతఁడు
శ్రమలు వాయఁగ, నవలి యాజ్ఞలకు వేచి. 13

అస్తమయభానుమూర్తికి నంజలించి,
యర్ఘ్యమర్పించి, రాఘవుఁ డవనిజ కనఁ
బడిన యట్టులఁ గనుముందు, భ్రమసి కలఁగి,
పరితపించెను సౌమిత్రి పంచనుండ. 14

అచట లంకాపురమ్మున నసురపతియుఁ
గడలి గట్టున వైరివర్గమ్ము విడిసి
యున్న వార్తను చారులు విన్నవింపఁ,
గలఁతయును నలుకయు లోనఁ గలసి మెదలఁ 15

గొంత కాలమ్మునకు ముందె కోఁతి యొకటి
కొండవలెఁ గాయమును బెంచి, కూల్చి ఘనులఁ
గాల్చి లంకను జనినట్టి కరణి యెల్లఁ
గనులఁ గట్టిన యట్టులఁ గానిపించ, 16

పైనిఁ బడనున్న వైరుల భండనమున
దాఁకు విధముల నన్నింటిఁ దలలఁ గలిపి
చక్క యోచింప సభ గూర్చె, 'సాన దీరి
నట్టి యోధుల' సచివుల నండఁ బిలిచి. 17

మహితు రాముని మానవమాత్రుఁడంచు
మదిఁ దలంచుచు, మూఢులు మందమతులు
వారు, రావణు మెప్పును బడయ విజ్ఞఁ
వీఁగుచును బల్కఁ దొడఁగిరి విధి నెఱుఁగక. 18

అల్పపశుబలయుతుఁడు ప్రహస్తుఁ డనెడు
దానవానీకపతి యిలఁ దన్ను మించు
దర్పవంతుఁడె లేఁడని తలఁచి దాన
వాధిపునిఁ జూచి, "కలఁగకు మసురనాథ! 19

మర్కటమ్ములతో హీనమానవుండు
మన మహాసైన్యముల దాఁకి మరల లేఁడు
ప్రాణములతోడ; నొక కోఁతి రాత్రి వేళ
దనుజ వీరులు నిద్రలో మునిఁగి తమ్మ 20

మఱచి యుండఁగ దన్కరు మాడ్కి లంకఁ
జొచ్చి, దుశ్చేష్టలకుఁ బూని చిచ్చు వెట్టి
పట్టు వడకుండఁ బరుఁగులు వెట్టి నంత
ఘనతఁ గాంచదు; దానినిఁ గాల రాచి, 21

చంపివత్తును రాము నీ క్షణమె వాన
రాధములతోడ; నీవు నిర్భయుఁడ వగుచు
వలచి నట్టుల నిర్బంధ వఱచి మూర్ఖ
రాలి సీతను లోఁగొని ప్రణయసుఖము 22

లందు చుండు" మటంచు గర్వాంధుఁ డగుచుఁ
బలికె; కత్తుల నీటెల బాకులఁ గొని,
సత్వరమె చని రామునిఁ జావఁబొడిచి
మరల నుంకించి రందు కొందఱు మదించి. 23

కడు భయంకరరూపుఁడు కఠినదీర్ఘ
కాయుఁడు మహోదరుఁడు, కుంభకర్ణుఁ డనెడు
దనుజ నాథుని జ్యేష్ఠ సోదరుఁడు, 'నిద్ర
పాటు లోఁబడి సతము తెప్పలను విచ్చి 24

కనక దేనిని గాలమ్ము గడపు చిత్ర
చిద్వికారుఁడు', రావణు చేతఁ బంపఁ
బడిన రాక్షస భటులు లేపంగ లేచి
చని, దనుజపతి ముంగల సభను నమరి 25

యటుల నిద్రను జెఱపి తన్నటకుఁ బిల్వ
నంపు కారణభారమ్ము నడిగి తెలిసి,
తనకుఁ దెల్పక సీతను దస్కరించి
తెచ్చి యుండఁగ రాదని తెగడి వాని, 26

"భయము వదలుము, నేనుండ బ్రాణములతో
వరులు నినుఁ దాఁకి బ్రతుకరు; పట్టి చీల్చి
వారి రక్తమ్ముఁ ద్రావుచు బ్రళయ కాల
భైరవుని మాడ్కి,నం"చు నభయము గొప్పె. 27

వాసవుని దాఁకి పడఁద్రోసి, పైకి నుఱికి
నట్టి యైరావతమ్మును ముట్టి పట్టి,
దంతముల నూడఁ బెఱికి హస్తములఁ బట్టి
వానితోఁ మోఁదిఁ మోఁది దేవతలఁ దఱుమఁ 28

గొట్టి లంకకు మరలిన దిట్ట, యస్త్ర
శస్త్ర విద్యల నేర్చిన సాటి లేని
సమరశూరుఁడు, మాయావి చదలి కెగసి
కాయము నదృశ్య మొనరించి, కంటఁ బడక 29

శర పరంపరలన్ శత్రుసైన్యము పయి
విడక వర్షింపఁ గల మేటి వీరుఁ, డింద్ర
జిత్తు, దశకంఠు పుత్త్రుఁడు, చిచ్చు లుమియు
చును జనకుఁ జూచి," నావంటి తనుజుఁ గన్న 30

తండ్రి పరబలశక్తులఁ దలఁచి బెదర
దగదు; నే నొక్కఁడనె యేగి తలలు నఱికి
వానరులఁ గూల్చి, రాముని ప్రాణములను
మాపి రాఁగల," ననెఁ గోల మోపి వింట! 31

అటుల వ్యర్థప్రలాపులై యందఱు నట
వైరి వరశక్తినరయక వదరు చుండ
విని విభీషణుఁడగ్రజు మనసు మార్చి
మంచి దారికి నీడ్వఁగ నెంచి, వినయ 32

భావ మేర్పడ, "అన్నఁ నేఁ బలుక వినుము:
పశుబలమ్ముల నమ్మి దైవమునె తాఁక
దలఁచు టెంతయుఁ బొరపాటు, ధర్మ వరయ
దైవ రూపము, రాముఁడు ధర్మమూర్తి. 33

కాన దైవసమానుఁడు; వానిఁ దాఁక
సాహసించిన వంశనాశనమె యగును,
పలువిధమ్ములఁ దమ ఘనతలను దామె
చాటి కొనినట్టి వీరుల శక్తు లెల్ల 34

రామభద్రుని నిశితశరమ్ము తగుల
దగ్ధమై బూదియై పోవుఁ దప్ప, దనుజ
పాశమునఁ బల్కు చుంటిని; బాడు వడకు
పట్టు విడి సాధ్వి సీతను నెట్టులైన 35

రామునకు నిచ్చి, దానవరాజ్యరమను
బచ్చి నెత్తుటి వఱదల పాలు గాని
వగిది రక్షించి కొనుము, నిన్బట్టి చంపఁ
గలుగు వారలె లేరని గర్వపడకు; 36

దైత్యులకు దేవతలకును దరముకాదు,
యక్ష పన్నగ ముఖ్యుల కలవి కాదు,
సిద్ధసాధ్యగణమ్ములచేతఁగాదు,
గరుడ గంధర్వులకును గింపురుషులకును 37

శక్తి చాలదు నినుఁ జంప నత్య; మయ్యు
వానరుల మానవులచేత పట్టు వడని
వరములను నంద కుంటివి, వారె నేఁడు
నిన్నుఁ దాకఁగ వచ్చి రటన్న సూక్ష్మ 38

తత్త్వమును విస్మరింపకు, ధర్మపథము
నందుఁ బడు, మం"చుఁ బ్రార్థింప, నతని మంచి
మనను నరయంగ లేక రావణుఁడు అలిగి
"పలుకుఁ జాలించి నీ హితవాక్యములను 39

గట్టి పెట్టుము, కనఁ గనుగుట్టు నేమి
నా ఘనత? నిన్ను నెన్నఁడు నమ్మఁ దగదు;
జ్ఞాతి హితశత్రు వనెడు నైజమును నేను
బాగఁ నెఱుఁగుదు; నాదు కోపమ్ము రవులఁ 40

గంటి ముంగల నిలువకు, కాలి బూది
యగుటకును మున్నె, యరుగు మెందైన లంక
వదలి యని యాగ్రహోగ్నుల వెడలఁ గ్రక్కి
యతఁడు దూషించి పోఁబంప, నా క్షణమున 41

రాముడేఁ దిక్కటంచును రావణాను
జుఁడు చదలి మార్గమును బట్టి విడచి వాని
వెడలి, రామచంద్రాదులు విడిసి యున్న
తలమునకుఁ బైని నిలిచి, "యుత్తమ, ఘనతమ 42

రామభద్రా, నమోఽస్తు, నే రాక్షసాధి
పుని సహోదరుఁడను; విభీషణుఁడ, వాని
ధర్మమార్గమ్మునకుఁ ద్రిప్పఁ దలఁచి తఱుమ
బడి యిటకు నీదు వరపాదపద్మములను 43

బడగ వచ్చితి, నాకు నభయము నిచ్చి
వంచ నిడుకొన వేడెద, పతితు నన్నుఁ
గావుమా, యని, దీనుఁడై కంఠ మెత్తి
యఱచి ప్రార్థించె వార లందఱును వినఁగ. 44

వానరాధిపుఁడును జాంబవంతుఁ, డంగ
దాదులును వాని పల్కుల నాలకించి,
వంచితులఁ జేయఁద మ్మట్లు వైరి పంప
వచ్చియుండు నటంచుఁ గోపమ్ము నంది, 45

వాని గడఁ జేవురాదని పట్టి చంప
వలయు నని పట్టు వట్టిరి; వాయుసుతుఁడు
వాని వాలకమును బల్కు పగిదియుఁ గని,
నిర్మలాత్ముఁడె యగునని నిశ్చయించి, 46

తెల్వియును వినయమ్మును దేటపడఁగ,
రక్ష నిడఁ గోరె రాముని; రాముఁడును బ
వనసుతుని నిర్ణయమ్మును బలపఱచుచు,
వాని కభయమ్ము నొసఁగ భావ్యం బటంచు, 47

"శంక పడరాదు; వాఁడు నిస్సంశయముగ
రావణునితోడఁ బోరాడి రక్ష వేడ
వచ్చియుండెను; జ్ఞాతులు వైరు లగుట
సహజమేకద? మారుతి చక్కఁ బలికె; 48

కానిచో మీరు తలఁచిన కరణి వాఁడు
మనల వంచింప వచ్చిన దనుజుఁడె యగు
గాక, శరణన్న వానిని గావ కుండ
వదల నేనొల్ల, నన్ను రావణుఁడె, శరణు. 49

వేడ వచ్చినఁ గావక విడువ, వేయి
మాట లిఁక నేల; వానిని మహికి దింపి,
నాదు ముంగల నిలుపుఁడా మీఁది పనుల
నేఁ గనుదు", నన్న, వారు వానిని ధరణికి 50

దిగ ననుమతించి పిలిచిరి; దీనుఁ డతఁడు
దాశరథి యున్న దిశకుఁ బాదములఁ జూపి
ధరణికిని దిగఁ దగదని తలను క్రింది
జేసి దిగివచ్చి, వినతుఁడై, చేయి మోడ్చి, 51

దానవపురమ్ము లోని వృత్తాంత మెల్ల
విశద పఱచఁగ, "వినుము విభీషణా, యి
పుడె దనుజ రాజ్యరమను నీ కిడెద, మంగ
ళాభిషిక్తుండ వగు" మమంచు నభయ మిచ్చి, 52

రామచంద్రుఁడు కడలి నీరముల నటకు
వానరులచేతఁ దెప్పించి పంచ నుండి
యతని దీవించి తనియఁ బట్టాభిషిక్తుఁ
జేసెఁ దోనున్న వారు జేజేలు చెప్ప! 53

అంత సుగ్రీవుఁడును మారుతాత్మజుఁడును
వారినిధి దాఁటఁ దగిన యుపాయ మున్న
నరయఁ జెప్పఁగ గోరిన నతని; నతఁడు,
"సగరవంశస్థుఁడౌ రామచంద్రుఁ డగుట, 54

సాగరుని వేడ నతఁడు ప్రసన్నుఁ డగుచు,
దారిఁ జూపఁ గలం" డన, దాశరథియు,
సాగరోన్ముఖుఁడయి దర్భశయ్య పైని
బండి ప్రార్థించె నతని సద్భక్తి విరియ; 55

మూఁడు రాత్రులు గడచియు మూఢమతి స
ముద్రరాజన్యుఁ డాతని మొరల వినక
యుండ, సహనమ్ము నడలఁగ మండిపడుచు
క్షాత్రతేజమ్ము వెలుగఁ భీకర మహోగ్ర 56

గాత్రుఁడై, రౌద్ర నేత్రుఁడై, కార్ముకమును
వంచి యీడిచి నారి సంధించి నిశిత
శరము నెక్కిడి, శరధిని జలరహితముఁ
జేయ నేయంగ నుండఁగఁ, జెదరి బెదరి 57

సంక్షుభిత సాగరము నుండి సాగరపతి
బయటఁ బడి, మస్తకము వంచి వందన మిడి
రామభద్రునకును, "ధర్మధామ, రామ
చంద్ర, జలమయ మయియుంట జలధి సహజ 58

ధర్మమగుఁ గాన నే దానిఁ దప్ప వెఱచి
దారి విడకుంటి నీకు; శాంతము వహించి
నన్ను మన్నింపఁ దగునీవు, నలుఁడు విశ్వ
కర్మ పుత్త్రుఁడు నీ చెంత గలఁడు; వాని 59

సాయమున వంతెనను గట్టి సాగరమును
దాఁటి చన నగు; మున్గక దాని భార
మును వహింతును నే" నటంచును మఱఁగఁగ
నలుని నియమించె రాముఁడు; నలుగెలఁకులఁ 60

గల మహాపర్వతమ్ముల గండశిలల
వృక్షరాజమ్ములను దెచ్చి వేయఁగడలి
నడుమ వానర వాహిని, నలుఁడు తిండి
తీర్థముల నైన గొనక, రాత్రిం బగళ్ళు 61

శ్రమకు నోరిచి, కార్యదీక్షను వహించి,
యైదుదినముల లోపల నద్భుత మగు
వంతెనను గట్టి ముగియించె! సంతసింప
రామసుగ్రీవు, లలరి నిర్జరులు సూడ. 62

గగన వీథిని రామ లక్ష్మణులు హనుమ
దంగదుల పైనిఁ జక్కఁగ నమరి యరుగ;
"జయము, సుగ్రీవునకు, రామచంద్రునకును,
జయము, జయ మంగదునికిని, జయము సైన్య 63

పతికి నీలునకును, జాంబవంతునికిని
జయము, నలునకు జయ" మంచు జప్పటలను
జఱచి, ఘోషించుచును మోదభరితు లగుచు
వంతెనను బడి భల్లూక వానర భట 64

కోటి యా వారిరాశిని దాఁటి, నడచి
పైకిఁ జని, సువేలాచల ప్రాంతమందు
విడిసినది యస్తమయ మగు వేళయైన
దళపతులు నిల్పఁ దగునని తలఁచి నిలువ. 65

వ్యూహముగఁ బన్ని సైన్యసమూహములను
గలిపి గరుడాకృతిని, బక్షములను దీర్చి,
యపరసంధ్యాహ్నికమ్ముల నాచరించి
రాఘవుం డందె సుఖముగ రాత్రి గడపె. 66

వానరుల సైన్య బలముల, వాని నడుపు
దండనాథుల శక్తుల, దశరథాత్మ
జుల మహోజ్జ్వల గాత్ర దీప్తులను గూఢ
చారి, శార్దూలుఁడును శుక చారణులును 67

జక్క వివరించి చెప్పి, యా శత్రుబలము
పంచనే సువేలాచల ప్రాంత మందు
విడిసి యున్నట్టి వార్తను విశదపఱచ,
జడిసి దానవనాథుఁడు సమర మొదవు 68

సమయ మరుదెంచుటకు మున్నె జానకి నెటు
లైన లోఁగొన లో నెంచిఁ హీనుఁ డగుచు
గల్పితంబైన రాముని ఖండిత శిర
మును శరమ్మున గ్రుచ్చి, రాముఁడు వధింపఁ 69

బడె నటంచును నామెకుఁ బట్టి చూపి,
భయము గొలుపుచుఁ, జచ్చిన వాఁడు మరల
రాఁడగుటఁ దన్నుఁ జేకొని రాము మఱచి
సౌఖ్యపడఁదగు ననుచుండ, సత్వరమ్మె 70

మఱలి తముఁ జూడ వలెనని మంత్రివర్యు
లతనిఁ బిలువంగఁ బంపిన, నామెను విడి
యరిగె నాతఁడు, మాయల నరయ లేని
ధరణిజయు శోక తప్తమై ధరణి దొరల. 71

వినుత గుణశీల; సరమ, విభీషణు సతి,
రావణుని మాయ యది యని, రాము నతఁడు
చంప లేఁడని, నమ్మగఁ జక్కఁ బలికి
యామె నోదార్చి పోయె నెయ్యమ్ము నంది. 72

సాధ్వి సీతను వేధించి, చంప నటులఁ
జంపి, మరలిన దుష్టనిశాచరుఁడు
మంత్రులను గూడి, సమరమర్మముల వైరి
మంతనమ్ముల, రక్షణమార్గములను 73

జక్కఁజర్చించు చుండఁగ, వెక్కిరించి
నటుల వానర వీరసైన్యముల సింహ
నాదములు కర్ణ పుటముల మోది సత్వ
రమ్మె రాఁబిల్చినవి రణరంగమునకు. 74

మాల్యవంతుఁ డనెడు మతిమంతుఁ డొకఁడు
మతిని మారిచి రావణు మంచి దారి
కీడ్వ యత్నించియును, మృత్యు వీడ్చుచుండ
వాఁడు గర్వించి బదులిడె వానిఁ దెగడి. 75

మాత కైశికి బోధించె సీత నాక్ష
ణమె రాముని కర్పింపు, నెమ్మదిగను
బాదములఁ బడి వేడె మందోదరీ స
తీమతల్లియు నటు సేయ, రామసైన్య 76

మహిమ నెల్లను గనులార మధ్య నుండి
కాంచి వచ్చిన చారులు కయ్యము తగ
దనియు సంధిని గోరఁగఁ దగు ననియును
బలు విధమ్ములఁ దెలిపిరి; ఖలుఁ డతండు 77

కామతిమిరమ్ములోఁబడి, కాన లేక
మంచి చెడుగుల నారసి, మంకు పట్టు
పట్టి సమరమ్మునే కోరి వారి హితవు
లన్నిటిని దన్నెఁ గడకాల నాగ్రహించి. 78

కడగి యాతఁడు నగరరక్షణమునకును,
ననుపమమ్ముగ గుప్తి కార్యము నొనర్చి,
దండులను దగఁ బుర మహాద్వారములను
నిలువ శాసించె సైన్యనాథులను బిల్చి. 79

అసురపురి వీడి తనతోడ నటకు రామ
సన్నిధిని జేర వచ్చిన సచివులను న
లుగుర, వక్షులై మాఱి యరిగి, పరులకుఁ
బట్టు వడనట్లు లంకలోపలి వివరము 80

లరసి మరలఁగ శాసించి యనుపగను వి
భీషణుఁడు, వేగ నటకును వెడలి మరలి
వారు చెప్పఁగ దానవదళబలముల
భంగి నెల్లను వివరించి, బాగ నెఱిఁగి, 81

రామభద్రుఁడు, వానర రాజ సైన్య
ములను దగు రీతి శిక్షించి, తెలుపఁ దగిన
సూక్ష్మ విషయమ్ములను దెల్పి; సుందరతమ
మౌ సువేలాద్రిపై నెక్కి యసురపురిని 82

గాంచు చుండఁగ భ్రమయుచు, గడమ నున్న
వానరేంద్రుఁడు దానవపతి యచటను
ధీరగంభీరుఁడై తీర్చి దిద్దు చుండ
దండులను జూచి, కుపితుఁడై తన్ను మఱచి 83

పైకి లంఘించి, క్షణములో వాని దాఁకి
మస్తకమ్ముల మెఱసెడు మకుటములను
దన్ని, ధరణికి దొరలించి దర్ప మడఁచి,
మరలె, రామునకును దన గరిమ దెలిపి. 84

సంధికిని ముందు యత్నించి సమర రంగ
మందుఁ బడఁ, బంపె నంగదు నసురపతిని
గాంచి మరలఁగ రాముఁడు; ఘనుఁ డతండు
సత్వరమె చని, యా నిశాచరుని ముందు 85

నిలిచి గంభీరుఁడై, "నన్ను నిన్నుఁ జూచి
సంధి కొప్పించి రమ్మని సాగ నంపె
రాఘవుఁడు; కాలి కొనగోట రాచి నిన్ను
ప్రాణములతోడ వదలిన వాలి, నాదు 86

తండ్రి యగు; నంగదుఁడ నేను! ధరణిజ నివు
డైన రాముని కర్పించి మానప్రాణ
ములను రక్షించి కొనుము, నీ వలనుకాదు
రామభద్రుని తోఁ బోర; రావణా య 87

థార్థమును జెప్పితిని, విను" మన్న నతఁడు
మండి పడుచును, "చంపుఁ డీ మర్కటమును
మస్తకమ్మును దెగఁ ద్రుంచి; మద మడంగు"
నంచు శాసింపఁ, జేతికి నందు పడక 88

వాలిసూనుఁడు పెంచి రూపమును రాజ
భవన ప్రాసాద శిఖరమ్ము పైకి నెగసి,
విఱుగఁ బడఁ దన్ని దానిని మరలి రామ
సన్నిధిని జేరి తెల్పె నిశాచరు మతి. 89

సంధి కుదురక యుండిన శాంతి తప్పి
ధర్మవీరుఁడు రాముఁడు దళపతులను
దండులను ముందు నడపి సత్వరమె లంక
చుట్టు నిలువఁగ శాసించె శుభము పలికి. 90

మలల శిలలను బెను వృక్షములను జేతఁ
బట్టి భల్లూక వానరవాహిని చని
చుట్టు మూఁగుచు లంకను ముట్టడించి,
సింహనాదమ్ము చేసెను చెవులు చీల. 91

వానరులు దానవుల దాఁకి పట్టు చుండ
బోరు ప్రారంభ మయ్యెను! క్రూరములగు
శస్త్రముల రావు గొని వెదఁ జల్లఁ దొడఁగె
నుక్కు వుప్పొడి నెల్లెడ నుర్వి పైని. 92

గండ్ర గొడ్డళ్ళు, బాకులు ఖడ్గములును,
బల్లెములు, వాఁడి యీటెలు, ప్రబలి చీల్చి,
పొడిచి, తెగఁ గోసి తూఁటులు వడఁగ గ్రుచ్చి
కాయములఁ గూల్చి కుప్పలు వోయుఁ చుండె. 93

గదలు ఢీకొనె; కరములు గలియఁ బెనఁగెఁ
దనువు లొండొంట; ముష్టి ఘాతములు మించె;
పెద్ద కొండలు వ్రేళ్ళతోఁ బెఱికి విసరఁ
బడిన తరువులు దలల పైఁ బైని బ్రాఁకె. 94

అంత కాలాభ్ర భయద కృష్ణాంబుదంబు
లుఱిమి కురిసిన యట్టులఁ దెఱపి లేక
కురిసె శర వృష్టి! యిరు కెలంకులను మేటి
వీరఁ వర్యులు విల్లంది విడుచుచుండ. 95

వాయుసూనుఁడు వానరేశ్వరుఁడు, నంగ
దుండు, జాంబవదాదులు ధూర్తుల వయిఁ
బడిరి పిడుగుల యట్టుల! పొడిచి పొడిచి
మొత్తఁ దొడఁగిరి వారిని నెత్తు రొలుక. 96

మలల వడి దాఁకి తలలు దున్కలుగఁ బగుల,
వృక్షములు మోదఁ దనువులు విఱిగి వడఁగ
నసురు లెల్లరు నుస్సురు మంచుఁ బుడమిఁ
బడుచు నుండిరి చచ్చి కుప్పలుగఁ గూలి. 97

కోఁతులని యూరకుండిన కొంప మునుఁగు
చాల దా స్వల్ప బలమని, చతురులైన
వారి వీరాగ్రగణ్యులఁ బంపె నమర
రంగమును జేరి పోరాడ రావణుండు 98

తరణి వడమటి కొండల మఱుఁగఁ; జిమ్మ
చీఁకటులు గ్రమ్మ చుండఁగఁ; జెలఁగి నమర
శంఖములు మ్రోఁగ; రణభేరి నందడింప;
నరదములు భద్రగజములు నశ్వములును, 99

గాల్బలమ్ములు గదలిరా ఘనులు వారు,
కవచములఁ దాల్చి భూషితగాత్రుఁలగుచు,
ఖడ్గములఁ గార్ముకమ్ముల గదలను గొని,
కాంచన రథమ్ములను నెక్కి, కదన రంగ 100

మధ్యమును జేరఁ గాంచిన మర్కటభట
చయము, మార్గమ్ము నరికట్టి భయదు లగుచు
దాఁకి నాలుగు దళములఁ దలలఁ దన్ని
భంగ పఱచుచుఁ, బ్రబలి బీభత్స గతుల 101

సాము సేయఁగఁ బూనిరి; సమర భూమి
సంక్షుభిత మయ్యెఁ బడిన వశ్వములు గూలి;
చక్క మర్దింపఁ బడినవి సామజములు;
అరదములు ముక్కలైనవి; యసురభటుల 102

తలలు దెగి పడి నవి; పోరు దయ్యము ముఖ
గహ్వరము విచ్చి, వచ్చి రక్తమును ద్రావి,
మాంసమును దిని, మదియించి మఱచి యొడలు
తాండవం బాడినది! యిఁక దాఁక వచ్చి 103

నట్టి దానవ వీరులు దిట్ట లయ్యు
ప్రముఖ భల్లూక వానర నరుల చేతఁ
జిక్కి చచ్చిరి! నశియించె రక్కస భట
శక్తి నిశితమ్ములగు దివ్య సాయకముల 104

వర్షములు గురియించుచు వచ్చె నంత
ముందుఁ బడి యింద్రజిత్తు ముమ్మూర్తు లొకట
మూర్తిగొని యున్న చందాన! ముమ్మరముగఁ
దమ్ము దాఁకెడు శరముల ధాటి కోర్వ 105

లేక వానర వీరు లనేకులు తపి
యించఁ దొడఁగిరి; చూచి భీష్మించి యంగ
దుఁడు మహోగ్రుఁడై, మద మడఁచి వానిఁ
బట్టి వధియింపఁ, బైఁబడ వచ్చుచున్న 106

శరములను ద్రుంచి, కూల్చి యశ్వములను, రథ
చక్రముల నుగ్గు గావించి, క్ష్మాతలమునఁ
బడగ నీడిచి వానిని ద్వంద్వయుద్ధ
మందు నలయింపఁ దొడఁగిన, నతఁడు గాన 107

బడని భంగిని, యెగసి యభ్రమున నుండి
వదలి నాగాస్త్రముల, రామభద్రు, నతని
యనుఁగుఁ దమ్ముని లక్ష్మణు నవనిని బడ
గట్టి వడవైచె! మూర్ఛిల్లి కదలకుండ 108

వారు పడియున్న నేత్రపర్వమ్ము కాఁగఁ
గాంచి, యటుపైని లేవ లే రంచు నెంచి
పరమసంతోష భరితుఁడై మరలి పోయి
విన్నవించెను దండ్రికి విజయ గాథ. 109

ధరణిపై నటు తనువుల మఱచి నాగ
పాశములఁ గట్టు వడియున్న ప్రభువులఁ గని,
వానరాధిపుఁడును జాంబవంతుఁడును బ
వనతనయుఁడును దీవ్రతాపమునఁ జిక్కి 110

యుండ, ఖగకులపతి గరుడుండు, వారి
బంధముక్తులఁ జేయ నభ్రమున నుండి
ధరణికిని దిగ, భయమంది తత్తరపడి
పరువు లిడె నాగనిచయము పట్టుల విడి! 111

విజయ శంఖారవమ్ములు వెల్లివిరిసి
పర్వదినమును బ్రకటింప, భయము తొలఁగి
కౌతుకమ్మునఁ బొంగి లంకాపురమ్ము
కళల నీనుచు నుండ, నాగములు పట్టు 112

తప్పి చన, రాఘవుండు సోదరునితోడ
బ్రతికి లేచిన వార్తను రావణుండు
గర్ణపుటములఁ గాల్చిన కరణి దనుజ
భటులు విన్పింప వినెను దిగ్భ్రాంతుఁ డగుచు. 113

ప్రబల యోధాగ్రగణ్యులఁ, బర్వతనిభ
గాత్రులను, మేటివీరులఁ గదన భూమి
కనిపె నప్పుడె తడయక మనను మథన
పడుచు నుండఁగ దానవపతి మతి సెడి. 114

ప్రబల బలశాలియైన ధూమ్రాక్షుఁడును, భ
యంకరుఁ డకంపనుఁడును, వాతాత్మజు వయిఁ
బడి నశింపఁగ; వజ్రదంష్ట్రుఁడు మదించి
యంగదుని దాఁకి యమపురి కరుగ; సర్వ 115

సైన్యపతి ప్రహస్తుఁడు నీలు శక్తి నడఁచు
శక్తి చాలక పోరాడి చచ్చి పడఁగఁ,
గదలి వచ్చెను వేఱు మార్గమ్ము లేక
రావణుఁడె చక్క రథ మెక్కి రణ మొనర్ప. 116

శతసహస్రార్కబింబసంచయము లొకట
కలిపి యుదయించి నట్లుల కదనభూమి
మణిమయకిరీటములు దశమస్తకముల
ప్రభల వెదఁ జల్లు చుండఁగఁ బ్రజ్వలింప, 117

నేడు లోకాల లోఁగొన్న ఱేఁడు, కమల
భవునిచే మేటి వరములఁ బడసినట్టి
ప్రబలతేజస్వి, దనుజసామ్రాజ్యసార్వ
భౌముఁ డరదమ్ము నెక్కి పోర్పడయ వచ్చు 118

భంగిమను గని భ్రమసి, పెన్భయము దోఁచి
దశపతుల నాశ్రయించిరి దర్పవంతు
లయ్యు వానరభటులు; భయంకరముగ
సమరమొనరింపఁ గడఁగె నిశాచర పతి. 119

రామసైన్యము బాణవర్షమున మునిఁగి
పైనిఁ దేలఁగ నోపక బాధపడుచు
నుండ, యోధాగ్రగణ్యు లుద్దండ వీర
వరులు వానిని మార్కొని భంగపడిరి. 120

ఆగ్రహమ్మున సుగ్రీవుఁ డతని దాఁకి
యద్భుతమ్ముగఁ బోరాడి యవనిని బడెఁ
బ్రాణములతోడ మూర్ఛిల్లి; వాని వెంట
బడెను గవయుఁడు; తోడ గవాక్షుఁడు పడె; 121

పడెను ఋషభుండు; జ్యోతిర్ముఖుఁడును బడెను;
ఖలుని వధియింపఁ జనిన రాఘవుని నిల్పి
మును బడెను లక్ష్మణుండు; వానిని వలదని
కాయమును బెంచి లంఘించె గాలిపట్టి 122

అరదమునఁ బడి రావణు నడచి పట్టి
వక్షమున గ్రుద్దె నాతఁడు; వజ్రగాత్ర
గరిమ కంపింపఁ గడు నొచ్చి, కనులు మూఁత
పడఁగ గాలిని బీలిచి వదలి యతఁడు 123

మారుతిని మాఱు గ్రుద్దిడి, మహిని ద్రోసి
వెఱచి కోల్కొని తను గ్రుద్దు మరల నంచు
వదలి వానిని ముందేగి వానరదళ
పతిని నీలుని దాఁకి మూర్ఛితుని జేసె! 124

కనలి మండుచు లోని యాగ్రహము వెడలఁ,
గాంచు చుండఁగ లేక లక్ష్మణుఁడు వాని
దాఁక దఱిమెను శరముల; దనుజపతియు
బ్రతి శరమ్ముల వినరి యవ్వానిఁ ద్రుంచె. 125

దారుణమ్ముగ సాఁగె నాపోరు; దర్ప
వంతు లక్ష్మణు లోఁగొన వలనుగాక,
పద్మసంభవుఁ డొసఁగిన ప్రబలశక్తి
నొక్క దానిని మంత్రించి రక్కసుండు 126

వాని వధియింపఁ బంపెను! వరుగు వట్టి
యదియు వహ్నిని గ్రక్కుచు నతిరయమున
సాఁగి నూటిగఁ దాఁక లక్ష్మణుని, వాఁడు,
మూర్ఛలోఁ బడెఁ కలఁగ రాముని మనస్సు. 127

అంతలో కోలుకొనిన వాతాత్మజుండు
రావణునిఁ వెదకుచు బోయి రామునిఁ గన,
వాహనంబుగఁ గొని వాని పై నమరుచు
రావణుని దాఁకఁ దలపడె రాఘవుండు. 128

ధనువు ఖండింపఁ బడినది; తనువు గ్రుచ్చె
నూది మొనయును జొరఁగను చోటులేని
వగిది కోలల కుప్పలు వచ్చి నెత్తు
రులను బాఱఁగఁ వెలికీడ్చి; బలము తఱుగ 129

నతఁడు తబ్బిబ్బు లగుచుండ, "అసురనాథ
యలసితివి చాల, పొమ్ము, భయమ్ము వలదు
చేరుకొను మిల్లు, నినుఁజంప; సేద దేరి
మఱల రేపటి ప్రొద్దున మరలి నన్ను 130

దాఁక నగు" నన్న, మరణమ్ము తప్పి నటుల
దలఁచి, పది తలలను వాల్చి, దానవపతి
తరలి పోయెను, జెలఁగి వానర భటాళి
జయ జయారావములు సేయ సంతసించి. 131

వాని నటు పంపి, మూర్ఛలోఁ బడిన వాని,
నూర్మిళానాథు, సౌమిత్రి నొక్క సారి
కాంచి గుండియ జల్లన గలఁగి, పట్టి
తలను మెత్తగఁ దన యంకతలముపైనిఁ 132

మోపి, నిలువెల్ల నిమురుచు నాపరాని
శోకభారమ్ములోఁ గ్రుంగి, శూన్యముగను
దోఁచ నిఖిలమ్ము, 'ప్రాణాలతోడ నుండఁ
జాల' నని యేడ్చె! శ్రీరామచంద్రమూర్తి. 133

అట్టి తఱి సుషేణుండను నట్టి వాఁడు,
వానరాధిపు వైద్యుండు, ద్రోణశైల
శిఖరమందున వెలయు సంజీవి నటకుఁ
దేరఁ బంచెను హానుమను దారిఁ జెప్పి. 134

ఆతఁడును వాయువేగమ్ము నధిగమించి
మంచుమల దాఁటి, మఱికొన్ని మలలఁ గడచిఁ
చేరి ద్రోణాచలమ్ము, సంజీవి కొఱకు
వెదకి వేసారి, కానక విసిఁగి, పెల్ల 135

గించి కొండనె మూపున నుంచి మోసి
తెచ్చె రయమున నిశి దాఁటి తెల్లవార
కున్న యప్పుడె; సౌమిత్రి కన్నుమూసి
లేచి నట్టులె సూర్యుని లేపి లేచె. 136

ప్రొద్దు పొడిచిన యంతనే పోరు మరల
ముందు వలె సాఁగ మొదలిడె; ముప్పు మూడ
నున్నదని సుంత తెలియలేకున్న మూర్ఖ
రాక్షసులు పోరఁ దొడఁగిరి రణము విడక. 137

మఱిగి మఱలిన మాయలమారి యింద్ర
జిత్తు మిత్తియె తోడుగ నెత్తి వచ్చె
మరల నని సేయ; మాయల మర్మ మెంత
కాల మేలును మాయక ఘనుల ముందు. 138

ఇంద్రజాలికుఁడై చిత్ర మైన గతుల
యుక్తు లన్నియు వెచ్చించి శక్తి యుడుగు
వఱకుఁ బోరాడి, లక్ష్మణ బాణ వర్ష
పాతమునఁ గూలె నా కులపాంసనుండు. 139

తలలఁ బైకెత్త నేరని దానవపతి
భంగ పాటును సైఁచగ వలను వడక
రామచంద్రుని దాఁకి పోరంగ కుంభ
కర్ణుఁ డొక్కఁడె తగునని ఘనులఁ బిల్చి, 140

యతనిఁ మేల్కొల్పి, తనకడ కనువఁ బంప;
భయద మృగరాజ బిలముఖద్వారము దరి
యంగ నేగెడు బిత్తరి హరిణము లన,
అడలుచును వారు, వాని శయ్యాగృహమును 141

దరిసి, యాతని నిశ్వాసదారుణాని
లములఁ వెనుదన్నఁ బడుచుఁ, గష్టమున లోని
కరిగి, వేలకు శంఖంబు లంది యూఁది,
మోది రణభేరులను, గర్ణములను శూల 142

ములను దూరిచి, పెను వృక్షములను మలల
పైనిఁ బడ నేసి, గదలను బట్టి కొట్టి,
తనువు పైనెక్కి మర్దించి తన్ని, బడలి
కడకు మత్తగజమ్ములఁ గాయము వయిఁ 143

బడగ నడిపింప: చీమలు ప్రాఁకుచున్న
కరణి దోపగ నతఁడు మేల్కాంచి, సిద్ధ
పఱచి యుంచిన మాంసపర్వతము నన్న
రాసులను మహాముఖగహ్వరమున గుప్పి, 144

కడవలను నింపియున్న రక్తమును బలు వి
ధముల మధువులఁ ద్రావి, ముందఱ నిలిచిన
వారిఁ దన్నటు లేపఁగఁ గారణమ్ము
నడిగి, శాంతించి, యగ్రజు నండ కరిగి 145

యతని వృత్తాంతమును విని, యభయ మిచ్చి
'పాదముల నంది యొక మహా పర్వతమ్ము
మార్గమును బట్టి చనుచున్న మాడ్కి', కదలి
కదనరంగమ్ముఁ జేరె భీకరుఁ డతండు. 146

అడుగు లొక కొన్ని పెట్టిన యంత లోనె
తినిన దెల్లను జీర్ణించి, తీవ్రమైన
కడుపు మంటలు చెలరేఁగఁ గనులు గాన
రాక మ్రింగుచుఁ దనతోడి రక్కసులను, 147

కాలి క్రిందను గొందఱు గాలి బీల్చ
ముక్కు లోనెక్కి కొందఱుఁ జిక్కి నుక్కఁ,
జుట్టు నున్నట్టి వారలఁ బొట్టఁ బెట్టు
కొనుచుఁ బ్రతిపక్షులను దాఁకి క్రూరుఁ డతఁడు 148

తాటకారిని గబళింప దరియు చుండ
దర్పమున, నాతఁడును వాని తనువుఁ బట్టి
చిత్ర వధ చేసి, వెన ముక్కు చెవులతోడ
బాహువులఁ ద్రుంచి కూల్చెనుఁ బ్రాణములను. 149

భటుల బంధుగులను బుత్రవరుల తోడఁ
బుట్టువును మిత్తివాతను బెట్టి వంశ
నాశనముఁ జేసి, తనువుపై నాశ విడిచి
తన్ను కూడనుఁ బలియిడఁ దలచి నట్లు 150

వచ్చె లంకాధిపతి కార్యభార మెల్ల
రూపుగొని నట్లు, రాముని రూపు మావ
వలయుఁ, గాదేని తన ప్రాణములను నైన
వాని కర్పింప వలెనను పట్టు తోడ. 151

దేవనాథుఁడు దివినుండి తేరుఁ బంపె
మాతలిని సారథిని జేసి; మంచి దంచు
దాశరథి దానిపై నెక్కి ధనువుఁ బట్టె
ధర్మ సంరక్షణార్థము దనుజు నెదుర. 152

ప్రబల శస్త్రాస్త్రముల రామభద్రు పైని
విసరె నూరక దనుజుఁడు, విఱ్ఱ వీఁగి
'పేరు మిగిలిన చాలు, నీ పోరఁ జావ
నైనఁ జత్తు' నటంచు తీవ్రాగ్రహమున. 153

రామకార్ముక నిర్ముక్త భీమబాణ
సంచయము లొక్క విడువునఁ జదల నెల్ల
నావరించుచుఁ బగతుని యాశుగములఁ
ద్రుంచి తునియలుగను జేసి త్రోచి వైచె. 154

మకుటములఁ దన్ని కొనిపోవు మార్గణములు,
మస్తకమ్ముల నొరయుచు మరణమంత్ర
ములను జపియించుఁ దూఁపులు, నిలువు నెల్లఁ
గ్రుచ్చి నెత్తురు ద్రావెడు గోలలు, పయిఁ 155

బడుచు వేధింప, రావణేశ్వరుఁడు చాల
గినిసి, ధుమ ధుమ లాడుచుఁ దనకు నున్న
శస్త్రముల, నస్త్రముల వరశక్తులఁ గొని
వట్టి విడిచెను రాఘవు పైని వడిగఁ 156

గదలు కత్తులు, తూఁపులు, కఠిన శిలలు,
చండపవనాలు, కాలాగ్ని నిండి యపుడు
కదనరంగము విలయరంగమ్ము మాడ్కి
ప్రజ్వలించెను ఘోరమై భయదముగను. 157

రణమును ముగించి యభయకరమ్ము నెత్తి
శాంతి సాధింప శ్రీరామచంద్రమూర్తి
సర్వశక్తుల లోఁగొని శస్త్రములను
భగ్న మొనరించి, శత్రువిధ్వంసకారి 158

యగుచు, బ్రహ్మాస్త్రమును బట్టి యసురపతిని
దాఁక విడిచిన, నదియు నుద్దండ మగుచు
తలల తెగనేసి, కరములఁ దఱిగి త్రోసి
ధరణి పైఁ గూల్చె రక్కను దర్ప ముడుగ. 159

తోడఁ బుట్టిన పాశము వీడ రాని
దోషమునఁ జిక్కి కన్నీళ్లు దుడిచి కొనుచు
రాక్షసేంద్రుని దహనకార్యముల ధర్మ
విధిని నెఱవేర్చె నంత విభీషణుఁడును. 160

అంత శుభలగ్నమున, వాని నర్హుఁడంచు
మకుట మందించి, దనుజసామ్రాజ్యపట్ట
భద్రు నొనరించె రాముఁడు, పలికి నట్టి
పలుకుఁ దప్పనియటుల శుభమ్ము పలికి. 161

రాము నిల్లాలు జానకి రాహుముఖము
విడిచి వెడలిన రాకేందుబింబ మటుల
హనుమ ముందుండి నడువగ నచ్చటికిని
వచ్చి రాముని కాళ్ళంటి వందన మిడ, 162

జానకీప్రియుఁ డప్పు డాశ్చర్యముగను
నిరసనముఁ జూపి సాధ్విని నరసఁ జేర్ప
కుండఁ జూఱచుఱఁ జూచెను, గోరి నట్టి
ఫలము చేకూరియును లోకశంకఁ దవిలి. 163

భావ మెఱుఁగని వారు దిగ్భ్రాంతు లగుచు
నిలువ, జానకి నుంతయు గలఁత గనని
విధముఁ జూపుచు చిఱునవ్వు విరియ, శిరము
వంచి, విశ్వాస వినయ భావములు వెలుఁగ, 164

"ఔను, వరునింట నుండిన యబల యెట్టి
సాధ్వియే యయ్యు లోకము నంశయించి
వలుకు నను మాట సత్యమో ప్రాణనాథ!
మగని నిజభావ మెఱుఁగని మగువ నేను 165

కా"నటంచును, జితిఁబేర్చి కరము మోడ్చి
దూఁక నందున, జ్వలనుఁడు తొలఁగి తొలఁగి
చుట్టి వెలుఁగుచు నామెను ముట్ట నటుల
మధ్య నిలిపెను సాధ్వియ న్మాటఁ జాటి. 166

అగ్నిపరిశుద్ధ యౌ పత్ని నంది యంత,
దనుజనాథునిఁ దోడ్కొని యనుజుతోడ
వానరులతోడ, దేవపుష్పకము నెక్కి
యోగ్య మగు రీతి రాముఁ డయోధ్య కరిగె. 167

వానరంబులు మాసాలు వత్సరములు
గణన చేయుచు క్షణ మొక్క కల్ప మనఁగఁ
గడపి, కైకమ్మ కొడుకట గడువు తీఱ
గాంచె పొలిమేరలందు రాఘవునిఁ జూడ. 168

భరతుఁడే కాదు, పురములో వార లెల్లఁ
గూడి దారులఁ గాచిరి నాడు పరమ
ధర్మరూపుండు సద్గుణ ధాముఁడైన
రామునకు స్వాగత మ్మిడి రాజుఁజేయ. 169

పుష్పకం బంతలో నటఁ బుడమి పైని
వ్రాల, వెలువడి జానకీ రాము లొకటఁ
గంటఁ బడఁగను, గంటలు గణగణ మని
మ్రోఁగె; మంగళరుతములు మొరసె బలిసి. 170

పాదముల నంటి ప్రణమిల్లి, పాదుకలను
తొడిగి హారతు లర్పించి త్రోవఁ జూపి
నడువ భరతుఁడు, సౌమిత్రి వెడల వెంట,
వానరులతోడ లంకాధిపతియు నుండ, 171

నగరమును జొచ్చి, మంగళస్నాతుఁ డగుచు
నుడుపులను గట్టి భూషలు దొడిగి ముగురు
మాతలకు మ్రొక్కి, సీతతో మకుట మందె
రామచంద్రుఁడు లోకాభిరాముఁడగుచు. 172

స్వస్తి





T.T.D. Religious Publications Series No.485
Price : Rs.15/-

వేంకటాద్రి సమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో
న భూతో న భవిష్యతి.

"వేంకటాద్రికి సమానమైన పుణ్యక్షేత్రం బ్రహ్మాండమంతటిలో ఎక్కడా లేదు. అలాగే, వేంకటేశ్వరునకు సాటియైన దైవం ఇటు భూతకాలంలో లేదు; అటు భవిష్యత్తులోనూ ఉండదు!"

---

Published by the Executive Officer, T.T.Devasthanams, Tirupati
and Printed at Sivaram Offset Printers, Nellore.